

గ్రంథకర్త:

శ్రీ గట్టి లక్ష్మీనరసింహ శాస్త్రి



అంకితము :

శ్రీ ప్రఖ్యా సమీర కుమార దేవ్

# ఆశీః

స్వస్తి శ్రీమద్భ్యః సమస్తసద్గుణగణాలంకృతేభ్యః శ్రీ గట్టు లక్ష్మీనరసింహశాస్త్రి మహాభాగేభ్యః సబహుమానమాశంసే.

*

“వర్ణ్యం గాన్ధర్వ్యాః భవతః ముఖ్యైక కాశ్యపస్య ఖ్యాతిం భూయసే,
సువిగాహ్యం సంస్కృతే గాథా సప్తశతీం నామ్నా సుభాషితమ్.

సంప్రతి సేయం సుగమా లక్ష్మీనరసింహాభిధానేన గ్రథితా,
ఆస్ఫూర్తిగిరా మనతీ అస్తి సుదర్శం మాధవే సాధతే.

సాహిత్యసేవిసంఘః సహృదయసంబోధ్యసంపదం దదతీ,
దధతీ గుణాన్ సమస్తాన్ సుధియాం సేయం సతాం సుచిరమ్.

ఇత్యాశంసా జయపురనగరపతి సమ్మాన్యసూరిమణ్డలస్య,
దేవర్షిబిరుద భట్ట శ్రీ మథురానాథ శాస్త్రిణో మనసః.”

భట్ట శ్రీ మథురానాథ శాస్త్రీ
జయపురమ్

5-1-1946

# ప్రస్తావన

## ప్రాకృతభాష

"ప్రకృతిః సంస్కృతమ్;
తత ఆగతం ప్రాకృతమ్...."

సంస్కృతము ప్రకృతి అనగా మాతృక - మూలము. దానినుండి ప్రాకృతము బయలుదేరినది.- అని ప్రాకృతభాషా పండితప్రకాండులలో ఉద్దండుడు, ప్రసిద్ధ కోశకర్త అయిన ఆచార్య శ్రీ హేమచంద్రుడు సూత్రించి ఉద్ఘాటించినట్లు, సంస్కృతము సకల భాషలకు మూలము అని యనుట నిర్వివాద సిద్ధాంతమే. అయినను, కాలక్రమమున సాగివచ్చి, ఒకప్పుడు ప్రాకృత భాష సంస్కృతమును త్రోసిరాజని, తాను సాహితీపీఠము నధిష్ఠించినది.

అందుకు కారణములు అప్పుడప్పుడు బయలుదేరిన ధార్మిక సంఘర్షములలో, జైనబౌద్ధాదులచే అర్ధమాగధి పాలీ భాషలవలె, వ్యవహారమున జనులచే ప్రాకృతభాష గ్రహింపబడుటయును; పలువురు కవులు జనసామాన్యపు అభిరుచిని గమనించి ప్రాకృతభాష నాశ్రయించి, అందు కావ్యరచనము నొనరించి దానిని పూర్తిగా అభిమానించుటయును.

కాని ఆ కవులు అన్నివిధముల తమ తమ ప్రాకృతకావ్యములలో సంస్కృతసరణినే అనుకరించి, మెఱుగులు చూపిరి. రానురాను ప్రాకృతభాష ప్రౌఢిని, మాధుర్యమును గడించుకొని, ఆత్మగౌరవమును పొందగలిగినది.

ప్రాకృతకవులు, ప్రాకృతభాషకంటె మధురమైనభాష మఱొకటి లేనే లేదను విశ్వాసమును గూడ ఆనాడు కనబఱచిరి.

రాజశేఖర కవివతంసు డిట్లు నొడివినాడు—

"పరుసా సక్కఅబన్ధా, పాఉఅబన్ధో వి హోఇ సుఉమారో,
పురుస మహిలాణం జేత్తి అమిహన్తరం తేత్తియ మిమాణమ్:"

(కర్పూర మంజరీ)

"లలిఏ మహురక్ఖరఏ జువఈజణవల్లహే ససింగారే,
సన్తే పాఇఅకవ్వే కో సక్కఇ సక్కఅం పఢిఉమ్?"

(వజ్జాలగ్గ)

పైశ్లోకములకు సంస్కృతచ్ఛాయ—

"పరుషాః సంస్కృతబన్ధాః ప్రాకృతబన్ధోఽపి భవతి సుకుమారః,
పురుషమహిలానాం యావ దిహాన్తరం, తావ దేతేషామ్."

“లలితే మధురాక్షరే యువతిజనవల్లభే సశృంగారే,
సతి ప్రాకృతకావ్యే, కః శక్నోతి సంస్కృతం పఠితుమ్?”

సంస్కృతనిబద్ధములైన ప్రబంధములు పరుషములుగా నుండును. ప్రాకృతనిబంధములు అట్లు గావు; అతిసుకుమారములు. ఈ రెంటికిని పురుషులకు, స్త్రీలకు నున్నంత అంతరము మున్నది.

లలిత లలితమై, మధురాక్షరభరితమై, యువతిజనవల్లభమై సశృంగారపూర్ణమైన ప్రాకృతకావ్యము సులభమై కనబడుచుండగా ఎవడు సంస్కృతకావ్యమును చదువ నుత్సాహపడును? — అని పైవాక్యార్థము.

ఆనాటికవుల ప్రాకృతభాషాభిమానము ఇట్టి పరాంకోటి కెక్కిపోయినది.

అట్లు ప్రాకృతభాష సర్వోత్కర్ష నొందియున్న కాలమున, హాల శ్రీ శాతవాహనుని గాథాసప్తశతి లోకమున అవతరించినది.

## సాతవాహనుడు

ప్రాకృతభాషాపరమోత్కర్షాపరభూమి అయిన గాథాసప్తశతి, ఏడు శతకములు గల ఒక గాథారత్నకోశము. అది హాలునిచేత సంగ్రహింపబడినది. హాలుడు అనగా శాతవాహనుని మారుపేరు. హాలుడు, శాలుడు, శాలివాహనుడు, సాతవాహనుడు, ఇవి పర్యాయపదములని హేమకోశాదులవలనగా విదితమగుచున్నది. కవివత్సలుడైన హాలసాతవాహనుడే ప్రాకృతగాథా సప్తశతీనిర్మాత అని విమర్శకులు సప్రమాణముగా నిర్ణయించినారు.

సాతవాహనుడు ప్రతిష్ఠానపురాధిపతి. విద్వదగ్రణి. దీపకర్ణిసమానుడు, బృహత్కథాప్రణేత అయిన గుణాఢ్యుడు, కాలాపవ్యాకరణకర్త శర్వవర్మ మొదలైన ఉద్దండపండితులెందరో సాతవాహనుని సభామందిరమున మండనాయమానులై యుండెడివారు. ఇతడు క్రీస్తుశకము మొదటి శతాబ్దిలోనివాడు. క్రీస్తుశకము తరువాత ౭౮ సంవత్సరములకు శాలివాహనశకమారంభమైనది. ప్రతిష్ఠానపురము దక్షిణాపథములోనిది.

ఒక ప్రాచీనగాథాసప్తశతీప్రతి సప్తమశతకసమాప్తిలో:—

“ఇతి శ్రీమత్కుంతలజనపదేశ్వర, ప్రతిష్ఠానపత్తనాధీశ, శతకర్ణోపనామక ద్వీపి (ద్వీప) కర్ణాత్మజ, మలయవతీప్రాణప్రియ, కాలాపప్రవర్తక శర్వవర్మసఖ, మలయవత్యుపదేశపండితీభూత, త్యక్తభాషాత్రయ స్వీకృత పైశాచిక పండితరాజ గుణాఢ్య నిర్మిత భస్మీభవద్బృహత్కథాసశిష్ట సప్తమాంశావలోకన ప్రాకృతాది వాక్పంచక ప్రీత కవివత్సల హాలాద్యపనామక,

శ్రీ సాతవాహన నరేంద్ర నిర్మితా, వివిధాన్యోక్తిమయ ప్రాకృత గీస్సంగ్రథితా, శుచిరసప్రధానా, కావ్యోత్తమా, సప్తశత్యవసాన మగాత్."

అని గద్యము కూర్పబడి యున్నది. దానిద్వారా గాథాసప్తశతీనిర్మాత అయిన హాలసాతవాహనుని పుట్టుపూర్వోత్తరములు స్పష్టముగ తెలియ వచ్చుచున్నవి.

కథాసరిత్సాగరము షష్ఠతరంగములో శాలివాహనమహీరాజుని చరిత్రము కొంత విపులముగనే వివరింపబడి యున్నది.

"మొట్టమొదట శాలివాహనునకు సంస్కృతపరిజ్ఞానమే లేదట. అతని పట్టమహిషి మలయవతి, సంస్కృతమున అపార ప్రజ్ఞ కలది. ఒకనాడు శాలివాహనుడు మలయవతితో వనవిహారము చేసి, అలసి, జలక్రీడ చేయుచున్నాడు. జల కేళి ఆడుచు ఒకరిమీద ఒకరు నీరు చల్లుకొనుచున్నారు. మలయవతి ఆ నీటిపోటును సహింపలేక, ఉక్కిరిబిక్కిరి అయి, భర్తతో — "మోదకైస్తాడయ," — అనగా — మా ఉదకైః తాడయ = నీళ్లతో కొట్టకు — అని అన్నది. సంస్కృతసంధిజ్ఞానము లేని కారణమున శాలివాహనుడు మలయవతి వాక్యములోని సంధిస్వరూపమును తెలిసికొనలేక, మోదకైః — అని తలచి, 'కుడుములు తీసికొని రావలసినది' అని, పరిచారికలకు ఆజ్ఞాపించినాడు. అది విని మలయవతి పక పక నవ్వినదట. అందుకు శాలివాహనుడు చాల సిగ్గుపడి, వెంటనే సభామంటపమునకు వచ్చి, ఆస్థానపండితుల నందరను పిలిపించి — మీలో చాల తొందరలో నాకు సంస్కృతవ్యాకరణ పాండిత్యమును కూర్పగలవా రెవరైన ఉన్నారా? — అని ప్రశ్నించినాడు.

అతని ఆస్థాన పండితులలోని శర్వవర్మ, రాజుమాట వినగానే లేచి, ఆరు నెలలలో నీకు సంస్కృతవ్యాకరణపాండిత్యమును పరిపూర్ణముగా కూర్పగలను — అని అనినాడు. వెంటనే, — అది అసంభవము, నీవల్ల గాదు — అని గుణాఢ్యపండితుడు ఆక్షేపించినాడు. — తప్పక చెప్పగలను — అని శర్వవర్మ తిరిగి గర్జించినాడు. నీవట్లు నీ ప్రతిజ్ఞ నెరవేర్చుకొనునెడల, నాకేర్పడిన ప్రచలితభాషాపాండిత్యమును విడిచిపుచ్చి, ఎన్నడు దానిని ఉచ్చరింపనైన ఉచ్చరింపనని గుణాఢ్యుడు ప్రతిజ్ఞ చేసినాడు.

శర్వవర్మ కార్తికేయోపాసకుడు. అతడు దృఢనియమములతో కుమారస్వామి నర్చించి, సంతోషపెట్టి, తాను మునుముందుగా వ్యాకరణమున నిర్దిష్టమైన పాండిత్యమును సంపాదించి, కుమారస్వామి యనుగ్రహముచేత ఆరు నెలలలో శాలివాహనుని ఉద్దండపండితుని గావించెను. గుణాఢ్యుడు ప్రతిజ్ఞానుసారముగా ప్రచలితభాషాపాండిత్యముతో పాటు ప్రతిష్ఠానపురమును గూడ వదలివేసి, అడవులకు పోయి అచట మృగములతో, పిశాచములతో,

చెలిమి సంపాదించుకొని, పైశాచికభాషలో బృహత్కథను నిర్మించినాడు. శాతవాహనుడు గురువైన శర్వవర్మకు సగౌరవముగా రత్నాదికములు గురుదక్షిణ ఇచ్చి, "భరుకచ్ఛము" అను ప్రదేశమును, అతనికి అన్నిహంగులతో కానుకగా ఇచ్చినాడు."

పైకథాసరిత్సాగరకథనుబట్టి, పూర్వోక్తసప్తశతీకాంతిగద్యమునుబట్టి విచారింపగా, ఒక విషయము మనకు గట్టిగా తెలియవచ్చుచున్నది. ఏమనగా-

"ఈశాతవాహనుడు—చరిత్రకారులు ఈతనిని 'సాతవాహనుడు' అని మాత్రమే అందురు — తాను స్వయముగా సంస్కృత భాషావైదుష్యము లేనివాడే అయినను, పలువురు కవిపండితశ్రేష్ఠులకు తాను ఆశ్రయముగా ఉండుటచేత, వారితోడి సతతసంపర్కముచేత, కవితాపరిచయము కలిగి, ఆ కళలో చతురుడు, రసికుడు అయినాడు. అందువలన ఆకాలమున ప్రచారములో ఉన్న ప్రాకృతకవితలను మిక్కిలి అభినందించుచు, తత్కవులను పోషించి ప్రోత్సహించుచు, అతడు ప్రాకృతకవులపాలిటి కల్పతరువుగా పేరు వడసినాడు. రేయింబగళ్ళు కవితాగోష్ఠులలో, కావ్యమీమాంసలలో మునిగి తేలుచు ఉండుటచేత, తత్పరినిష్ఠమైన బుద్ధివిశేషముచేత, గొప్ప అనుభవమును సంపాదించి, శాలివాహనుడు తానుకూడ సుమధురముగా అప్పుడప్పుడు కవిత్వము చెప్ప నేర్చినాడు.

## గాథా సప్తశతీ సంకలనము

"గాథా సప్తశతిని శాలివాహనుడే రచించినాడు" అని పలువురి అభిప్రాయము. కాని అదివట్టి భ్రమమాత్రమే. ఇందలి ప్రతియొకశతకముచివర

"రసిఅజణ హిఅఅ దఇఏ
కఇవచ్ఛల పముహ సుకఇ ణిమ్మవిఏ...."

అనగా—

"రసికజన హృదయదయితే
కవివత్సల ప్రముఖ సుకవినిర్మితే...."

అని స్పష్టముగా రచింపబడి ఉన్నది. దానిని బట్టి ఈ సప్తశతిలో, పలువురు మహాకవుల కృతులను 'శాలివాహనుడు సంగ్రహించినాడు,' అని తెల్లమగుచున్నది. కవిజనకల్పద్రుమాయమానుడైన ఈమహీజాని ఆస్థానమున పలువురు కవివరులు ఆశ్రయమును సంపాదించి, విశేషసమ్మానము పొందుచుండెడివారు. పలువురు శాలివాహనుని గౌరవసమ్మానము లాసించి, దూరదూరములనుండి వచ్చి, తమతమ పాండిత్యములను ప్రకటించుచుండెడివారు,

కవితాకలాపగోష్ఠీరతుడైన ఈ భూవరుడు, అతిచమత్కారములై, రసవంతములైన ఆంధ్రకవిశేఖరుల సుభాషితములను స్వజనుల చేత పత్రములపై వ్రాయించి భద్రముగ దాచియుంచేవాడు. అనంతరము సహస్రసంఖ్యలుగ సమకూరిన ఆంధ్ర రచనలలో సుప్రసిద్ధములై ఉన్నతములైనవానిని ఏరి, ఆంధ్రకవుల కీర్తిస్తంభములను లోకములో శాశ్వతముగా నిలబెట్టుటకు, ఏడు శతకములుగా సంగ్రహించి "గాథాసప్తశతి" అను పేరుతో ప్రకటించినాడు. ఈ విషయము సప్తశతిలోని ప్రథమశతకము మూడవగాథద్వారా స్పష్ట మగుచున్నది. అది ఇట్లు ఉన్నది—

(సౌకర్యముకొరకు, గాథాసంస్కృతచ్ఛాయ ఈయబడుచున్నది.)

"సప్తశతాని కవివత్సలేన కోటేర్మధ్యే,
హాలేన విరచితాని సాలంకారాణాం గాథానామ్." ౧-3

ఆంధ్రకవులచే రచింపబడిన గాథలను సంగ్రహించి, లోకములో వారి కీర్తులను స్థిరముగా నెలకొల్పుటచేత హాలునకు "కవివత్సలుడు" అను సార్థక బిరుదనామము కలిగినది. అతడు సంగృహీతమైన తన గాథాకోటియందు సాలంకారములైన గాథలు ఏడువందలు కూర్చినాడు. అనగా సంకలితము చేసినాడు అని అభిప్రాయము.

మహోన్నతోచితములైన సుఖవిలాసములలో మునిగి తేలుచు నుండు ఈ సార్వభౌముడు, గాథాసప్తశతీసంకలనమును తన చేతులతో నిర్వర్తించు శ్రమకూడ తీసికొనలే దనియే అనవలెను. అట్లగుచో—

"అవినాశిన మగ్రామ్య మకరో త్సాతవాహనః,
విశుద్ధజాతిభిః కోశం రత్నై రివ సుభాషితైః."

ఇత్యాది బాణాదుల వాక్యములు, కేవలము ఔపచారికములే అని అనవలెను.

ఈ మహారాజు నభిప్రాయమును గుర్తెరిగి, రాజసమ్మానాపేక్షతో తదాశ్రితులైన కవిశేఖరు డొకడు, ప్రభువు నభిరుచిని అనుసరించి, రాజు పేరుతో, ఈ గాథాసప్తశతిని సంగ్రహించి, వానికి సమర్పించి ఉండవచ్చును. అంతియగాని గాథాసప్తశతిని స్వయముగా శాతవాహనుడు సంకలితము చేసి ఉండలేదు, అనుట నిస్సందేహము, నిర్వివాదము.

"నిజగుణశ్లాఘచేత సంతుష్టుడై, శాతవాహన భూనేత, అతివిశేష ధనాదు లొసగి, నన్ను సమ్మానింపగలడు." అను లాలస, ఈ సంగ్రహకర్తకు అతిశయముగా ఉన్నట్లు ఈక్రింది గాథలవలన స్పష్ట మగుచున్నది.

"తవ గణ జలదసమయ భ్రమ చల విహ్వల పక్ష్మాక్షి గమ్యతే,
పరిశేషిత పద్మాశ్రైర్హంసైరివ మానసం రిపుస్త్రీః." గా. ౫-౩౦

"కః స్థగయితుం సమర్థోఽత్ర జగతి విస్తీర్ణనిర్మలోత్తుంగమ్,
హృదయం చ తవ నరాధిప! గగనం చ పయోధరా న్ముక్త్వా" ౪-౬౪

"విషమస్థిత పక్వైకామ్రదర్శనే తే తు శత్రుగేహిన్యాః,
పథికానాం కః కోనా నవాఽర్ద్రతో రుదతి డింభేహి?" ౬-౯౫

రాజును సంబోధించి చెప్పబడిన ఇత్యాది గాథలు — ఇవి ఒకానొక రాజు నుద్దేశించి, వానిని సంతోషపెట్టుటకై తదభిముఖముగా నిండుకొలువులో పఠింపబడినవి అని స్పష్టముగా సూచించుచున్నవి. విమర్శించి చూడగా, అట్టిరాజు ప్రాకృతకవికల్పతరువైన శ్రీ శాతవాహనుడు గాక, మఱొక డెవడు కాగలడు? అట్టియెడ ఈ ప్రాకృతకావ్యశోభనిర్మాత స్వయముగా శాతవాహనుడే అగు టెట్లు? కీర్తికాముడైన ఏరాజుకూడ తనచేతితో తన ప్రశంసను వ్రాసికొనడు గదా? అంతియ గాదు. కేవలము రాజు పేరటనే గాక, ప్రత్యక్షముగా శాలివాహనుని పేరు ఉచ్చరింపబడియు సప్తశతిలో శాతవాహనుని కీర్తిప్రవృత్తి సూచింపబడి ఉన్నది.

"ఆసన్నాని సులాని ద్యూత వేత హి విదతు యుష్మత్రిం నేసుమ్,
గౌరీశ్చ హృదయాదయితోఽథ శాలివాహనః రంద్రశ్చ." ౫-౬౭

కానిండు. సుప్రసన్నహృదయుడు, నిఖిలజనసమ్మాననీయుడు, మనస్వి అయిన శాలివాహనమహీపాలుడే స్వయముగా తనప్రశంసను తనచేతులారా వ్రాసికొనినాడు అని యెవ్వరైన ననగలరా? అనిన అది సహృదయు లంగీకరింతురా?

## పాలితుడు

శ్రీమదభినందప్రణీత రామచరితమహాకావ్యము, ౩౨ వ సర్గము చివర-
"హాలే నోత్తమపూజయా కవివృషః శ్రీపాలితో లాలితః .."

అని రచింపబడి ఉన్నది. ఈశ్లోకముద్వారా — పాలితుడు అను కవిపుంగవుడు సిద్ధహస్తుడై, ద్రవ్యాసక్తిచేత వచ్చి, కవివత్సలుని ఆశ్రయము పొంది, సుఖియై, తత్కృతజ్ఞతాసూచకముగా, స్వప్రభువైన హాలుని పేర గాథాసప్తశతిని సంగ్రహించి ఉండవచ్చును అని ఊహించుటకు అవకాశము లభించుచున్నది. అది నిక్కముగా అట్టిదియే అయియుండవలె. హాలుని ఆశ్రయము పొందినవెనుకనే అతడు "పాలితుడు" అను పేర ప్రసిద్ధుడై యుండెనని కూడ ఊహింపవలసివచ్చుచున్నది.

## కావ్యవైశిష్ట్యము

శాలివాహనుని నవతారుణ్యవిలాససంపద, విశేషవిజృంభణముతో వెలిగొందుచు నున్న సమయమున, ప్రాకృతభాష పరమోన్నతస్థితి నందిన కాలములో, గాథా సప్తశతి నిర్మింపబడినది. దానినే సూచించుచు సరస్వతీకంఠాభరణము—

"కే౽భూవ న్నాఢ్యరాజస్య రాజ్యే ప్రాకృతభాషిణః?
కాలే శ్రీ సాహసాంకస్య కే న సంస్కృతభాషిణః?"

అని పలికినది. ఆఢ్యరాజు అనగా శాలివాహనుని రాజ్యములో ప్రాకృతము పలుకనివారు, సాహసాంకుడు అనగా విక్రమాదిత్యుని కాలములో సంస్కృతము పలుకనివారు కలికమున కైన లేరట!

శకసంవత్సరప్రవర్తకుడైన శాలివాహనుని కాలములో ఉద్భవించినది కావున, గాథాసప్తశతీనిర్మాణ కాలము దగ్గరదగ్గర రెండువేల యేండ్లకు అందుకొనుచున్నది. "పెక్కు సభ్యజాతుల ప్రబలమైన సమాజములో, ఏ ఒక సభ్యతారీతియు అడుగిడని ఆ కాలములో సైతము భారతదేశములో అపూర్వమైన ఇట్టి ధ్వనికావ్యము నిర్మింపబడినది; సభ్యత సంపూర్ణవికాసమును పొందినదనుటకు, ఈ కావ్యమునకు ప్రాతిద్వంద్వ్యము నభూతో న భవిష్యతి అయినది." అని అనగా, ఈ కావ్యముయొక్క ఉత్తమోత్తమత స్పష్టముగా ప్రకటమగుచున్నది.

అంతియే కాక – ఈ మహాకావ్యము సాహిత్యశాస్త్రములో పరిభాషింపబడిన సర్వలక్షణములతోను సులక్షితమై ఒప్పుచున్నది. సహృదయానందకరముగా, రసికజనమనోహరముగా పనుపడ, వైశిష్ట్యమును పొందునట్లు ఈ కావ్యములో అలంకారములు మంజులపదగుంఫముతో, సహజసుందరమైన కావ్యస్వరూపము శోభావంతమై విలసిల్లునట్లు ఆసంజితములై యున్నవి. "కావ్యాత్మ" అని పేర్కొనబడు రససామ్రాజ్యమీ కావ్యములో ముఖ్యముగా నెలకొల్పబడినది. చమత్కారమైన యత్కించిత్ వ్యంగ్యమేని లేకుండ, ఏపద్యము కూడ ఈ కోశములో సంగ్రహింపబడలేదని ప్రతిజ్ఞాపూర్వకముగా ఉద్ఘోషించుటకు ఈ కావ్యము సుసమగ్రమై ఒప్పుచున్నది ఇందు. శృంగారరసము అంగి. అది అంతట అవ్యాహతముగా విలసిల్లుచున్నది. ప్రసాదమాధుర్యాదిగుణములు అడుగడుగున ఉజ్జ్వలము లగుచున్నవి, అని వేరే చెప్పనక్కరలేదు. సరసమైన కావ్యములలో అవి అవశ్యము ఉండితీరును గదా!

వేయేల? సకలశాస్త్రసారములు శ్లోకార్ధముతో విదితమైనట్లు, గాథాసప్తశతీమహాకావ్యవైశిష్ట్యమును తెలిసికొనుటకు ఈ ఒక్క మాట చాలును.

ఏమన—

"గాథాసప్తశతిని అనుసరించియే అన్నిలక్షణశాస్త్రములు పుట్టినవి."

## గా థా కో టి

కవితాకలాపకోవిదుడు, కవికులవత్సలుడు అయిన హాల శ్రీసాతవాహనుని ఆస్థానమున ముక్తకంఠముతో, మౌక్తికములను వెలబోసినట్లు, మృదుమధురార్థ సందర్భములతో, పలువురు ప్రాకృత కవులు నొడివినగాథలు, ఆనాడు వేనకువేలైనవి. అవి అన్నియు ఒక గ్రంథముగా సంగ్రథింపబడినవి. ఆనిబంధము కొంతకాలము గాథాకోశము అని వ్యవహరింపబడినది. అనంతరము వానిలోనుండి ఉత్తమములైనవానిని కొన్నిటిని మరల ఏరి, శాతవాహను డొక గ్రంథముగా తయారుచేయించినాడు. ఆసంపుటి కొంతకాలము గాథాకోటి అను పేర వ్యవహరింపబడినది.

పాలితుని పరిష్కృతికి వచ్చునంతదనుక గాథాకోటి అనియే ఆ నిబంధము పేరొంది యున్నది. పాలితుడు శ్రమ కోర్చి, వానిలోనుండి ఏడు వందల గాథలను అత్యుత్తమములైనవానిని, ఏరి ఏడు శతకములుగా కూర్చి, ఆసంపుటమునకు సాభిప్రాయముగా గాథాసప్తశతి అని పేరిడి, ప్రభువైన హాలుని పేర సంకిత మొనరించినాడు. అది నేటిదనుక హాల గాథాసప్తశతి యనియే లోకమున ప్రఖ్యాతమై యున్నది.

గాథాసప్తశతిని హాలుడే కూర్చినాడు అనియు, పాలితుడు హాలుని ఆస్థానపండితకవిమాత్రమే అనియు, పాలితుని పర్యవేక్షణకూడ 'గాథాసప్తశతీ సంకలనమున ఉండి యుండవచ్చు ననియు కొందఱమతము.

కాని గాథాసప్తశతీ సంకలన కర్త పాలితుడే అని అనుటయే సముచితముగా గోచరించుచున్నది.

## ము క్త క కా వ్య ము

గాథాసప్తశతి, ఒక సంగ్రహకోశము. అది ముక్తకకావ్యములసంపుటి.

"ముక్తకం అన్యేన నాలింగితమ్. స్వతంత్రతయా పరిసమాప్తి
నిరాకాంక్షార్థ మపి ప్రబంధమధ్యవర్తి ముక్తక మిత్యుచ్యతే."

, అని లోచనకారుడు ముక్తకలక్షణమును వివరించినాడు.

"ముక్తకము అనగా ఇతర సంసర్గము లేనిది. అనగా ఇతర పూర్వోత్తర గద్యపద్యాదికముల అవశ్యకత దానికి లేదు. చెప్ప దలచుకొనిన గాథను స్వతంత్రముగా, అది తనకు దానే చెప్పివేయుగలదు. ప్రబంధములో మధ్య

గీతమై యున్నను ముక్తకము పరసమాప్తిలోగాని, మఱి యే యితర అంశమునగాని, మఱొకదాని ఆకాంక్ష లేకయే అది స్వతంత్రముగా ప్రవర్తింపగలదు.”

ఇట్టి ముక్తకమును సాధారణకవి నిర్మింపలేడు. ఎందువలన ననగా — ముక్తకము నిట్టనిలువు రసప్రవాహనిర్భరముగా ఉండును. కావున ముక్తకమును పూర్ణగుణలక్షణ యుక్తముగా నిర్మింపవలె ననిన, అందలి ప్రతిపదము రసస్ఫోరకమై, పొల్లుపోనిదిగా నుండవలెను. అందలి సంఘటన అనగా వస్తువుకూడ రసానుకూలమైనదిగా, ఉత్తమోత్తమ మైనదిగా ఉండవలెను.

ఆలోకములో —

“తత్ర ముక్తకేషు రసబంధాభినివేశినః కవే
స్తదాశ్రయం (రసబంధాశ్రయం) ఔచిత్యమ్.
ముక్తకేషు ప్రబంధేష్వివ రసబంధాభినివేశినః
కవయో దృశ్యన్తే”

అని వివరింపబడినది.. “ముక్తములో రసబంధాభినివేశముతో వివశుడైన కవియొక్క రసబంధాశ్రయమైన ఔచిత్యము ద్యోతక మగుచు ఉండును. మహాప్రబంధములోవలె, రసబంధాభినివేశముతో సమగ్రులైన మహాకవులు, ప్రతియొక్క ముక్తకమునందును ప్రతిఫలించుచు నుందురు.”

అనగా — ఒక్కొక్క ముక్తకము కవియొక్క రసవత్తర మహాప్రబంధశత నిర్మాణ ప్రతిభా విశేషమును చాటుచు నుండును. అట్టి ప్రతిభాసంపన్నుడైన కవిగాని ముక్తకములను నిర్మింపలేడు. అట్టిమహాకవియొక్క ఒక్కొక్క ముక్తకము రసనిర్భరములైన నూరేసి ప్రబంధములకు సరితూగగలుగు నని భావము.

## మ హా క వి

ఇట్టి ఉత్తమ ముక్తక మహాకావ్యములను నిర్మించు మహనీయుడు అసామాన్యమైన ప్రతిభావిశేషము గలవాడుగా ఉండవలెను. అట్టి ఆ మహనీయుడు “ మహాకవి ” అని వ్యపదేశింపబడును.

లోచనకారుడుగూడ —

“ప్రతీయమానానుప్రాణిత కావ్యనిర్మాణ నిపుణ
ప్రతిభా భాజనత్వేనైవ మహాకవి వ్యపదేశో భవతి.”
అని వివరించినాడు.

“ముక్తకం సంస్కృతం ప్రాకృతాపభ్రంశనిబద్ధం....”

సంస్కృతనిబద్ధ మని, ప్రాకృతనిబద్ధ మని, ప్రాకృతాపభ్రంశనిబద్ధ మని ముక్తక భేదములను నిరూపించుచు ధ్వనికారుడు గాథాసప్తశతివంటిది ఉత్తమ ప్రాకత్ముక్తకము అని నిరూపించినాడు.

గాథాసప్తశతిలో ఇట్టి మహాకవులు మూడువందలకు పైబడి తమ ముక్తకములద్వారా కనబడుచున్నారు.

## గాథాలక్షణము

గాథా సప్తశతిలోని ముక్తకము లన్నియు గాథారూపములు. గాథ అనగా ఉత్తమమై, ఉదాత్తమై, రసానుకూలమైన ఒక సంఘటన అని అర్థము. అంతియగాక అనుష్టుప్ ఛందస్సువంటిదే ఒక విధమైన ఛందో నిబద్ధరచనకు గాథ అని పేరు. ఇది ప్రాకృతమున ప్రసిద్ధము. తల్లక్షణము ప్రాకృతపింగళములో నిట్లు విశదీకృతమై యున్నది—

''పఢమం బారహ మత్తా, బీఏ అట్ఠారహేహిం సంజుత్తా,
జహ పఢమం, తహ తీఅం, దహ పంచవిహూసిఅ గాహా.''

ప్రథమ తృతీయ పాదములలో పండ్రెండు మాత్రలు, ద్వితీయపాదములో పదునెనిమిది మాత్రలు, చతుర్థపాదములో పదునైదు మాత్రలు ఉండును. అనగా—పూర్వార్ధము మొత్తము ముప్పది మాత్రలతోను, ఉత్తరార్ధము మొత్తము ఇరువదియేడు మాత్రలతోను గాథ రచింపబడును.

ఇందు ఒక విషయ మున్నది — దీర్ఘమే అయినప్పటికి, ఏవర్ణమును నాలుక చదువునప్పుడు లఘువుగా చేసి చదువునో, ఆవర్ణము లఘువుగానే పరిగణింపబడును. అన్యవర్ణముతో మిళితమై యున్న వర్ణము వికల్పముగా లఘువు అగును. రకారముతోగాని, హకారముతోగాని, సంయుక్తమైన వ్యంజనము పరముగా ఉన్నప్పుడు పూర్వవర్ణము వికల్పముగా లఘువు అగును. రెండుగాని, మూడుగాని వర్ణములు చదువునప్పుడు నిలిపి చదువుటకు వీలుగాక, త్వరితముగా ఒకవర్ణముగా చదువబడునెడల, ఆ రెండు మూడు వర్ణములు ఒకేవర్ణముగా పరిగణింపబడును. ఉదాహరణమును మూలగ్రంథములో చూడనగును.

## కావ్యప్రాచీనత

గాథాకోశములోని గాథలు రసనిష్యందమునకు మూలకందములు. ధ్వనిచమత్కారములకు, శ్లేషవిశేషములకు, ఉత్తమప్రతిభకు నిదానములు. గాథలు తడవి చూచిన అంశము, ప్రకృతిలో రవంతయు కానరాదు. అప్ర

కృతిని అవి అతిమనోహరముగా, మధురముగా, ఉదాత్తముగా వర్ణించినవి. ప్రణయిజనమును అవి ప్రణయామృత రసపూరమున ముంచి యెత్తినవి. యువతీయువకుల ప్రవృత్తులను, వారివిలాసచేష్టాదులను, సంఘమర్యాదలను, సంఘజీవితములను, కుటుంబములను గాథలు ఉత్తమాలంకారములతో నిబంధించి, ఆదర్శప్రాయములను చేసినవి. గాథలలోని జానపదవర్ణనములు అమోఘములు, అసమానములు, అనుపమానసనిర్భరములు. అంతియకాక, సాహిత్యలక్షణశాస్త్రముల యవతరణమునకు గాథాకోశములోని గాథలే మూలకారణములు. ధ్వన్యాలోకము, తదాలోకలోచనము, సరస్వతీ కంఠాభరణము, కావ్యప్రకాశము మున్నగువాని కివియే పరమలక్ష్యములును, తొలిభిత్తులును.

కావున సాహిత్యలక్షణశాస్త్ర సముదాయమున కంతయు లక్ష్యభూత కావ్యవాఙ్మయ మైన ఈ గాథాసప్తశతి అన్నిటికంటె ప్రాచీనతమ మని స్వయముగా స్పష్టమగుచున్నది.

## అమరుకము

ముక్తకకావ్యసంగ్రహ మయిన హాలుని ప్రాకృతగాథాసప్తశతిని ఆధారము చేసికొని 'అమరుకశతకము' అనునొక ముక్తకకావ్యము బయలు దేఱినది. ఇది మధురమైన సంస్కృతవాణిలో కూర్పబడినది. అమరుకశతక కర్త అమరుకుడు అను నొకకవి. అతడు తన ముక్తకకావ్యమును తనపేరటనే కూర్చుకొనినాడు.

శతకము అనగా నూఱుగదా? అట్లే, అమరుకశతకములో ఉపక్రమోపసంహారములతో ఉన్న ౧౦౭ పద్యములు గాక అధికముగా సుమారు ౭౦ పద్యములవఱకు అమరుకుని పేరుతో కొన్ని ముక్తకములు ప్రచురితము లగుచున్నవి. ఆ ౭౦ ముక్తకములు అమరుకునివి కావనియు, పుండ్రక, దుర్గహాక, వామన, నరసింహ, భట్టకుమార, కుసుమదగామా, శీలాదేవీ మున్నగు కవుల, కవయిత్రుల ముక్తకములనియు, ప్రమాదవశమున నవి అమరుకశతకములో చొప్పింపబడి అట్లు అమరుకునివిగా తలపబడుచున్నవనియు, విమర్శకు లభిప్రాయము ప్రకటించుచున్నారు.

అమరుకమునుగుఱించి ఒక యైతిహ్యకథ లోకములో వాడుకలో నున్నది.— శ్రీవిద్యాశంకరగురుల చనిపోయిన అమరకుని శరీరములో ప్రవేశించి, ఆతనిరాణులు నూరుగురివలన కామకలారహస్యముల నెఱిగి, అనుభవమునకు దెచ్చుకొని, ఆ యనుభవములను కావ్యరూపమున నిర్మించెనట. ఇది వట్టి బూటకము.

పైకథను నిర్మించినది మాధవీయ సంక్షేప శంకరవిజయము. యథార్థముగా విచారించిన ఆ సంక్షేపశంకరవిజయమే మాధవీయము కాదనియు, వ్యాసాచలకవి లేక నవకాళిదాసు అను పేరుగల ఒక అచలకవి దనియు విదితమగుచున్నది.

శ్రీవిద్యాశంకరులు కలివత్సరము ౨౫౯౩ లో జన్మించె నని వైదికుల యభిప్రాయము. ఆర్యవిద్యాసుధాకరములో యజ్ఞేశ్వరపండితుడు, శ్రీవిద్యాశంకర జననకాలము విక్రమశకము ౮౪౫ అని సిద్ధాంతీకరించినాడు. శ్రీశంకరులు క్రీస్తుశకము ఏడవ శతాబ్దిలోనివా రని కొందఱిమతము.

అమరుక కావ్యకర్త యయిన అమరుకుడు క్రీస్తుశకము తొమ్మిదవ శతాబ్దివా డనియు, స్వర్ణకారు డనియు, విమర్శకులు నిర్ణయించి యున్నారు.

పైవానినిబట్టి అమరుకునకు, శంకరునకు ఎట్టి సంబంధము ఎట్లు చూచినను లేదనియు, అత డొక సామాన్యకవి యనియు నిశ్చిత మగుటయే గాక, అమరుకకావ్యసృష్టి, విక్రమాదిత్యసమకాలికుడు శకప్రవర్తకుడు నయిన శాలివాహనునికంటె పూర్వము జరిగితే దని ధ్రువపడుచున్నది. కావున సాహిత్య నిబంధకారులలో నతిప్రాచీనుడు, ధ్వనిస్థాపనాచార్యుడు నయిన ఆనందవర్ధనాచార్యుడు ప్రశంసాపూర్వకముగా నిర్దేశించిన అమరుకముక్తకములు గాథాసప్తశతికంటె పెక్కేండ్ల అంతరముతో నర్వాచీనములు గాని, ఎంతమాత్రము ప్రాచీనములు గావని తెల్లమగుచున్నది.

కావున ముక్తక కావ్యప్రపంచములో నేటిదాక ప్రసిద్ధములైన గ్రంథములలో గాథాసప్తశతి ఒక్కటే అన్నింటికంటె మొట్టమొదటిదిగా నచంచల మహోజ్జ్వల తారగా మెఱయుచున్నది. ఆ గాథాసప్తశతియే అన్ని సాహిత్యనిబంధనములకు, అన్ని ముక్తకకావ్యములకు మూలాధారమైనది.

కాని అమరుకుడు గాథల నాశ్రయించి ముక్తకములను నిర్మించుచు, వానిలో క్రొత్తదనమును సూచింపబోయి, పలుతావుల మూలమునకును, తనకునుగూడ అగౌరవమును ఘటింపజేసినవాడైనాడు.

అమరుకునిముక్తకములను లెస్సగా పరిశీలించి చూచిన, వానిలో గాథలలోవలె ధ్వనిక్షత చమత్కారము గవంతయు గోచరింపదు. కావున గాథలను వదలివేసి, శ్రోతుపాతుఉ తదన మానినయెడల అమరుకుని లేఖిని సురలేఖినియై, అతని ఒక్కొక్కశ్లోకము ప్రబంధశతాయమానముగా భాసింపకపోదు. తద్వ్యత్యస్త తదాధారములైన గాథలలోని ఒక్కొక్క గాథ ఎన్ని ప్రబంధశతములకు తులతూగునో విజ్ఞు లూహింతురు గాక.

## ఆర్యా సప్తశతి

అమరుకముతరువాత హాలుని గాథాసప్తశతి నాధారము చేసికొని 'ఆర్యాసప్తశతి' అనబడు ముక్తకసంగ్రహము గోవర్ధనాచార్యునిచే నిర్మింపబడినది. ఈ ముక్తకసంగ్రహము యావత్తు గాథాసప్తశతికి ప్రతిద్వంద్విగా ఉండునట్లు సంస్కృతములో కూర్పబడిన శృంగారప్రమేయమయ గ్రంథము. శృంగారములో గోప్యముగాని, ప్రకాశ్యముగాని యయిన ఏయే విషయమును గూర్చి గాథలు నిర్మింపబడినవో, ఆయా విషయమును ఉపపాదించుచునే ఈ ఆర్యాపద్యములు ఏడు వందలు నిర్మింపబడినవి.

కాని గ్రంథనిర్మాణమున కృతకృత్యునిగా తన్నుదాను సగర్వముగా పొగడుకొనుచు కావ్యము నారంభించిన గోవర్ధనాచార్యుడు, పెక్కు గాథార్థములను తీసికొని తనపలుకులలో పలికి, అవి తనసొంతము చేసికొనినాడు.

అమరుక గోవర్ధనాచార్యు లిరువురు తమ కావ్యములలో పూర్తిగా గాథాసప్తశతినే అనుసరించి, యావద్గాథోపజీవులుగా పేర్పడినారు. సాహసించి స్వతంత్రించినతావుల వారిముక్తకములు చాల అస్తవ్యస్తములుగా నున్నవి. కాని —

"అమరుకకవే రేకః శ్లోకః ప్రబంధశతాయతే...."

"శృంగారోత్తర సత్ప్రమేయరచనై
రాచార్య గోవర్ధనస్పర్ధీ కోऽపి న విశ్రుతః...."

ఇత్యాదిగా అమరుక గోవర్ధనాచార్యులకు లోకములో ప్రతిభ కీర్తి గౌరవము వచ్చుటకు కారణము వారు తమ కావ్యములను మధురమై సరసమైన సంస్కృతవాణిలో రచించుటయేగాని, వేఱొండు గాదు.

## విహారీ సతసఈ

ఆపిదప పై మూడు గ్రంథముల నాధారము చేసికొని వ్రజభాషలో విహారీలాల్ మిశ్ర, 'విహారీ సతసఈ' అను ముక్తక కావ్యమును రచించినాడు. అది గాథాసప్తశతిలోని గాథలనే సంగ్రహించియు, అమరుక ఆర్యాసప్తశతులకంటె విలక్షణమైన మార్గమును త్రొక్కినది. కొన్నికొన్ని ముక్తకములలో సతసఈ, నాయికలను పైపై మెఱుగులతో హృదయరహితలను జేసి వేసినది. కొన్నికొన్ని తావుల విహారీనాయికలకు గృహిణీత్వ స్త్రీత్వ భావమే ఉన్నట్లు కనిపింపదు. మొత్తము పరిశీలించిన విహారీ సతసఈలో ధ్వని కృతచమత్కారము అంతగా ప్రతీయమానము కాదు.

## వర్ణ్య వస్తువు

ప్రాకృతనిబద్ధమైన గాథాసప్తశతి, ఎక్కువగా ప్రాకృతులు అనగా గ్రామీణుల జీవితములను, వ్యవహారములను, అకృత్రిమములైన ప్రణయములను వర్ణించినది. అమ్లానాస్వాద్యములైన ప్రాకృతదృశ్యములను వర్ణించినది. స్వాభావికమనిన తనకు గల పక్షపాతము నంతయు ముక్తకంఠముగా ప్రకటించినది.

## ఆచారాదికము

అంతియగాక గాథాసప్తశతి ఆనాడు సమాజములో గల ఆచార విశేషములు, ధర్మములు, వ్రతవిశేషములు, వస్త్రవిశేషములు, ఉత్సవ విశేషములు, మున్నగువాని నచట నచట నిరూపించినది. అపరాధులకు ఆనాడు విధింపబడు శిక్షలను పేర్కొనినది. అగ్నిప్రమాదములు సంభవించినపుడు గ్రామములోని ప్రజలు పడు నల్లకల్లోలమును, ఆ మంటలను ఆర్పుటకు ప్రహతపటహధ్వనులతో వచ్చు సాధనములను వర్ణించినది.

## మతాభినివేశము

సప్తశతిలో ఆదిమధ్యావసానములలో శివపార్వతీ, లక్ష్మీనారాయణ మంగళస్తుతిరూపమైన శృంగారము వర్ణింపబడినది. నడుమనడుమ గణపతి స్తుతి, అటనట సరస్వతీస్తోత్రము కూడ గలవు. దానినిబట్టి ఆకాలమున సనాతనమతాభినివేశము దృఢముగా నున్నట్లు స్పష్టమగుచున్నది. అయినను ఛాయామాత్రముగా బౌద్ధమతముకూడ గల దనుటకు నిదర్శనముగా ఈ కావ్యములో నచట నచట బౌద్ధభిక్షువులు వర్ణింపబడినారు. ౪-౮ గాథ ఇందులకు తార్కాణము.

## ఖండరాజ్యములు

సప్తశతీకాలమున ఖండరాజ్యములు చాల ఉండెడివి. ఆయా రాజ్యములలోని గ్రామములను శాసించు విషయమున ఆయా గ్రామాధిపతులకు సంపూర్ణాధికారము ముండెడిది. ౧-౩౧, ౭-౫౮, ౭-౩౧, గాథలలో ఆ యధికారము నిరూపితము.

## రాజశాసనము

రాజశాసనమును ప్రజ లెన్నడు నతిక్రమించువారు కారు. ఏమాత్రము శాసనవిరుద్ధముగా నడచినను వానిమీద వెంటనే కఠినశిక్ష అమలు జరుప

బడెడిది. అందుల కనుపుగా ప్రజలపై రాజభటుల పర్యవేక్షణము సునిశిత
ముగా ననుక్షణము నుండెడిది. ౪-౯౬ గాథలలో నిది సుస్పష్టము.

## అ డ వు లు

సప్తశతీకాలమున నడవు లెక్కువ. ఆయడవులలోని భిల్లులు, కోయలు మొదలైనవారి నాయకత్వములు, వారి సాహసపరాక్రమములు, గజాదులను సైతము వారు వశపఱచుకొనుటయు, వారి జీవితములు, ఆచారములు, వ్యవహారములు, ప్రణయములు, భిల్లాంగనల యందచందములు, అలంకారాదికములు, అత్తకోడండ్ర ఆనుకూల్యములు, అడవులశోభ, ముఖ్యముగా వింధ్యగిరి, తత్ప్రాంతాటవుల రామణీయకము, మిక్కిలి మధురముగా మనోహరముగా సప్తశతి తన గాథలలో వర్ణించినది.

## న దు లు

గోదావరీ నర్మదానదులు సప్తశతిలో వర్ణింపబడి యున్నవి. ఎక్కువగా గోదావరీవర్ణనము కనబడుటచేత గాథాసప్తశతీరచనము గోదావరీప్రాంతమున అనగా మధ్యదేశమున జరిగినట్లు కూడ ఊహింప వీలగుచున్నది.

## స్వాభావిక శృంగారము

గ్రంథారంభమున గ్రంథసంగ్రాహకుడే నొడివియున్నట్లు, గాథాసప్తశతి శృంగారప్రధానమైనది. దీనిని నిర్మింపజేసిన సాతవాహనుడు నవతారుణ్య విలాస సంపదలో మునిగి తేలుచు, స్వయముగా శృంగారరసలోలుడై యుండుటవలననో, లేక ఆనాటి సమాజపరిస్థితులు, అభిరుచులు, అటు లుండుటవలననో, ఈ కావ్యమునందు శృంగారమే అంగిగా నిబద్ధమయినది. ఆ శృంగారము సయితము అనుదినవ్యవహారములో, జనసామాన్యపు హృదయములలో ననుభవమునకు వచ్చునట్టిదేగాని, కల్పితము మాత్రము కాదు.

## దేవవర్ణన శృంగారము

గాథాసంగ్రహకారుడు, కావ్యారంభములో — ''తే మిమం ప్రాకృత కావ్యమ్....'' అని ప్రతిజ్ఞ చేసియుండుటచేత తదనురోధముగా దేవవర్ణనములోగూడ శృంగారమునే అంగీకరించినాడు.

గాథాకోశములో — సాక్షాచ్చరాచరనాయకుడయిన పరమేశ్వరుడు సైతము సంధ్యోపాసనావసరమున సర్వమంగళాముఖాలోకన కౌతూ

హాలమున తన్ను దానే మఱచి, తత్ప్రియురాలనని మురియుచున్నట్లు వర్ణింపబడినది. ఇదే వైఖరిని గోవర్ధనాచార్యుడు తన ఆర్యాసప్తశతిలో కూడా ఆర్యలో ననుకరించినాడు.

## ఘోర శృంగారము

ప్రాకృతభాషను శృంగారములో ముంచివేయుటకయి ప్రాకృతభాషా కవులు కావ్యములలో ఎక్కువగా శృంగారమునే వర్ణించినారు. పోను పోను ఆవర్ణనములో వారు విపరీతులై, వానిలో జారులవంటి ఘోరశృంగార ప్రేమి జన వృత్తాంతములను గూడ వర్ణించినారు. రజస్వలాసంగమము, కుమారీసంగమము ఇత్యాదులు వారికృతులలో కనబడుచున్నవి. గాథాసప్తశతిలోగూడ అట్టి ఘోరశృంగారము కొంత ప్రసక్తమై యున్నది.

## వేశ్యలు

గాథాసప్తశతినిబట్టి, ఆకాలములో వేశ్యలకు గనికజనసమాజములో సంపూర్ణముగా ప్రవేశ మున్నట్లు సూచిత మవుచున్నది. ౨౪౬ మొదలైన గాథలు కొన్ని వేశ్యాప్రేమప్రసంగ ప్రశంసకములుగా నున్నవి.

వాత్స్యాయన కామసూత్రములలో వేశ్యల కపారమైన గౌరవ మర్యాద లీబడినవి.—"వారు పరమవిదుషీమణులు, చతుష్షష్టికళానిష్ణా తలు, రాజనీతిలో ఎదిరి లేని పాండిత్యము గలవారుగా నుండెడివారు. అందువలన రాజులు వారికపరిమితముగా ధనాదు లొసగి, పోషించుచు, రాజనీతిసాధ్యములైన మహాకార్యములను వారిద్వారా సాధించుకొను చుండెడివారు. ఆ వేశ్యలు కేవలము భోగోపకరణములే కారు. రాజ్యములు సుప్రతిష్ఠితము లగుటకు, కూలిపోవుటకుగూడ వారు తమ పరమ వైదగ్ధ్య విశేషములతో కారణ మయ్యెడివారు."—అని పై నిబంధాదుల ద్వారా నిరూపిత మగుచున్నది. పైగుణములు వారిలో నుండుటచేతనే కాబోలు, వారాంగనల రాజసభాప్రవేశము, నీత్యనుమతముగా తత్ప్రతి వాదము ప్రచలితమై యున్నది.

ఈ గాథాసప్తశతిలో అంతటి ప్రతిభాప్రకర్షములు లేకున్నను, మొక్కవోని కలాకౌశలముతో అసమానలై, పేరు ప్రతిష్ఠలు సంపాదించి, ఎంతటి చతురగుణవతినైనను ఈసడించి, చులుకనగా జూడగల వారాంగ నలు ౨౯౧ మున్నగు గాథలలో వర్ణింపబడినారు.

## జ్యోతిషము

జ్యోతిర్విత్ప్రసిద్ధమైన గ్రహగతిసాధనా విధానముకూడ సప్తశతి తన గాథలలో వివరించినది. ౫-౩౫ గాథద్వారా నాటి సిద్ధాంతులు హోరా శాస్త్రముపై నెక్కువ అభిమానము గలిగి యున్నట్లు ఊహింప వీలగుచున్నది.

## వైద్యకము

శరత్కాలమున జ్వరపడినరోగి పిత్తమును వమనము చేసికొనును. ఆ పిత్తముతోపాటు రక్తముకూడ కలిసి పడు నని పేర్కొనుచు, ౬-౬౨ గాథ నిర్మింపబడినది.

## పినతల్లులు - మేనత్తలు

గాథాసప్తశతిలో ఎక్కువగా పినతల్లులు, మేనత్తలు, (నాయికకు మాత్రమే) వర్ణింపబడినారు. వీరు ప్రసంగమునుబట్టి వితంతువులై యున్నట్లు తెలియవచ్చుచున్నది. దురదృష్టవశమున తను కట్టి సుఖము దూరమైపోయి నందువలననో, లేక లోకానుభవమునుబట్టియో, వారు తమకూతురు, లేక మేనకోడలు ప్రణయభంగముతోగాని, గృహకలహముతో గాని ఏమాత్రము బాధను లోనైనను సహింపలేరు. వారిని ఓదార్చి వారయభి మతమును వెంటనే సమకూర్ప ప్రయత్నింతురు. ఆ నాయికలకు గూడ తమమనస్సులోని మాటలు చెప్పుకొనుటకు ఈ మాతులానికంటె మఱొకరు విశ్వాసపాత్రములైనవారు, ఆప్తులు లేరు. పతిపరాయణలు, పరాసక్తలు నయిన నాయికలకు ఈ మాతులానులే అత్యంతము మధ్యవర్తినులుగా పను పడుచుండురు. ఈ విషయమును గాథలు పలుమారులు, పలుతెఱగుల వర్ణించినవి.

## నీతి

గాథలలో నీతిసూక్తులు, సరసతరములుగా గ్రథింపబడి యున్నవి. ౧-౮౩; ౨-౧౩; ౨-౩౫; ౨-౩౬; ౨-౮౬; ౩-౫౦; ౩-౫౩; ౪-౧౯; ౪-౯౦; ౪-౨౧; ౫-౨౪; ౬-౧౨; ౬-౪౧; ౭-౯౫; ఇత్యాది గాథలు అందులకు నిదర్శనములు.

## శ్లేషచమత్కారము

సహృదయ హృదయానందకమైన శ్లేషచమత్కారముకూడ గాథలలో మనోహరముగా రచింపబడినది. ఉదాహరణకు ౬-౬౮; ౭-౫౭; ౭-౬౫; గాథలు చాలును.

[ష]

## టీక

గాథాసప్తశతి పయూల మీదను ధ్వన్యర్థ బహులము. కావున గాథలు నిరూపించు ఉదాత్తవిషయములను లెస్సగా గ్రహింపవలె ననిన, మంచి టీక కావలెను.

మొట్టమొదట గాథాసప్తశతికి కులబాలదేవుడు (ఇతని పేరు గ్రంథాంతరములలో 'కులనాథదేవుడు' అని కనబడుచున్నది.) టీక వ్రాసినాడు. ఆ తరువాత గంగాధరభట్టు వ్రాసినాడు. కులబాలదేవునిటీకకంటె గంగాధరభట్టుటీక కొంచెము మెఱుగు.

కాని, గంగాధరభట్టుటీక చాలచోట్ల ధ్వన్యర్థవైభవమును దిగ్రమింగి వైచిన దనియు, వ్యంగ్యార్థభంగముతో పలుగాథామహత్త్వమే అపాస్తమగుచున్న దనియు నిరూపించుచు, రాజపుతానా జయపురాస్థానవిద్వాంసులు పండిత దేవర్షి భట్ట శ్రీ మథురానాథశాస్త్రి సాహిత్యాచార్యులు మరొక టీకను రచించి ప్రకటించిరి. నా అనువాదమున నేను చాలవఱకు శ్రీమథురానాథశాస్త్రి గారిటీకనే అనుసరించితిని.

## గాథాకవులు

గాథాకోశములో లోకోత్తరులైన మహాకవిమూర్ధన్యులు పలువురు స్వప్రతిభారూపమున ప్రతిభాసించుచున్నారని పూర్వమే నివేదించినాను. వారలకు సాహిత్యరంగమే కాదు, యావత్ప్రపంచము విజ్ఞానఘనోపాదానము ద్వారా ఋణపడి యున్న దనుటలో అతిశయోక్తి లేదు.

గాథాకోశమును విమర్శించుచు అందలి గాథాకారులను గూర్చి మహామహోపాధ్యాయ పండిత దుర్గాప్రసాదశర్మ— "గాథాసప్తశతి పురాతనప్రతులలో కొన్నికొన్ని గాథలచివర తద్రచయిత పేరుకూడ— పాలస్స, పోడిసస్స, చుల్లోహస్స, మలగన్దసేణస్స, అమరరాఅస్స—ఇత్యాది షష్ఠ్యంత నామములు అంకితములై యున్న వనియు; రానురాను అవి లేఖకప్రమాదమున పోయిన వనియు; ధ్వన్యాలోక, సరస్వతీకంఠాభరణ, కావ్యప్రకాశాదులలో ఆ షష్ఠ్యంతనామములు లేకుండగనే గాథలు సూచింపబడిన వనియు; జర్మనీలో ముద్రితమైన గాథాసప్తశతిలో మాత్రము చాలవఱకు ఆయాగాథలచివర ఆయా గాథాకారుల షష్ఠ్యంతనామములు ముద్రింపబడి యున్న వనియు,"— వ్రాయుచున్నారు.

వారివిమర్శమును బట్టి చూడగా గాథాకోశములో— మొదటి శతకమున— ౯౬; రెండవ శతకమున— ౮౮; మూడవ శతకమున— ౯౮; నాలు

గవ శతకమున— ౯౦; ఐదవ శతకమున— ౧౯; ఏడవ శతకమున— ౭; మొత్తము ౩౯౩ షష్ఠ్యంతనామము లున్నట్లు తెలియుచున్నది.

వీనిలో ఒక్కొక్కకవి పేరు చాలపర్యాయములు వేలువేలుగాథల మొదట నున్నది. మిక్కిలి రసవత్తరము లగుటచేతనే ఒక్కొక్కకవివి పెక్కుగాథలు గాథాకోశములో సంగ్రహింపబడి యున్నవి. వానిలో స్వయముగా గాథాకోశ సంకలన కారయిత యగు హాలునివియు, గాథాకోశ సంకలనకర్త యగు పాలితునివియు గాథలు కూడ నున్నవి.

పైసూచికావివరముబట్టి హాలునిచేత పాలితునిద్వారా సంకలనము చేయింపబడిన గాథాసప్తశతీకోశములో సాంద్రయశశ్చంద్రికా నిస్తంద్రులైన లోకోత్తరకవిచంద్రులు మూడువందలకు పైబడి పరమపవిత్రములై చిరస్మరణీయములైన అభిధానములతో విలసిల్లుచున్నారని విదిత మవుచున్నది.

# తెలుగు పదములు

తెలుగులో తడి అను నర్థము గల తేమ అనుపదము క్త్వార్థమున అనగా తడి చేసి అను నర్థమున తేమిత్వా అని కూర్పబడి యీ ప్రాకృత గాథాసప్తశతిలో ప్రయోగింపబడి యున్నది. ఇట్టి తెలుగు పదములు సుమారు పదునెనిమిది గాథాసప్తశతిలో కానవచ్చుచున్నవి.

# ఉపసంహారము

ఇట్లు మహావిద్యాంసురాలు, తన పట్టమహిషి అయిన శ్రీమలయవతి ప్రేరణచేత వ్యాకరణాది శాస్త్రముల నభ్యసించి, ఉత్తమకవియై, పలువురు కవిచంద్రులకు ఆశ్రయమై, స్థిరమైన కృషితో గాథాసప్తశతీనిర్మాణమునకు కారణభూతుడై, తద్ద్వారా శాస్త్రకారులకు, ముఖ్యముగా యావత్సభ్య ప్రపంచమునకు విజ్ఞానామృతమును పంచిపెట్టిన కవివత్సల హాలశ్రీ శాతవాహనునకు మనము జోహారు లర్పింప వలసి యున్నది.

అందు ముఖ్యముగా గాథాసప్తశతీకోశ సంగ్రథనభాగమును తనపై నిడుకొని, శ్రమపడి, ఉత్తమోత్తమ గాథారత్నములను ఏరి కూర్చిన శ్రీ పాలిత కవికులతిలకునకు ధన్యవాదములు.

# అనువాదములు

శృంగారరచనమునకు పెట్టినపేరు శ్రీనాథకవిసార్వభౌముడు గాథాసప్తశతిని తన మృదు మధుర లేఖినిలో అనువదించి పెదకోమటి వేమునకు

మంత్రివర్యుడైన మామిడి సింగన్నకు సోదరుడైన ప్రెగడన్నకు శాలివాహనసప్తశతి అను పేర అంకితము చేసినట్లు శ్రీనాథుని వచనముల వలనగా విదితము. కాని క్రీడాభిరామములో కనబడు రెండు మూడు పద్యములు తప్ప ఆ గ్రంథ మిపుడు మనకు కనబడుటలేదు.

ఆధునికులు కొందఱుకూడ గాథాసప్తశతి అనువాదమునకు పూనుకొనినట్లు తెలియవచ్చుచున్నది. అది ముదావహమే. కాని శ్రీనాథాదుల మధురలేఖినిలో రూపొందవలసిన యీ కావ్యమును అస్మాదృశులు అనువదింప బూనుట సాహసమే అనవలెను. అయినను గుణదోషజ్ఞులు, క్షమాశీలురు అయిన సహృదయులు పలువు రున్నారు. కావున నా సాహసము కొంత ఫలవంతము కాగల దనియే నమ్ముచున్నాను.

## కృతజ్ఞత

ఈ నా గాథాసప్తశతీ అనువాదప్రయత్నము అన్నివిధముల రాణించి వన్నె కెక్కుటకు దయతో తమ విమర్శవ్యాసముల ననుసరించుటకు ఆశీః పురస్సరముగా అనుమతి నొసగిన దేవర్షి పండిత భట్ట శ్రీ మథురానాథ శాస్త్రి సాహిత్యాచార్యవర్యులకు నా కృతజ్ఞతాపూర్వక నమస్కృతులు.

ఈ నా గాథాసప్తశతి సహృదయ రసికలోక హృదయానందియై లోకమున చిరకాలము విలసిల్లగల దని విశ్వసించుచున్నాను.

తెనాలి
13-2-1946

గ. ల. న. శాస్త్రి
రచయిత

# గాథా సప్తశతి

## మొదటి శతకము

మంగళాచరణము —

ఈసునఁ గొన్నగోసమున నెత్తురిచాఱులు మించి, సంచర
చ్ఛ్రీసఖ మద్రిజాముఖ శశిప్రతిబింబము సంక్రమింపఁ, బూ
జాసముపాహితార్ఘ్య జలజాతయుతంబుగ నొప్పు నీశుసం
ధ్యాసలిలాంజలిన్ రసవిధాననిధానముగా నెఱంగుఁడీ! ౧

గాథాకోశ నిర్మాణమున హేతువు —

చిలుకునఁ జిల్కునం జవులు చిప్పిలునట్టి నవామృతంపుజాల్
పలుకునఁ బల్కునం గుఱియుప్రాకృతకావ్యము చిత్తహారి యై
నెలకొనఁగాఁ బఠింప విన నేరనివారలు వార కెట్లు ల
జ్జిలరు సుమాస్త్రశాస్త్రపరిశీలనముం దలపెట్టుపట్టునన్! ౨

తన గాథాసప్తశతీప్రబంధము అవశ్యము ఉపాదేయము అని —

కవికులవత్సలుం డన జగమ్మునఁ గమ్రని కీర్తితోడి వై
భవము గడించుకొన్నమహీపాలుఁడు హాలుఁడుకూర్చె నేర్పుతో,
వివిధములౌ నలంకృతులఁ జేర్చిన గాథల నేడు నూర్లుగా,
నవరసవాటియై బుధమనమ్ముల విందులు పెట్టు కోటిలోన్. 3

మఱుగుగా ఉన్న ఒక కమలినీఫులినములో నాయికా నాయకులు సంకేతము నేర్పఱుచుకొనినారు. అన్యాసక్తుడైనకతన నాయకుడు ఒకనాడు నిర్ణీతసమయమునకు అచటికి రాలేదు. నాయికమాత్రము వచ్చి, వానికై

వేచి వేచి, విసివి వెళ్ళిపోయినది. పిదప ఆమెతో అచట కలిసికొన్నప్పుడు ఆతడు— వచ్చెద నని చెప్పి, నన్ను నమ్మించి, నీ వానాడు రాకుంటివేమి ?— అని యెదురు లాడ గడగినాడు. అపుడు వానికి ఆజవరాలు సరసముగా—

చాల మఱుగుగా ఉన్న కారణముచేత, ఆ కమలినీపులినము మన సంకేతమునకు అనువుగా ఉన్నది,— అని ఒకతె, నాయకునకు సూచించుచు—

ఇది చాల రహస్యమైన ప్రదేశము... అని నాయకుని, దీర్ఘగమణాగ్రము పురికొలుపుచు, నాయిక నాయకునితో—

లేక కదలిక మెదలిక లేశమేని,
నదిగో తామరపాకుపై నల బలాక
నిలిచి పొలుచుచున్నయది కంటివె, మరకత
శుభ్రపాత్రమ్ముపై శంఖశుక్తి వోలె. ౪

రతి ముగిసిపోయినను ఇంకను కటాక్షభుజాలింగనాది విభ్రమములను నెఱపుచున్న నాయికతో ఆమెసఖురాలు, అనుశిక్షణముగా—

కలువపూలరేకుల నవ్వఁ గలుగు వాలు
గనులు మూఁతలు గొనకుండుదనుకఁ జూవె
పోరిదిఁ గులుకులు గులికించు, సుఖదసురత
వేళ మహిళామణుల కెల్ల విభ్రమములు. ౫

తన పూలతోటలో కురవకతరువునకు దోహదక్రియ సాగయు నాయకుని గని, నాయికసఖురాలు —

సరసుఁడా! స్వదోహదలీల నరయఁ బోవు,
కురవకతరువునకు మాత్ర కుదిరినాఁడ,
వనుచు నెమ్మోముపిరిదమ్మి నవలఁ ద్రిప్పి
నెలవునన్ నవ్వుచున్నది నీదుగృహిణి. ౬

వసంతసమయమున దూరప్రయాణమునకు సమకట్టియున్న నాయకు నధిక్షేపించుచు, నాయికసఖురాలు —

ఒక ప్రోషితపతికయొక్క సఖురాలు వసంతాగమమును, ఆసమయమున తనసఖురాలి విరహవ్యథా అసహనత్వమును సూచించి, ఆమె ప్రియునకు ఇట్లు జాబు వ్రాసి పంపినది —

దయితులు విప్రవాసమున దవ్వుల నుండినయు ష్ణశోకసం
చయములు కూలఁద్రోయుఁ బెలుచన్ వెతలం బడఁగా విదగ్ధలా
దయితల నెల్ల; సం దెఱిఁగి తాఁ గొని లా, వొక లాఁతివానిదు
ర్నయపుఁబదప్రహారముల రాఁపున కోర్చునె యెవ్వఁడేనియున్ ? ౬

ఇక మన కీ యెండిపోయిన నూవులపొలము కాదు; విజనమైన ఆ తామరకొలనుగట్టున సంకేతము నేర్పఱుచుకొనవలె, — అని జారునకు తెలియ బఱుచుచు అత్తగారితో నూవులచేనిముచ్చట సాగించి, ఒక కామిని —

మనగ్రామమ్మున కెల్ల నేఁటిదనుకన్ మాన్యస్థితిం గ్రొత్తమం
డనమై యేర్పడి యున్న యా కమలఖండం బిప్పు డీ దుష్టహే
మనకాలమ్ముబలమ్ముచేత నొనరింపంగాఁబడెం, గంటె, నె
ట్టన లూనమ్మయి యిమ్ముసెడ్డ తిలవాటమ్ముట్లుగా నత్తయా! ౭

వరిచేను సంకేతస్థలముగా ఒక పల్లవాధరికి ఒక పల్లవునితో కొంత కాలము గడచెను. వరిపైరు లెస్సగా పండ కోతకు రాగా సంకేతభంగవిధురయై, సంకేతస్థలాంతరమును తెలియబఱుచుచు, సఖురాలు నాయికతో —

పండి వెలివాఱె వరిపైరు లెండినంత,
వంతఁ బడె దేల యిటు మోము వంచి నీవు ?
పొలఁతి! హరితాలమండితముఖము మెఱుఁగు
జనపచే నదె నటివలె గొనబు మిగులు. ౮

కలహాంతరిత అయిన కాంతను తిరిగి కాంతానువర్తనమునకు త్రిప్ప ప్రయత్నముతో చెలికత్తె, ఆమెతో —

లేఁత పీఁతపిల్లనరాలరీతిఁ గుటిల
ము లగు వలపుతీఁగలగతుల్ వెలయు నిటులె;

కుటిలకుంతల! చింతలఁ గుతిలపడకు
మింకఁ, దిర్యగ్గ్రీవలితపు ముఖేందు నెఱపి. ౧౧

మగడు అడుగులపై బడి వేడుకొనగా కోప ముడిగి ప్రసన్నయై వానిని గూడిన ఒకమానిని, మఱునాడు తనసఖురాలితో తనయుదంతమును గూర్చి అన్యాప్రసంగముగా—

అలుకతో ఎడమొగము పెడమొగము అయిన నాయికానాయకులను ఎట్లో సంధానపఱిచి వచ్చిన ఒకతె, మఱునాడు వేఱొకతెతో, వారి గూర్చి వృత్తాంతమును వివరింప బూని —

ప్రేమాల నడుగులపై బ్రాలి జాలి వేఁడు
కొనెడు చెలువునివీఁపుపై ననుఁగుబుడుతఁ
డెగసి యెగఁబ్రాఁకుపనిఁ గొన, నగవు సైఁత
మలిగి యున్న యిల్లాలిలో నిలువదయ్యె. ౧౧

ప్రియుని ప్రశంసాపూర్వకముగా నిందించుచు, దూతిక వానితో —

ఇంతులమిన్న నిన్నుఁ గన నెంతయు నువ్విళులూరు, నిక్కనం
బింతయు; నీదుజోడులపయిం బ్రణయం బెసలారు; నామె నీ
వంతునఁ జావనిమ్ము; పొరపాటున నేనియు నిన్ననంగ నా
వంతయు సందు లేదు; దిపుడ యామె గతించుటకూడ మేలె యగా.

మాలిన్యశంకచేత గృహకార్యపరాఙ్ముఖియై యున్న సఖురాలితో చెలికత్తె —

పులుముకొని వంటపని మసి మలినమైన
చివురుచేత సంస్పృష్టము చెలువమోము
హరిణలాంఛనునునుగోము నాముకొసియె
ననుచు నుల్లసిల్లెఁ బ్రియుండు హాస మొలుక. ౧౩

ఎంత ఊదినను నిప్పు మండకుండుటచేత విసిగికొని, చికాకుపడుచున్న ఒక పడతినిగూర్చి, తన అభిలాషమును ప్రకటపఱుచుచు ఒక కోడెగాడు —

రంధనకార్యమందు జవరాల! వలంతివ యౌమతే, యుమ
ష్వాంధవు కాకుమా! మఱగి హాయిగఁ ద్రావఁగ రక్తపాటలా
గంధసుగంధబంధురతఁ గ్రాలిన నీ ముఖగంధవాహమున్,
గంధిలవేణిరో! పొగలు గ్రక్క దొడంగెను మండ కగ్ని తాన్.

ఒకతె మఱొకతెతో —

ఎది యేదిష్టము నీకుఁ దెల్పుమని యెంతే గ్రుచ్చియుం గ్రుచ్చి స
మ్మద మొప్పారగఁ గూర్చు నెచ్చెలులు తన్ బ్రశ్నింపఁ గాం గ్రొత్త దో
హదమున్ మోసిన ముద్దరాలి ప్రణయావ్యాజంపు వాల్చూపులో
ప్పదరస్మేరముతోడ వ్రాలిపడియెం బోత్పత్తి చిత్తేశుపై. ౧౪

ప్రోషితపతిక ఒకతె, ప్రియతమసమాగమవిషయమున పరిజనమును తొందరించు నాహాతో చంద్రప్రార్థనావ్యాజమున ననె —

అమృతమయైకమూర్తివి, విహాయసభూమికి శేఖరుండవు, వు
త్రక్కముఁడవు, రాత్రి నెన్నొసట గందవుబొట్టువు, చందురుండ! కూ
రిమి స్పృశియింపుమయ్యు, ప్రసరింపఁగఁ జేసి, మదీయవల్లభుం
బ్రముదముతో స్పృశించినకరమ్ములతోడన నన్ను సైతమున్!

బిగువు నుపదేశించు చెలికత్తెతో ప్రోషితపతిక —

ఏగెను దూరదేశమున కింట ననున్ విడనాడి యొంటిగా,
రాఁగలఁ డింక, నే నలిగి రాఁపునఁ బెట్టెద, నంత నాతఁడున్
వేఁగుచుఁ గాళ్ళ వ్రేళ్ళఁబడి వేఁడుకొనం గలఁ, డన్న కోరికల్
సాగి ఫలించు టే చిరసుసంభృతభాగ్యము గల్గు నింతికో! ౧౬

ఈ నడికాలుకోడెతనపు రోజులలో ఇట్లు చిక్కిపోవుచుంటివేమి ?— అని స్నేహితు డొకడు తన ప్రియతముని అడుగుచుండగా విని— అతడు బహు

మహిళాకృష్టుఁడై అట్లు అయిపోవుచున్నాఁడు సొమ్మని సేర్ష్యోపాలంభముగా, అన్యాపదేశవిధమున ఒక నాయిక, చెలికత్తెతో —

అనయముగాఁగ ఘాతమును నొయ్యిను, ఘాతగతిం బడల్చి ప
ట్టిన నీటు పట్టి దుర్గతికుటుంబము ఊరక పిండి పిప్పి చే
యు, నిఁక సహింతు నెంత కని, యంచులనుండి స్రవించు నీటితో
వనరుచునున్నయట్లు కనుపట్టు నిసల్లటె వల్వ, గంటివే! ౮

కాముకుఁడొకఁడు తన అభిలాషమును ఒకనాయికకు ఎఱుకపఱుచుచు ఆనాయిక యింటిలోనికి పోవుచు ఉన్న ఒక లేగదూడను చూచి అన్యాపదేశముగా —

అవ్విధిఁ గ్రొత్తమావియివు రాకను బోలిన మేనితోఁ జెవుల్
చివ్వున రిక్కవెట్టుకొని, చెంగున దాఁటులు వేయుచుంటి వో
మవ్వపుఁగోడెదూడ! మది మాలిమిఁ గోరిక సేయు నిఁటికం
బ్రువ్వక పర్వఁ జొచ్చని పొందుము గీ ధవలత్వ మెంతయున్

దొంగనిద్రతో ఉన్న చెలువునితో చెలువ చమత్కారముగా —

కాంతుఁడా! దొంగనిదురలోఁ గనులు మూసి
యుంటివే? సెజ్జపైఁ దావు నొసఁగుమయ్య!
ముద్దుగొనినంతఁ బులకలముద్దలైన
చెక్కిళులవాఁడ! యిటు లాలసింప నింక. ౧౦

వెలయాలిని పిలిచికొనిపోవుటకు నాయకుని చెలికాఁడు రాఁగా, ఇంట నున్న విటుని కప్పిపుచ్చుచు వేశ్యమాత కూతురుతో —

సింగారించుకొనంగవచ్చు నవలన్, శీఘ్రమ్ముగాఁ బో, ఇమ్మదే
బంగారంపుఁబ్రియుండు నీకొఱకుఁ ద్రోవల్ చూచుచున్నాఁడటుల్
పొంగుల్ వాఱిన కౌతుకమ్మడఁగిపోఁ బుత్రీ! క్షణమ్మోని ని
ల్వఁగా నేరవు నీవు నా సహృదయ ప్రాంతమ్మునన్ సమ్మ్రమా!

ఒకడు ఒకగజస్వలతో తనకు గూడిన ప్రణయఘట్టమును గూర్చి ముచ్చటింప మొదలిడి చెలికానితో —

ప్రోషితు డొకడు అనురాగాతిశయసూచకమైన తన ప్రియురాలి స్పృష్టకాలింగనమును తలపోసికొనుచు —

అంచితలీల డాసి, మధురాధరబింబపుటంబు వంచి, యే
యుంచున నాసికన్ నొసలు నంటఁగనీక, రహఃప్రవృత్తిఁ బా
లించుచు, శుభ్రఘనర్ణఘృతలిప్తముఖాంబుజ యామె గొన్న యా
మంచి జవాజిముద్దు♦ స్మృతిమార్గముఁ బాయదె వేలనేనియున్!

పదుగురిలో ఉండికూడ ప్రియతమును నిగుణించి శృంగారచేష్టలను ప్రకటించుచు నున్న సఖురాలికి, తెలివితేటలు గల యువతులప్రతో— ఒక ప్రచ్ఛన్న కాముకుడు వర్ణించిన ఒక కులీననాయిక యొక్క గాంభీర్యగుణమును వినుమని ఒకతె —

నిసి రతమునఁ జెక్కుళ్ళు వికసితములుగ
నరుసమున, వందలాదిగ నాజ్ఞ లిడిన
పడతి, యుదయాన వంచినవదన మెత్తఁ
గగపడుదు, నమ్మలేనైతి నామెయె యని. ౨౩

మఱొకతె పై తవులాటమున మునిగి, గురుజనమర్యాదను సాకుగా పెట్టి తను జేర రాక తిరుగుచు ఉన్న నాయకుని నిందించుచు ఒక నాయిక కులీనతా నమస్కారవ్యాజముతో—

ప్రియునితో నెడఁబాటు, నప్రియుజనమ్ము
చూపు, ననఁబడు నీ పెద్ద సొదలు రెండు
గండుకొని కూర్చ నిమ్మోయిఁ గతమ యాయిన
నీ కులీనత కిదె నమోవాకమయ్యా! ౨౪

♦ మూలమునందలి ''పరిఊన్చుబణం'' అను పదమునకు ''పరిగహ్చుబణం'' అనికూడ అర్థము ఉన్నది. అప్పుడు, కౌగిలించుకొని, నమితాధరపుటముతో, జాగ్రత్తగా ముద్దు గొనుటను చెప్పుకొనవలెను.

ఇంతేగాక వేఱొక వేళ ప్రమాదమును పొందినావు? అని ఒకడు అడుగగా, ఆతని స్నేహితుడు గోకుడు ఎకసక్కెముగా —

చపలతతోఁ బ్రదక్షిణము సాగి వసుంగిను తేఁడి నొక్కచే
యుపశరునమ్ము గాంచల ప్రయాణపుఁబూవిక్కకి, వ్యాకులస్థితిం
దవటవ నీ రుచల్పుచుఁ గొలంకుల, నానికలల్ గలట్టి ని
ద్దవుఁ బ్రియు గాలి వాలుగను దామర రేకులు నట్టివే సుమా! — ౨౨

అన్యవనితాసక్తుడగుటచే ప్రియురాలిచేత సోపాలంభముగా తిరస్కృతుడైనాడు. పిదప ఆతడు తనతప్పిదమును కప్పిపుచ్చుకొనుసాహసముతో ఆమెమీద అలిగి బిగిసినాడు. పాపము ఆమె యతనితో ప్రతిమాలుకొనినది. అయినను ఆతడు ప్రసన్నతను గాంచేదు. అంత ఆ ప్రణయిని వానితో సప్రేమదండముగా నిట్లనినది —

అనుఁగును గూడిమాడి నిసి హాయిగఁ బాన్పునఁ బవ్వళించి తె
స్స నిదుర వోయి మేల్కనినజాముచ శూన్యతపార్శ్వమోహణ
మ్మునఁ బడువారిబాధ నిజబుద్ధి నెఱుంగఁగ నేర్తువా? వితా
కినుక వహించి యింతగ బిగిం జెడకుందువు గాదె నీ విటుల్!

సఖురాలు చమత్కారముగా నాయికతో —

పోలయుల్లన్ బిగువ్రాల్, యువ్వలి మొగంబుల్ వెట్టి, లోనాఁగియూ
ర్పులు మెల్లెల్లనఁబుచ్చుచున్, శ్రుతిపుటంబుల్ వెట్టియాలించుచుం
దలిమమ్మందున నొక్కటం గపటనిద్రాముద్రఁ గైకొన్న క
న్నులు విప్పాటఁ, బరున్న మాయిరువురందున్ గెల్పు లెవ్వారివో!

నీవు కోరుచు ఉన్న ఆనాయిక దేవరానురక్త. కాబట్టి సాధ్యపడుట అంత తేలిక కాదు.— అని సూచించుచు దూతిక కాముకునితో —

ననవవమా అతం గరమునం గొని పొంగుచు దేవరుం డెయే
యువయువపల్లవమ్ముల సమాహతిఁ గూర్పఁగ నూహసేయు, నా

యవయవపాళియందుఁ బులకాంకురముల్ ప్రకటమ్ములై సము
ద్భవమునఁ బెంపు సెంది గనుపట్టు, వధూమణి కుల్లసత్స్థితిన్.

తనప్రియతము డున్నచోటికి పోవుచున్న జనమును చూచి, వానిని తీసికొని రాగా తొందరించుచు ఒక ప్రోషితపతిక —

చెలువునిఁగూడి కాంచిన విశేషసుఖానుభవమ్ము లన్నియుం
దలఁచి తలంచి తల్లడిలు నా చెవులం బడఁ జొచ్చె నేఁడు, వి
హ్వలత నడల్చు నధ్వపటహమ్ములయట్టులు, క్రొత్తకారుమ
బ్బులు వెలిగ్రక్కు నగ్గలపు మ్రోఁత లతం డెడయాట గోరమై.

అందము చందము లేని భాగ్యమీద గాఢానురక్తుడైన గ్రామపాలక పుత్రునితో మఱొక కామిని యొక్క దూతిక ఎకసక్కెముగా —

ఓయి గ్రామపాలకపుత్ర! యొక్కమాట,
నిర్దయుండవు, విల్లాలన నీల్గి వెఱతు,
వగపడ వెవేళ, వేఁపపుర్వట్టిదొరవు,
సన్నగిలుచున్న దీయూరు నిన్నుగుఱిచి. ౩౦

గ్రామాధికారి పెద్దకోడలిమీద మనసుపడినను, ఆమెమగడు సుభటుడగుటచేత భయపడి ఉపగమనమునకు ఉంకింపక శంకించుచున్న ఒక కాముకుని, నీవు భయపడ నక్కఱలేదని ప్రోత్సాహపఱచుచు, — ఆమె మగని మీద అనురక్త కాదు కాబట్టి నీకు తప్పక వశపడగలదు; ఇంటిలో నీవు సుఖముగా ప్రవేశింపవచ్చును; ఆమెను పొందవచ్చును; నిర్భయముగా నిరాటంకముగా తిరిగి రావచ్చును; — అని తెలియబఱుచుచు దూతిక సుభటస్తుతి వ్యాజమున —

♦ ప్రహరవనమార్గవిషమమహా గ్రామమందు
జనము సుఖముగ నిదురలో మునిఁగిపోవు;
గ్రామణీసూనుపిల్లాలు కడఁగి యెటులొ
కునుకు నాతనిఁబొమ్మునఁ గును కొకండు. ౩౧

♦ ఈ పద్యమునకు ప్రాకృతమూలము ఇటు లున్నది —

"పహరవణమగ్గవిసమే జాఆ కిచ్ఛేణ లహఇ సే ణిద్దం,
గామణిఉత్తస్స ఉరే పల్లీ ఉణ సా సుహం సువఇ."

దీనిలో — 'ఉరే' అనుదానికి 'ఉరసి' అని, 'పురే' అని, రెండర్థములు లభించుచున్నవి. అట్లే — 'పహరవణమగ్గవిసమే' అనుదానికి 'ప్రహార వ్రణమార్గవిషమే' అని, 'ప్రహారవనమార్గవిషమే' అని రెండువిధములుగా అర్థము లభించుచున్నది. దానినిబట్టి ఇట్లు అర్థమును గ్రహింపవలెను —

"సుభటుడగుటచేత (గ్రామణీనామకునికొడుకు శత్రు)ప్రహారవ్రణములచేత విషమమై, కర్కశకర్కశమై యున్నది. స్పృశించిన ఒడలు జలదరించునట్టు లున్న ఆతని ఆ భయంకరమైన రొమ్ముమీద పత్నీత్వముచేత వశంవదురాలైన ఆతనియిల్లాలు చేయునది లేక తప్పనిసరిగా, ఎట్లో ఒకట్లు కృచ్ఛ్రాత్తు నిద్రపోవుచు ఉన్నది. అనగా తనకు ఇష్టము లేకపోయినను ఆతనిభయముచేత ప్రాణములు బిగబట్టుకొని, యెట్లో ముళ్ళకంపనువలె ఆతనిని కౌగిలించుకొని పడుండి నిద్రపోవుచు ఉండును. యథార్థము విచారించిన, ఆమెకు నిద్రయే ఉండదన్నమాట. ఆతడుమాత్రము పను లంతయు జేసిన అతిలగవ్యాయామముచేత గుఱ్ఱు పెట్టి నిద్ర పోవుచు ఉండును" — అని మొదటి ఉపపక్షములో.

ఇక రెండవదగు పక్షములో — "ఆతని ఆ గ్రామము దుర్గమ మయినది. అనగా ఇతరులకు చొరరానిది. ప్రహారగమ్యమైన వనమార్గముచేత విషమమైనది. అట్టి ఆతని ఆ పల్లెలో ఉన్న జను లందఱు సుఖముగా రొమ్ముమీద చేయి వేసికొని నిద్రపోవుదురు. గ్రామము ఆతనిద్వారా సురక్షితము అగుటచేత ఏమాత్రము దిగులు విచారము లేకుండ, గ్రామీణులు హాయిగా నిద్రపోవుచు ఉందురు. ఒక్కడైనను మేలుకొని ఉండడు.

అంతేగాక — మార్గము ప్రహారగమ్య మగుటచేత అట్లు గ్రామములోనికి గ్రామణీసూనునింటికి పోవుచున్న నిన్ను గుర్తుపట్టి అనుసరించువారు ఎవ్వరు ఉండరు, — అని వ్యజ్యమాన మగుచున్నది.

ఇక నాతనిభార్యయో, బహువల్లభ యగుటచేత కట్టుకొనిన నేరమునకు ఆతని కిల్లాలే గాని, ప్రియురాలుమాత్రము కాదు. అందువలననే ఆత డనిన అపరితోషముచేత వ్యథపడుచు ఉన్నను చెఱచి ఎట్లో ఆతనిప్రక్కన ఒదిగి, నిద్రపోవుచున్నట్లు నటించుచు ఉండును. కాలకర్మవశమున నిద్రపట్టినను ఎప్పుడో ఒక్కక్షణము అట్లు కునికి, వెంటనే మెలకువ పొందును. కాబట్టి నీవు ఆతనియింటికి జడుపు గిడుపు లేకుండ పోయి వచ్చుచు ఉండవచ్చు.

గోత్రోచ్చారణమున కోపపడిన నాయకునితో ధీర, ఖండిత, నాయిక, మాటలలో ప్రణయకోపవక్రత్వమును కనపరచుకొనుచు, సవినయోపాలంభముగా —

మదిని నొక్కటి, మాటలో మఱియు నొకటి,
యెల్లలోకవుఁబోకడ యిదియె సూవె;
నీవుమాత్రి పెద్దలత్రోవ సెఱపినావు
ప్రియుఁడ! లోనున్న దున్నట్లు పలికిఁ బలికి. 37

భర్త అన్యాసంగదూషితు డగుటచేత అలిగి, ఒకతె ప్రక్కపై అవ్వలి మొగముతో పరుండినది. పాపము, ఆతడు ఆమెవీపు కౌగిలించుకొని పరుండినాడు. కొంతసేపటికి ఆమె అట్లే పరుండియుండి ఆతనితో —

అనునయము నెంతయుం బోదివి యార్యుఁడ! యింతటిదాఁక నామన
మ్మును దహియించి పైచితివి; మొత్తితిమి, బెడమోము పెట్టుకొ
న్నను, నను వీడఁబోక, శయనమ్మున వెన్నున నంటి, వీఁపు న
ప్పనగొని, కాల్వఁబొల్పడితివాయిటు పెచ్చనియార్పగాద్పఁగన్?

తప్పక రాగలను, అని చేతిలో చేయి వేసి వెళ్ళి, గడువునాటికి కూడ రాక మానిన నాయకునిదగ్గరకి పోయి దూతిక —

ఓయి చిరకారక! వింటె? నీయెడబాసి
మలయుకన్నీటిధారల మలిన మైన
సుదతి నెమ్మోము వొరయదు నుంతయేని
ఛాయ, రవిరథశిఖరధ్వజమ్మువోలె. 38

ఆమెతో హాయిగా యథేచ్ఛముగా రమింపవచ్చు." అని కాముకునిగూర్చి ద్యోతక మవుచున్నది.

ఈ రెండు అర్థములను పద్యములో ఒకేమాఱు, ఒకేపదసమూహములో కూర్చి ప్రకటించుట అసంభవము కాబట్టి, అర్థానుగత శబ్దానుసారముగా వేఱువేఱుగా రెండు విధముల పఠించి, ఊహించుకొనవలెను.

ఒక పెద్దముత్తయిదువ ఒక క్రొత్తకోడలికి పాతివ్రత్యమును బోధించుచు —

విరివిలుకాని వాతఁ బడి వీతఁడికైయె చెడుబుద్ధి నున్న దే
వరునకుఁ జెప్పుచుండును బవల్ కులభావిని; యోగి కానలన్
ధరణిసుతా రఘూద్వహులదాస్యముఁ గొన్న సుమిత్రకాన్పుచి
త్తరువులు సూపి గోడపయి, ధన్యము లాతని పుణ్యగాథలన్.

సతీత్వము పాడయిపోవుటకు అవకాశములు పెక్కులుండినను స్థిరచిత్తలైన భావినులు, ఎప్పుడు తమ శీలసంపదలో అపాయమును పొందరు.— అని నిరూపించి ఒక నెఱజాణ తనదోషమును కప్పిపుచ్చుకొనుచు —

ఒక పతివ్రతకోసము దేవులాడుచున్న కాముకునకు దూతిక —

అనువై యాత్మగృహమ్ము చత్వరమునం దౌఁగాక, సౌందర్యమం
దు నిరూఢిం గొనుఁగాక, జవ్వనము చిందుల్ ద్రొక్కనుఁగాక, తీ
రని దారిద్ర్యము క్రమ్ముఁగాక, పతి దూరస్థుం డగుంగాక, పా
త్తున దుష్టాంగన యుండుఁగాక, సతి యెందుం దప్పునే శీలమున్?

నదియొడ్డుననే ఆనుకొని ఉన్న కడిమిపొదరింట సంకేతము నేర్పఱిచి, ప్రియునిచే వంచింపబడిన ఒక నాయిక, తానచటికి పోయి, ఆశాభంగముతో తిరిగివచ్చినసంగతి అతనికి తెలియబఱుచుచు చెలికత్తెతో అన్యాపదేశమున —

ఘనసలిలభ్రమాకులితఖండితకేసరమై భరమ్మునన్
మునుఁగుచుఁ దేలుచున్ రసవిముగ్ధత మూఁగిన తేంట్లగుంపుతో
గుసగుస నమ్మమా కడిమికొమ్మ నదే సెలయేటిపాలు గొ
బ్బునఁ దనలోని కీడ్చుకొని పో జతసించుచు నున్నదెంతయున్ 32

నీవు అభిలషించుచున్న ఆ జవరాలు పతివ్రత. ధనాదులకు లోబడదు. పొరపడకు, — మని సూచించుచు కాముకునితో దూతిక —

కులకాంతలు అతిదరిద్రుడైనను తమపతియొక్క గౌరవమును, ఆభిజాత్యమును తప్పక నిలబెట్టుకొన ప్రయత్నింతురుగాని, ధనికులైన చుట్ట

పక్ష్యాలలో నెలితిసపటు,— అని నిరూపించుచు ఒక వృద్ధురాలు, ఒక మగ్గత కుటుంబినికి బోధించినది.—

అతిదరిద్రుండె యయ్యు నిజాభిజాత్య
మానధనుండైన పతినీడం బూని కాచు
కోనెడుకులకాంత యెంతయుం గినియుం గొన్న
కలిమి నరుడెంచు చుట్టపక్కాలం గూడ. ౩౮

ఒకపతివ్రతను కామించి దేవులాడుచున్న కాముకునితో నాయిక—

మగడు తపస్వి యయ్యును, మంచి యదను
దొరకినను, మేనం దొండుగడు తోడవు లామె;
యతిదరిద్రునిస్త్రీ పతివ్రతిక యయిన
యింటిదాసియో యునం బ్రవర్తించుచుండు. ౩౯

నాయకుని అనుకూలపఱచు తలంపుతో నాయిక, నాయికానురాగము ను ప్రకటింప బూని —

నీకు నావాసపద మని నెమ్మనమును,
నిన్నుం గనుంగొనునవి యను నేత్రములను,
వాడి వర్ణ గయ్యో నీయెడంబాటున నని
యవయవములను, బ్రిడమున నామె నిలుపు. ౪౦

బహుధా కృతాపరాధుం డయినప్పటికి— స్వజనునిమీద ఇంతగా కోపము పనికిరాదనుమా— అని దీనముగా బ్రతిమాలుకొనుచున్న కాంతుని గూర్చి ఖండితానాయిక విపరీతవాగ్వంశముతో —

నెరయుసద్భావమున మంచిస్నేహమునను
ప్రబలి రక్తుండౌ జనునందు రక్తి లేని;
యన్యహృదయునకై హృదయమ్ము నమ్ము
కొనుట నవ్వులపాలౌటకొఱకె గాదె! ౪౧

ఏమో, పని కలిసిరాదేమో అను శంకచేత నాయికను అభిసరింపక ఊరకే ఆలోచించుచున్న నాయకుని ఉత్సాహపఱిచి, కార్యరంగమునకు దింపుతలంపున దూతిక—

జతనము సేయువానికి వశంవడి లక్ష్మియొ లేక జ్యేష్ఠయో
జతపడు నింత నిక్కము; పొసంగును జ్యేష్ఠ తనంతఁ దానుగా
జతనము లేకయున్న; నటు సంగఁగఁ బోవదు లక్ష్మి, యెంతగా
జతనముసేసినం దమి యొసంగినఁ గాక, లభింప దెవ్వఁడున్. ౪౨

సహనమును బోధించుచున్న ఒక ప్రౌఢతో ప్రియవిరహవ్యథోత్కంఠిత యయిన కలకంఠి—

♦వచ్చు నిఁక వచ్చు నను నాశ పట్టి బిగియు,
నెంత విరహాగ్ని నేని సహింపవచ్చుఁ;
గాని, యొకయూర నే యుండి కాంతుఁ డతఁడు
రామి మరణమ్ముకన్న భారమ్ము కాదా! ౪౩

సురతసమయములో నాయకుడు అన్యమనస్కుడుగా నుండుటను గమనించి, విమనస్కతకు గుఱి యగుచున్న నాయికతో సఖురాలు—

బహువనితోపభోగమున తన కాముకత్వాతిశయమును వెలిబుచ్చుచు ఒక విటకాడు, తనమాటలు వినుచున్న కామినులమనస్సును లోఁగొను తలంపున స్వానుభవమునువలె ఇట్లు పలుక సాగినాడు—

రమణ నన్యరమణియందు రసమున రమ
మాణుఁడైన రమణుని నెమ్మదినిఁ దోఁచుఁ
బ్రేయసి, సదృశగుణము కన్పించినపుడు,
నసదృశగుణము కన్పింపనపుడుఁ గూడ. ౪౪

---

♦దగ్గఱకు వచ్చుటకు వీలు కలుగకపోయినచో సమీపములో ఉన్న ప్రణయులకుగూడ దూరస్థులకువలెనే ప్రవాసము దుస్సహముగా ననుభూయమాన మవును;— అని నిరూపించుచు భోజరాజు సరస్వతీకంఠాభరణములో ఈగాథను ప్రమాణముగా గ్రహించినాడు.

ఒక మానవతిని అనునయించుచు అనుభవము గల ఒక ప్రౌఢ —

వానకారున నేటిప్రవాహమట్లు
సాగిపోవుజవ్వనమునఁ, జనిన మరలి
రాని పగళులందును, రాని రాత్రులందుఁ,
బుత్రి! యింతటి బిగిఁ బూని ముడుగ నగునె? ౪౫

ఒక ప్రవత్స్యత్పతిక, నిశాప్రార్థనాపదేశమున తన విగాహసహత్వమును తెలియబఱుచుచు, కాంతునిప్రవాసమును నిరసించివేయవలె నను నూహతో —

"తెల్లవాఱుజామున ఆతడు ఊరికి పోగలడు; అంతటినుండి నీవు ఇష్టము వచ్చినట్లు నాతో హాయిగా విహరింపవచ్చు." — అని ఒక జాణ, జారునకు తెలియబఱుచుచు నిశాప్రార్థనాపదేశమున —

కటికిగుండెగలాఁడు నాకాంతుఁ డెల్లి
తెల్లవాఱుజామున దూరదేశమునకు
నేగు నని వింటి, యామిని! వేగకుండు
నటులు వృద్ధిపొందుము! దయ నాత్మఁ గనుము! ౪౬

ఒకముద్దరాలిమార్దవ్యమును వివరించుచున్నట్లు మాటలాడి, ఆమె ప్రియునిప్రవాసమును ఆపివేయు ప్రయత్నముతో చెలికత్తె, అతనితో, లేక అతడు వినునట్లు తనచెలికత్తెతో —

భావిపథికునియిల్లాలు వాఁడు పయన
మడుగుతఱి జీవములు దాల్చ నశిరవాస్య
మును, బ్రియువియోగ మోగుచుగోవము వారి
నడుగుచున్నది యింటింటి కరిగి యరిగి. ౪౭

స్వాధీనపతిక ఒకతె ఇతరవనితలకంటె తనసౌభాగ్యవైభవమును అతిశయితముగా చాటిచెప్పుచు పతికి అన్యవనితాప్రసంగ ప్రార్థనాపదేశమున — ఆతనియందు ఇతరవనితలకేమాత్రము అవకాశము లేదు — అని సగర్వముగా ప్రకటించె —

పతికి అన్యవనితాప్రసంగప్రాప్తిని సాకుగా పెట్టుకొని, అవకాశము కోసము అభిలషించుచు ఉన్న ఒక జవరాలు, తన మనస్సులో గూఢముగా దాగి ఉన్న రతాభిలాషమును జాణతనమున సూచించె—

ఓయి పరమాత్మ! నాపతి కొడుకుల చెలుల
తోడఁ గూడికొఁ గూరుప వేఁడుదాన;
నెనఁగి మగవార లేకాంతరసులు; వార
లెఱుఁగరు గుణము దోషము నించుకంత. ౪౮

దూతిక స్వయముగా పథికునితో—

మట్టమధ్యాహ్నమున నిండు మండుటెండ
కడలి నిజగాత్రతతిఁ లీన మైన ఛాయ
నరసితే, సాగ దవల కావఁల యేని;
నిలిచి విశ్రమింప వ దేల నీవు? పథిక! ౪౯

చాలకాలమునకు ప్రవాసమునుండి మరలి వచ్చిన కాంతుని ఉపాలంభించుచు ఒక విరహోత్కంఠిత, జ్వరగ్లానిగాచ్ఛలమున —

దూరమునందునుండి యుటు దోడ్కొనితెచ్చి సుదుర్లభున్ సుఖ
మ్మారయువాని మాకు, జ్వరమా! యుపకారము సేసినావు; నీ
తీరిక లెస్స యెంతయును; దీఁని మాదవు జీవితమ్ము నం
గాఁడునఁ గొంచుఁబోయి, యుపకారము సేయుము; పాయకుండుమా!

కుశలప్రశ్న చేయుచున్న నాయకునితో ఖండిత, సాసూయముగా —

నామనామజ్వరమ్ము మందమ్ము, లేక
మందమో, యేల యెఱుకల కామాట? సుఖము
నడుగ వచ్చితే సుభగుఁడా! యుత్తరం బది ?
జ్వరవు వాసన గొట్టు నాస్పర్శ వలదు. ౫౦

నీపస ఇంతేనా?— అని చులుకన చేసి, తానే స్వయముగా సురతసుఖ సంభ్రమాడంబరము చేత పురుషాయితమునకు నడుము కట్టి, అంతలోనే అలసి సొలసి అసురుసురవుచున్న ప్రియురాలితో ప్రియుడు చిఱునవ్వు నవ్వుచు—

సరసతరమ్ములౌ నరఁటిస్తంభములట్టి తొడల్ వడంకులం
బెరసెను; విప్పువాఱె శిఖిపింఛములట్టుల్ కబరీభరమ్ము; బా
పురె! కనుదమ్ములేకు లరమూయు సఖీ! యసురుసురైతి వీ
దరపురుషాయితమ్మున; నెదన్ మగవారిశ్రమమ్ము నెంచుమా!

పూర్వము ఉన్న ధన మంతయు దోచుకొని స్వస్తి చెప్పింపబడి, ప్రకృతమున మిక్కిలి ధన ముపార్జించి మహైశ్వర్యపదవి నధిష్ఠించి ఉన్న విటుని మరల లోగొన దూతికలను పంపుచున్న వేశ్యమాతతో కూతురు—.

తొలుతఁ దొలఁగించి క్రమ్మర గలిపికొనెడు
పోకఁ బ్రత్యక్షదృష్టవ్యలీకమైన
ప్రేమమునకు రసమ్మును విరస మగును
నిజము, కాచి చల్లార్చిన నీటికటులు. ౫౩

సముచితములైన సిరిసంపదలు సామర్థ్యము గలిగినపుడు, ఉదాత్త పురుషుండు పూర్వావస్థయందలి సహచరులకుగూడ దుఃఖము తొలగించి సుఖము కలిగింప నెంతయు ప్రయత్నించును— అని నిదర్శించుచు బందీకృత అయిన ఒక స్త్రీయొక్క— మగని పరాక్రమక్రమమును గూర్చి ఒకడు—

పిడుగుమ్రోఁతను బుడిడించు కడఁకఁ గడఁగు
ప్రియునిశింజినీ ఘోషము విని యొకర్తు
బంధితవెలంది, తనతోడిబంధిత లగు
గరితలకు నశ్రువులు నించు కనులు తుడిచె. ౫౪

తనమాటలు వినుచు ఉన్న విటుని మోహపెట్టి, వలలో వేసికొనుటకు వేశ్యమాత తనకూతురు మిక్కిలి అందగత్తె అని, సురతచతురతలో కూడ మిక్కిలి సుకుమారి అని, చాల సిగ్గరురాలు అని ప్రకటించుచు, విటాంతర నిందావ్యాజమున దూతికతో—

లేమ సహించుచున్నయది లెమ్మని సౌరతదుర్విదగ్ధుఁడై
యామిని యంతయున్ విడువ కా విటకాఁడు పెనంగె; నంత నీ
కోమలికోమలాంగములు గుస్తిడలన్ నసివాళ్ళు వాడి, యీ
మై మెఱుఁ గెత్తిపోయినవి, మ్లానశిరీషసుమమ్ములట్లుగాన్. ౪౮

మఱొకతెమీఁది తగులాటముచేత నిల్లాలి నుపేక్షించుచున్న నాయకునకు ఒకానొక నాయిక యొక్క అనురాగాతిశయమును తెలియఁబఱచుచు దూతిక —

కా దని త్రోసివేసి యువకామిజనమ్ముల నెల్ల, లోకమ
ర్యాద నటుండ నిమ్మని, రవంతయుఁ గొంకుఁబొంకు లేక, సొం
పేదిన కన్నుగల్వపుఁ బంతులుగా దెసలందుఁ జిమ్ముచున్,
వేఁదురు వట్టి, యీ నెలఁత నీకయి క్రుమ్మరుచున్న దర్భకా!

తన చేత బందఖానాలో బంధింపబడి ఉన్న ఒక జవరాలితో సాభిలాషముగా చోరుడు —

కానితన్వి గర్జిలు మొయిళ్ళకడన యుండి
నడెడు పిడుగుల మ్రోఁత సూ, వడఁతి! యిద్ది;
బందివై మగనిధనూరవమ్ము నాసఁ
దొడఁగి, యూరక పులకలఁ దొడిగె దేల? ౪౯

బహువల్లభునియిల్లాలొకతె, భర్తృశౌర్యప్రకాశముతోపాటు, కుటిల లయిన తన సవతుల అభిసారసజ్జత్వమును గూడ సూచించుచు అత్తతో —

చనియె నీకొమరుఁడు నేఁడె సమరమునకు,
మేలుకని కాచె నేఁడె గ్రామీణజనుల,
నేఁడె గోదావరీతటినీతటమ్ము
లయ్యెఁ బచ్చని పసుపుమయమ్ము లత్త! ౫౦

నవవధువునకు బుద్ధి గఱపుచు, తల నెఱసిన ఒక పారివారిక పురంధ్రి, పతివ్రతలకథ లిట్లని బోధించె —

మఱఁది కడుం జెడుం గఱవ మాలినబుద్ధి మెలంగుచుంట గు
ర్తెఱిఁగియు నింటికోడలు వచింపదు తొందరపాటువాఁడుగాఁ
గఱకటియైన నాథునకుఁ, గాఁపుర మల్లరితోఁడఁ జంద్రవం
దఱ యవునన్నభీతి, నిరతంబెదఁ గ్రుంగుచునుండుఁగాని, తాన్.

నీసఖురాలు ఇప్పు డెటు ఉన్నది? ఆ ఆగ్రహము తగ్గి, ఏమాత్రమైన అనుగ్రహమునకు వచ్చినదా? — అని ప్రియతము డడుగగా కలహాంతరితా నాయికయొక్క చెలికత్తె —

దయితుఁడు దీనదీనముగ ధ్యానసమాగతుఁడైనయప్పు డ
మ్మెయిఁ దలపోసి పోసి మితిమీఱిన గౌరవమున్యకమ్ము ల
న్నియును,వితా చికాకువడు నెమ్మదిఁబోరుకృశాంగిఁజూచి,యిం
తయు నగ,రెంతయున్ దిగులునంగృశియింతురుగాని, నెచ్చెలుల్.

తనతో ప్రచ్ఛన్నగత మభిలషించుచు ఉన్న నాగరికునిగుఱించి, కులీన యగుటచేత తానుకూడ ప్రచ్ఛన్నసమాగమమే అభిలషించుచు ఉన్న అభిసారిక ఒకతె —

పామరుడైన పతిమీద విరాగము, చతురుడైన జారునిమీద అనురాగము సూచించుచు, ఒకతె సఖురాలితో —

ఒక పనికిమాలినవానిమీద తవులాటమున సదమద మవుచున్న నాయికను మందలించుచు, లెస్సగా లోకానుభవము గడించుకొని ఉన్న సఖురాలు —

మనసు నెఱుంగఁ జాలు మతిమంతులచే సుసమాహితమ్ములై
వనుపడఁ బోవుగాక, రసవంతములై సుఖపెట్టునట్లుగా,
మనసు నెఱుంగలేని యతిమందులచే సుసమాహితమ్ములై
నను సుఖపెట్ట నేర వొకనాఁడును గార్యము, లింత నమ్ముమా!

వానకారు సమీపించినది, అని క్రొత్త లేతమావియిపుళ్ళను చూపు నెపములో గూఢగూఢముగా సూచించుచు నాయిక, నాయకునిప్రవాస ప్రయత్నమును ఆపివేయించుతలంపున—

పొనరి దరభిన్నశుక్తి సంపుటమునందు
గుప్తహాలాహలముతోడఁ గప్పఁబడును జోటి,
పక్వసహకార రాజాస్థిభాగనిర్గ
తమ్ము నవకోమలాగ్రాంకురమ్ముఁ గంటె? ౯. ౧

సూచనము గమింప జారుని ప్రోత్సహించుచున్న నాయిక మాట —

రమణఁ బటలాంతరానతీర్ణ స్వాతంత్ర్య
శీలమునం గాని యూర్ధ్వపాదముగఁ దప్పు, ల
లక్ష్యమాత్రగత వసుల ప్రసనము
కరణిఁ గ్రాలెడు నదె సాలెపురుగు గనుము. ౯. ౨

ఆ పాడుపడిన పురాతన దేవాలయము జనసంచార శూన్యముగ ఉన్నది. కాబట్టి, అది మనకు తగిన సంకేతము.— అని జారునకు సూచించుచు, తెలివిడి అగునట్లుగా ఒక కామిని—

అట నలుసంత కానఁబడునల్లదియే శిఖరమ్ముకేల; న
చ్చట ముదుగంగఁ బాఱి నఱుసంబడియున్నవి పావురాలు; త
చ్చటులతరోద్గతధ్వనులసందడి నాగుడి వాడిశూలము
దిటులు కొంత వేయఁబడి యేడ్చుచునున్నటులున్నదయ్యెపో!

పరవనితాలోలుపుడైన పతియనురాగమును లోగొని, అతనిని వశపఱచుకొనికూడ, తిరిగి— నే నాతనికి ప్రియురాలను గాను. వానికి నామీద ఏమాత్రము ప్రేమ లేదు.— అని ఆతనితో ప్రేమప్రసంగమునఁ బడక, పెడమొగము పెట్టు సపత్నిని— పరకీయ— నొకతెం గని, మఱొకతె చతురతతో—

కావో వానికిఁ బ్రియురాల వీవు కలికి!
యనుదినము నొక్క— నోలెడు ననయవముల
నేల నిదురింతు? కడుపారఁ బాలు ద్రావి,
తొడిగి మత్తు మెత్తన పడ్డదూడవోలె! ౯. ౪

పతి విదేశమునకు పోయియున్న ఒకసతికి అన్యాసక్త అను లోకాపవాదము రాగలదేమో అను భయమున— దివాస్వాపాదులు తగనివి; అవి వద్దు;— అని బోధించుచు, ఒక బంధు వధువు —

ఎంతయుం బ్రొద్దు గలుగు హేమంతరాత్రు
లందు నిద్దుర చాలక, కొందు విటులు
పవ లొడలు దెలియని నిద్ర, పడతి! మేలె
చిరము ప్రోషితపతికవై చిక్కియుండి ? ౬౬

బురదదారిలో పాపము, ఆ పాడుబురదకు వెఱచి, యెగిర దూకి, ఆపుగలుగనయన నా అడుగులలో అడుగిడినదికాని, అనురాగమున గాదు సుమా;— అని ప్రియురాలి ప్రణయమును కప్పిపుచ్చుచున్న కాంతునితో నొక కాంత —

అలసితత మీఱ నడుసుచు కడలి యెగిరి,
యడుగు నీయడుగున నాపె యిడునుగాక,
కడఁగి తొడిగినపులకలఁ గంటకితము
నొడలు దాల్పఁగ నీ కేల? నొడువుమయ్య ! ౬౭

చేయిమాత్రము జాఱకుండ, ఉట్టిపడు అనురాగాతిశయమును అభ్యస్తముగా ప్రకటించుచు ఉన్న విటకానినుండి డబ్బు గుంజుకొనుటకు కూతునకు బుద్ధి గఱపుటకు, వేశ్యమాత —

తివిరి కడచినపండుగ, తెల్లవాఱు
జామునందుఁ బున్నమచందమామ, యంత
విరస మైన కామము, దానవిద్ధమైన
యట్టి పరితోషమును, శోభ నందఁబోవు. ౬౮

ఒక స్వాధీనపతికను కామించి ప్రయత్నించుచున్న కాముకునితో— ఆమె అందరాని మ్రానిపండు— అని సూచించుచు దూతిక అన్యాపదేశమున—

కడఁగి తనచేతి వాసుకికంకణమును
శివుఁడు వడివడి దూరము సేసినపుడె

అనిమిష భావముం గొనినయట్టి విశాలపు కన్నుదమ్ముల
వ్వనగ బ్రియుండు నాయవయవమ్ములయందలి యేవిభాగముల్
గనుఁగొన నుల్లసంపడునొ, గట్టిగ వానినిఁ గప్పివేసికొం
దు;నతఁడు చూడ దానిఁదమిఁ గోడుత నేనును జూడఁబూనుదున్.

కలహాంతరితయొక్క సఖురాలు అనునయముకోసము ఆమెచెలువుని బురికొలుపుతలపున —

ఉడుగఁబోని కట్టలుకచే నుడుకుదయిత
దయితునెడఁ గొన్న బిగి యెల్లఁ దనకుఁ దాన
యెడలి, పుడిసిటఁ బట్టిన యిసుకవోలె,
సురసురం బోవుచున్నది చూడుఁ డిటులు. ౨౪

రసికు డొకడు, ఒకరసికురాలి నుద్దేశించి, శుకపంక్తివర్ణనవ్యాజమున—

పచ్చలుం గెంపురాలును వరుసఁ బొదుగఁ
బడి, సురపథమ్ము పేరిటి పడఁతిమిన్న
కంఠముననుండి జాఱిన కంటెవోలె,
దిగుచు నున్నది శుకపంక్తి దివము నుండి. ౨౫

పరపురుషసంగప్రసంగమును తెలిసికొని, ఒకడు తన భార్యను దుర్గమ స్థానములో బంధించి ఉంచినాడు. ఒకతతి జారపురుషు డా తరుణిపాలికి దూతికను పంపినాడు. అపు డామె, దూతికతో ప్రతిసందేశ మిచ్చుచు, దుర్దశను పొంది యున్న మహాధనులచరిత్రమును వర్ణించునెపమున —

అభిసారగమునకు ఇది సమయము కాదు పొమ్మని జారునకు తెలియ బలుకుచు ఒక కులట —

కోరి యాశంసితార్థమ్ముఁ గూర్పలేమి
మనసునన్ నొచ్చుకొని, కూర్చు బ్రణయి మరలి
చనుటకన్న, విదేశవాసమ్ము దుర్గ
తియును గూర్చు నేరవు నాకుఁ దీవ్రబాధ. ౨౬

పాపము, ఈతఁడొక బాటసారి, అని పెద్దవారిని నమ్మించి చెప్పి, సమ్మతపఱిచి, యింటికోడలు, స్వాతిక, జారుని తమయింటిపసారగాలో మకాము వేయించినారు. రాత్రి ప్రొద్దుపోయినది. ఇంటివారు గాఢ నిద్రలో ఉన్నారు. అది గమనించి స్వాతిక — ఆమెతో గమింప ఇది నీకు తగిన అదను — అని జారునకు సూచించుచు, వధువుతో —

అడవులయందు స్కంధకలితానలకీలల, నూళ్లలందు నే
ర్పడిన తృణాదికమ్ముల, సురక్షితుఁడీ పథికుండు, నిల్చి యి
ప్పుడు పురిలోపలన్, వెతల ముంచియిడంగుచున్న వాఁడు క్రము
క్కడి చలిగాలిచేత, వెనుకం గల కోపము వెంచియుట్లుగాన్.

తన గాఢస్నేహమును, తన కళాప్రావీణ్యమును, అనుభవమును, ప్రకటించుచు, తనమాటలు వినుచున్న కామినీజనములు తన్నును వశపఱచుకొను తలంపుతో ఒక గనికుడు —

రసముఁ గ్రోలఁ గైకొనుపాట వెస ధుత మగు
నోదలఁ గదలు నలకల నాకుల మయి
పరిమల తరలిత మధువ్రకరక్లీగ్గ
కమలమటు లొప్పు నా మనుముఖమ్ముఁ దలఁతు. ౭౬

ప్రియతముని యాదరాభిమానములకు పాత్రమైన భాగ్యవతికి అలంకారాదులు లేకపోయినను సౌభాగ్యము అతిశయించుచునే ఉండును. — అని ఒకతె, విదితరహస్య అయిన తనవయస్యతో —

స్నానము సేసి లెస్సగఁ బ్రసాధనమున్ సవరించి, లోలతం
బూని, సపత్ను లుత్సవపుముచ్చట మాన్చుచు నుండ, నార్యచే
స్నానమునం దనాదరమునన్ సుభగత్వవిశేష మొల్ల నెం
తేనియు వెల్లడించి వివరింపఁగఁబడ్డటు లమ్మ్యో నమ్మ్యోడన్. ౭౭

పసుపుతో విశుద్ధిస్నానము అనగా ఐదవరోజున శుద్ధిస్నానము చేసి, వీధిగుమ్మములో నిలిచి ఉన్న ఒక అన్నుమిన్నను చూచి, వన్నెకాఁడొకడు సవైదగ్ధ్యముగా —

స్నానమునఁ బసు పంటిన జాలవలయ
జాలముల బాగుసేయుచుఁగా సాగినావు
వెదురుపుడకతోఁ బడఁతి! యివ్వేళఁ బాలి
నెవని ధన్యునిఁ జేయ నూహించినావొ! ౨౦

ఒక నెఱజాణ తనదయితుని ప్రవాసప్రయత్నమును ఆపివేయువలె ననునూహంతో, సామాన్యముగా ప్రణయము సన్నగిలిపోవుటకు గల కారణములను వివరింప దొరకొనినది—

కనులకుఁ గనంబడక యున్నఁ, గనులయుండె
నిముస మెడయాక యున్నఁ, గణ్ణేజవముల
సమ్మె నీల్గున బిగిసిన, నిమ్మెయిక్ ఘు
టిల్లినను, బ్రణయము సన్నగిల్లిపోవు. ౨౧

పైగాథనే ఇంకను స్పష్టముగా—

కనఁబడకున్నఁ గాంతలకుఁ, గానఁగవచ్చుచు నున్న నెప్డు నీ
చునకును, నూఱిపోసి యిడి శ్రోత్రబిలంబుల కెక్కఁజేయ న
జ్ఞునకును, సంఘటిల్లు నెడఁ జొప్పడి యిట్టి తెఱఁగు, లల్లనం
బ్రణయము సన్నగిల్లి తుది మాసి చనుం గలరూపు నమ్ముమా!

ప్రసవించినపిదప యౌవనము కొంచెము జాఱినప్పటికి మాసఖురాలిని నీవు వెనుకటివలెనే చూడవలెనుసుమా— అని చతురతతో సూచించుచు ఒక తొలిచూలిజవరాలిసఖురాలు, ఆమెచెలువునితో స్తనకాలిమకథనవ్యాజమున, సవైదగ్ధ్యముగా—

ఉన్నతస్థితి నొప్పారి యుదరభూమిఁ
బడినయప్పుడు చొప్పడు బహుళదుఃఖ
మును విచారమ్మునన పోలుఁ, జనుల మొనలు
నలుపు వాఱిన పుచిదమిన్నకు భృశమ్ము. ౨౩

ఒక కోడెగానికి ఒక కులుకులాడి తాంబూల ప్రయత్నించుచున్న సాత్త్విక, ఆమెతో వాని అనురాగాంకురముల అతిశయమును గూర్చి —

సుందరి! యందచందములచుక్క మిటారవు జవ్వనంపు తే
ఱ్ఱొందలిరాకుబోఁడి గల రూపసి యీ హాలికాత్మజుండు నీ
యందలిమోహఁ జిక్కి సగ మయ్యెఁ. గృశించుచు నున్న నీను చే
తం, దుది వానిమానినియె దౌత్యము పూనఁగవచ్చునంతెగాన్.

బహువల్లభుఁడైన నాయకుని చిరకాలమునకు తనవద్దకు రాఁగా చూచి ప్రౌఢ, స్నేహోపాలంభసమృద్ధి మయిన వాగ్విలాసముతో —

దాక్షిణ్యమ్మున నేఁడు చేరి యుఁ బ్రసన్నాస్యుండ వై సూనసాయకాల్లోలం
దక్షయ్యమ్మునఁ గూర్చుచుంటివి ప్రియుండా! నీకునున్ నీప్ర
త్యక్షంబై యొప్పు నేఁడు మందమువు నిర్వ్యాజంబుగా, నా సగౌ
జాక్షుల్ పాయక పొందిపొందఁగల యానందమ్మొకో గదా!

కోపముచేత నేను కొంచెము చేయి విసరుచు ఉన్నను పాపము, అతఁడు పూనుకొన్న ఉపచారాదులను మానఁడు — అని తన సౌభాగ్యమును వెల్లడించుచు, ఒక స్వాధీనపతిక, తనదయితునివిషయమున అన్యవనితాప్రసంగమును నిరసింప మొదలిడి —

ఆతనిఁ గొట్టినంత నెఱనై కనుగంది యుఱుక్కుమన్న నా
లేతలిరాకుచేతిని జలించుచు నూఁదఁ దొడంగె నోటితో
నాతఁడు, నంతలో నగుచు నల్లనఁ బొంచి గ్రహించి పట్టి తే
నాతనికంఠసీమ మెదలాడఁగ రెండవచేత గట్టిగాన్. [illegible]

ప్రణయకలహావేశమున అలిగి నాయిక, పడకటింటిలో నుండి చరచర బయటికి వెళ్ళిపోసాగినది. పాపము, జాలిగా నాయకుడు కూడ ఆమెను అనుసరించి పోవుచున్నాఁడు. అది చూచి, ఆమెసఖురాలు ఆమెను వెనుకకు మరలించి సుముఖితను చేయవలె నని చతురతతో —

పోలఁతి! పొలయల్కఁ దోడి మాఱుమొగము పెట్టి,
బిగబిరం జనె దేఁ? నీ పిఱుఁదులపయి

ఎన్నో సదభిప్రాయములు ఎన్నో లెక్క లేనన్ని తోస్తున్నా [illegible]
చాల చులకనగా కేవలము — క్షమించు — అని మాత్రమే అనుచున్న నాయకునితో, ఒక ఖండిత —

చేయు నింతకు మున్నెన్ని? చేయఁగోరు
మీఁద నీకెన్ని? చేతలో మొలఁగ నెన్ని

"కృష్ణా! రాధకపోలములమీద పడిన గోరజమును అనగా గోవుల పాదధూళిని నోటితో ఊది, నీవు దులిపివేయుచు ఉండగా, తక్కిన ఈ అందఱు గోపికలకుకూడ నీవు గోరజమును పోగొట్టుచున్నట్లుగానే ఉన్నది. నీ ఒక్క చేతచేతనే ఈ అందఱకు పరమనిర్వృతి కలుగుచున్నదనుమా!" అని.

పైకి అవగమేమగుచున్న అభిప్రాయము ఇదియును. కాని, అంతరముగా ఆవాక్యములో నెంతయో ఈసు ఇమిడి ఉన్నది. దానిని ఇట్లు తెలిసికొన వలెను. —

"కృష్ణా! నీవు ఒక్క రాధపై బడిన గోధూళిని నోటితో ఊది దులిపి వేయు నెపముతో ఆమెను తాకి, స్పృశించి, చుంబనాదులద్వారా ఆమె సౌభాగ్యమును వెల్లడించుచు ఉన్నావు. తద్ద్వారా చూచుచున్న తక్కిన గోపికల గౌరవమును నేలపాలు చేసి, వారిని అవమానించివేసి, వారల సౌభాగ్యమును ప్రత్యక్షముగా ఖండించి వేయుచున్నావు. యథార్థముగా నీకు రాధ ఒక్కతెయే ప్రేయసి. తక్కిన ఈగోపికలందఱు ఊరకుపోకకు ఉపకరణములు. అవకాశము లభించినప్పుడెల్ల ఇట్టి పనులద్వారా ఆవిషయమును తేటతెల్లముగా వెల్లడించుచునే ఉందువు," అని.

తెలుగుపద్యములో ఉన్న రెండవ 'గోరజ' శబ్దమునకు మొదటి భావములో అర్థము స్పష్టమే. సాసూయాభిప్రాయములో ప్రథమసముచ్చయము మీది 'గోరజ'మును, 'గో' అని, 'రజము' అని రెండు పదములుగా విభజింప వలెను. అప్పుడు 'గో' అనుదానికి కామువుద్వారా అనుచు అభ్యూహించి,- "కృష్ణా! నీవు రాధగోరజమును పోగొట్టుచు, ఇతరగోపికలకు పట్టిన గోరజమును అనగా దుమ్మును, ఇంకను తెల్లముగా చెప్పవలెనన్న, స్వాభిమానపద మను గోరోజనపుత్రుప్పును బాగుగా దులిపివేయుచున్నావు. అట్లు వారిని అవమానించుటకేకదా నీవు ఇట్లు రాధదగ్గఱకు చేరి విలాసములు ప్రకటించు చున్నది!"— అని అభిప్రాయము చెప్పుకోవలెను.

ఇందులో గంగాధరభట్టు— 'గోరజః' అనగా 'కంటిలో పడ్డ దుమ్ము' అని యర్థము వ్రాసినాడు. ఇది ఆతని కెచటినుండి లభించినదో ?

యిప్పుడు తెప్పు? లే నేవి క్షమింపవలయు?
నోడుపుము, సుభగుఁడా! సిగ్గు విడిచినావు! ౯౦

అనునయాదులకు లొంగక, దుర్విదగ్ధుఁడైన నాయకుని మందలింప దూతిక—

ఎగసి యధికారముం బ్రకటింప రెవరు,
కోపగించిన బ్రతిమాలుకొందు రెవరు
దాసు లట్లు, వారలె నెలంతలకుఁ బ్రియులు;
తక్కుఁగల దరిద్రులు మెడత్రాఁటిమగలు. ౯౧

పూర్వము ఇంతి అంత కాని ప్రణయాభినివేశముతో అంటిపెట్టి ఉండి, ప్రకృతమున గృహపతి యువతిచేత సౌదాసీన్యముతో మెలగుచు ఉన్న నాయకుని నొవ్వనాడుచు, దూతిక సుహృదమీదుగా—

ఇప్పుడీసు చూలాలు. ఉపభోగమునకు తగదు.— అని జారునకు సూచించుచు దూతిక, సవ్యపదేశముగా—

గారవము మీఱ మది మధుకర! రమింప
వితరపుష్పజాతులవయి, నిందుఁబోలె;
బద్ధఫలభారగుర్విణియై వరల నిపుడు,
మాలతిం ద్రోసివేసితి మార్గ్మ గాన! ౯౨

ఒక అందగానిపై అనురక్తయై, ఒక జవరాలు తనమాతులానితో—

కాంచిన నేండ్లుఁబూండ్లు నొకకానుకఁదూఁగిన తృప్తి నేనియుం
గాంచవు కన్నులా కుసుమకాండుసిమాఱటరూపు వాని నీ
క్షించినమాత్ర నొక్కక్షణ మిట్టె, యడంగదు నాదుతృష్ణ యే
యంచుక, స్వప్నపీత మవు నంబువుచేతనుఁబోలె. మాతులీ! ౯౩

తమ మొట్టమొదటి సంకేతస్థలమునకు భంగము రాగా, వేఱొక సంకేత స్థలమును స్థిరీకరించుచు ఒకకులట, విటునితో సుజన ప్రశంసావ్యాజమున—

మొనసి నివసించి యేదేశమును సుజనుఁడ
లంకరించునో, ప్రవసించి కొంక కతఁడు

దాని నొనరించు, నూరిచెంతన మహాప్ర
భంజనోన్మూలితవటమ్ము ప్రాంతమునుగ. ౫౪

ప్రయాణమై ప్రవాసమునకు పోవుచు, — 'నన్ను మఱచిపోవకు సుమా!' — యని యనుచున్న తన ప్రియునితో ప్రియురాలు —

ఒగి స్మరింపకోవలె మదినుండి దూర
మైనవానిని; సటు గానివాని గాదు;
తగినప్రేమము స్మర్తవ్య మగునుగాక,
యది నిరాలంబనం బయ్యెఁ గద యివేళ! ౫౫

మొట్టమొదట ఎంతో ప్రణయాతిశయమును చూపి, ఉపభోగించి, ఆపిమ్మట సన్యాసస్పృహ చేతగాని, మఱచిపోయి, మునుప స్నేహితుడైన నాయకుని, తిరిగి అనుకూలపఱుప కోరిక, పూర్వానాయకాను రాగమును ప్రకటించుచు —

మొలకఁ దొడుగు పులకలమండలము చేతఁ
గప్పి యిడుకొని నీవంటిగంటి నొసటఁ
గాచుకొనుచున్న దొక నిధిగాఁగ నెంచి,
యీసరికిఁ గూడ నా యమాయికపుపిల్ల. ౫౬

తొందరపని యేదో ఉన్నందువన అతడు ఇంకను రాకుండ ఆగినాడు. ఆపని పూర్తికాగానే వెంటనే రాగలడు. స్థైర్యముగా ఉండుము — అని ఓదార్చుచున్న మాతులానిని గని, అపనని సజ్జీకృత సమాగమ సామగ్రీ విశేష అయిన ఒక ప్రోషితపతిక సనిర్వేదాసూయముగా —

అల లేమావియిగుళ్ళు చూడఁబడవో! యామ్రఘ్రాతముల్ గావొ తీ
పులు పుట్టించు సురాసవమ్ములవసల్! పొంగారు నా దక్షిణా
నిలుఁ డాకంబడలేదొ! కొన్నపనులన్ దీర్ఘంబులై తీఱు; వీ
యిల నెవ్వారికి నెవ్వఁడైన చెలికాఁడై యేమౌను నే మాతులీ! ౫౭

ఎన్నఁడు కొంచెమైన నెడగాక అదుకుకొని ఉన్నచో, సురతముమీద నంతగా ఉత్సాహము ఉండదుగదా? అది నీవు తెలిసికూడ ఒకప్పుడు కాకున్న ఒకప్పుడైన ఆతనిని ప్రవాసమునకు ఏల పురికొల్పవు? పైపెచ్చు, వాడు ప్రవాసోన్ముఖుడైనప్పుడెల్ల కంట తడి బెట్టి, నీవే ఎందుల కట్టు అవరోధము కలిగింతువు? అనుభవములో ఉన్న విప్రవాసమునుండి ప్రియుడు తిరిగివచ్చిన ఆ దినములలో మధుర మధురములై, ఆనందోత్సవోత్సాహ తరలితములైన ఆ దినములలో, నిర్భరోత్కంఠావిధురములైన ఒండొరుల ఆ గాటపు కౌగిలింతలతో, ఆ పునఃపునశ్చుంబనాది ప్రక్రియలతో, ప్రవర్తించి జాలువాఱు ఆ సురతసమయములలో, ఆ సుఖవిశేషము, ఆ గసానుభూతి, ఆ నిర్వృతి చెప్ప నలవి కావుసుమా!— అని బోధించుచున్న సఖురాలికి, స్వాధీనపతిక ఒకతె సమాధానముగా —

నీ వతనికి ఇంతగా లోబడి పోగూడదు. ఏకొంచెమైనను బిగువు పూనవలె— నని బోధించుచున్న చెలికత్తెకు— అది నాచేత గాని పని,— అని బమలు పలుకుచు ఒక నాయిక —

> రమణి! రమణుండు రమియించి, తవ్వ యెడసి,
> మరలఁ గౌఁగిటఁ గదియించుమలక దరియు
> నంతమాత్ర యెడమ్మున, నతఁడు ప్రవసి
> తుఁడుగఁ, బ్రోషితపతికగా నడలు దేను. ౯౮

సుందరుఁడు, సహృదయుడు, సద్వ్యవహారుడు, సానురాగుడు నయిన ఒక కోడెగానిమీద అనురక్తయయిన ఒక కులట, అట్టివాడు కాకపోవుట చేత తనమగనిమీద పుట్టిన ఏవగింపును ప్రకటించుచు, చెలికత్తెతో —

మందస్నేహుడైన ధవుని అనుకూలపఱుచుకోవలె నను సూహతో ఒక పతివ్రత వానితో స్వాయముగా —

> తనివి తీఱని చూపులఁ దనర నేర్చి,
> కష్టసుఖముల కయివచ్చి, కలితసాధు
> భావమున హెచ్చి, కలిసినస్వాంత మిచ్చి
> జనునిఁ బెద్దనోములు నోచి, జనవము పడయు. ౯౯

ధృష్టుడయిన తనమగనికి, తనకు నడుమ భేదమును ప్రతిపాదించుచున్న దూతికను నివారించి, ఒక పతివ్రత, యుక్తియుక్తముగా ఆమెతో—

వల్లభుఁడు దుఃఖమును గూర్పఁ జాలువాఁడును
గాక, సుఖముగఁ గోఁచు నిక్కముగ నదియుఁ;
బ్రియుని వ్రేలిగోళ్ళులసీక వెగటుఁ గాక,
మొనలు దేలవా చన్నులు పులక లెత్తి? ౧౦౦

రసిక మనో మిళింద నికరమ్ముల రమ్మని యాగళమ్ముగా
రసములు జాలువాఱు మధురమ్మగు పిండులు నెట్టి, చేర్మి నా
చ్చ, సుకవివత్సలప్రముఖ సత్కవి నిర్మిత గాథలం దపూ
ర్వసమయమీశతమ్ము కొనెఁ బ్రప్రథమమ్ముగఁ బ్రాజ్ఞసుప్రథన్
పాలితసత్కవిత్వ కవివత్సలపాలిత హాలినాది సం
లాలితమైన గాథలకలారసవాటికలో రసాలముల్
జాలునఁ దేనియల్ గురియఁ జాలినవై తొలినాఁటి యుగ్గి యా
లీలఁ గొనెన్ నృసింహకవి లేఖినిలో రసమేయమై ఖుగిల్. ౧౦౨

సరసతరము గాథాసప్తశతకమందుఁ
బ్రథమశతక ముజ్జ్వలరసప్రభూతి నమరెఁ;
నెద్ది చెవి దాఁకఁ బడినంత, నెడఁదలోనఁ
జొర దమృతమేని మధురతాగరిమఁ జేసి! ౧౦౩

# రెండవ శతకము

ఎప్పుడైన కోపముతో బిగిసి— నీవల్లభుడు నీకు ఎంతగా వశపడి ఉన్నాడో కొలిచి చూచుకో, —మ్మని నీసఖురాలికి గట్టిగా బోధింపుము.— అని యనుచున్న తనసఖురాలితో ఒకనాయికయొక్క చెలికత్తె ఎకసక్కెముగ

కలిసిననెచ్చెలులు బలసి కర్ణపుటమ్ముల నూఱిపోయఁగాఁ
బలుమఱుఁబూనఁగాఁబడియుఁ, బాయుచునున్నదిక్రోధపూరమా
యలరుజిరావజీకుపుటల్గులపోల్లకుఁ దూట్లు వడ్డ యా
యలరులబోడిడెందమునయందుననుండి స్రవించి వెల్వడెన్. ౧

సంకేతమునకు రాక జారునిచేత వంచింపబడిన ఒకకామిని,— నీ వచ్చుటకు గాక నన్ను మోసగించుటయే గాక నే నచ్చట నుండగ నే నది పొంగి మన సంకేతస్థానమునకు భంగముకూడ తెచ్చిపెట్టినది,—అని జారునకు తెలియ బఱచుచు చెలికత్తెతో—

పొంగి కరుళ్ళు ముంచి కొనిపోవునొ, ముప్పున నందుఁ గూలియే
భంగము గల్గునో, యనిన భావన లేక, తటద్రుమాగ్రశా
ఖం గల గూట ఱెక్కలను గప్పిన పిల్లలఁ గాచుకొంచు పో
యిం గొనుకాకి, నేఁడు ప్రవహించి గళించిన దేటిసీటిలోన్ ౨

పూవులవంకతో పోయి, అభిసారసుఖమును అనుభవించుచున్న ఒక కులట, తనచిరసంగతాభిలాషమును జారునకు తెలియబఱచుచు, మధూకవృక్ష వ్యపదేశమున—

నిండి పూవులబరువున నేల నొరయు
చుంటి విపుడు కొమ్మలతోడ, నొక్క మాట
వినుము, గోదావరీతటవికటకుంజ
తలమధూకమా! రాలి పోఁగలవు మెల్ల. 3

మధూకకుసుమాపచయము పేరున ననుదినము సంగమసుఖము సాధించి యనుభవించుచున్న ఒక అన్నుమిన్న, ఒక మధూకతరువునకు దగ్గఱలో నున్న

పొదరిల్లు సంకేతముగా ఏర్పఱుచుకొనినది. ఋతువు మారితే, పుష్పములు తగ్గి పోయినవి. ఇక ఆ పేరుతో ఇచ్చటికి వచ్చి పోవ వీలు పడదుగదా అని విచారముతో ఒకనాడామె, మిగిలిన వాడిన ఆ కొన్ని పూవులు ఏఱి తెచ్చు కొనుచున్నది. ఆమె కవలిక ననుబట్టి ఆ సంగతి అంతయు తెలిసికొని, ఒక నాగర కుడు సహచరునితో —

వెనుకటకున్ మిగులవు, దుఃఖమునన పూఁచ
బడునవి, మధూకసుమములఁ జేడి యాపె,
యేరుకొని తెచ్చుకొనుచున్న దేడ్చుచుఁ, జితి
తలమునుండి బంధుజనుస్థులను బోలె. ౪

బహువల్లభుఁడగుట చేత తనమాటలు నమ్మక క్రోధించుచున్న నాయి కను అనుకూలపఱుచుకొను నూహతో ఒక చతురుడు నిజహృదయానురాగ వ్యాజమున —

కొద్దినదినీటిలోఁ గొట్టుకొనుచుఁ బోవు
పెద్దదూలముపోలిక, బెంసి, యచట
చటఁ దవులుకొని నిలిచి, యెచ్చటనో యొకరి
చేత దహియింపఁబడుదువు చిలిపిమనసు! ౫

నాయికయొక్క సవతుల కుళ్ళినట్టి మాటలను తాను చాల [illegible] పోయి, నాయికసఖురాలు తనసఖురాలి సౌభాగ్యాతిశయమును బుధజన గోష్ఠిలో వెల్లడించుచు —

ఆ సరసీరుహాస్యమధు రాధరబింబపుటంబునందు ను
ల్లాసముతోడఁ గ్రావి మిపులం, బ్రియకాంతుని చేత రాత్రి యు
ద్వాసితమైన రాగమె, సపత్నులతామరకన్నులందు ను
ద్భాసిల సంక్రమించి కన వచ్చె స్ఫుటంబుగఁ బ్రొద్దుపొడ్పునన్.

చతురలైన వనితలు ప్రసంగవశముగా తమప్రియునిప్రణయమును పరీక్షించుచుందురుగాని, అడుగడుగునను గాదు;— అని ఒక నెఱజాణ ప్రియుని స్నేహమును అనుదినము పరీక్షించి చూచు స్వభావము గల ఒక భావినితో —

అరసి చూచి గోదావరియవలిదరినిఁ
బొలమునం దున్న మగనిఁ దాఁ బిలిచి బిగ్గ
కాఁపుకోడలు మిగుల నగాధ మైన
రేవులో దిగి, మునుఁగుచుఁ బోవసాగె. ౭

తాను మనసార కోరుకొన్న చెలువుడు వినుచుండగా, వానిని లోభ పెట్టుటకు తనసౌభాగ్యమును వర్ణించుచు ఒక వగవగ్గలి, సఖురాలితో —

అడుగులపైని వ్రాలి విడకమ్మెయి మ్రొక్కుచునున్న వానినిం,
బోడ వపు మేలి ముంగురుల బొట్టనవ్రేల గ్రహించి చుట్టి నేఁ
దోడిఁబడ కీడువం దొడర, దోసముఁ జూటఁ దొలంగఁ బెట్టి,యా
గడుసుమగండు కాంచినసుఖ మ్మెడఁ బాయదు నేఁడునా యెదన్.

మనసంకేతస్థలములో ఇపుడు ఎవఁడో బాటసారి ఒకఁడు మకాము వేసినాఁడు.— అని జారునకు తెలియబఱుచుచు ఒక జారిణి తనసఖురాలితో —

చేరి దరిద్రజానపదసీమమునందలి గ్రామదేవతా
గారముద్వారమందుఁ, జలిగాలికి నీల్గుచు బాటసారి, చ
ల్లారిన చిత్తనివ్వమసి యాఱిన కుప్పను నూఁది నోటితో,
సారెకుఁ జిల్వసాగెఁ బడి చచ్చిన పెద్దయెలుఁగునుంబలెన్. ౯

ఊరిచెఱువునకు దగ్గఱలో ఒకచోట నాయికానాయకులకు సంకేతము నియత మయినది. తెల్లవాఱకముందే లేచి, ఎవ్వరు జేతులు పెట్టి కెలకక ముందే స్వచ్ఛమైన నీరు త్రాగుటకు తెచ్చెదను— అని వంక పెట్టి, ఆ జవ రాలు అచ్చటికి పోయినది. కార్యాంతరముచేత ఆ కోడెగాఁడుమాత్రము రాకుండ ఎగగొట్టినాఁడు. పాపము! ఆమె హతాశ యయి, నీళ్ళు ముంచుకొని, ఇంటికి తిరిగివచ్చినది. తెల్లవాఱినతరువాత అతఁడు అగపడినాఁడు. అప్పుడామె— నిర్ణీతసమయమునకు నే నచ్చటికి పోయి వచ్చినానుసుమా— అని అతనికి తెలియబఱుచుచు అత్తగారితో, తెల్లవాఱుజామున తాను చెఱువుదగ్గఱ చూచిన వింతలను చెప్పుచున్నట్లుగా ఉపక్రమించి —

తల లోఁదిగి తమ్మిపూవులు నలిగిపోవు,
బెగడి రాయంచజంటలు సెగిరిపోవు,
నేరుపున నెవ్వఁడో యుంచె నూరిచేలుపు
నందు నుత్తానితమ్ముగ నాకసమును. ౧౦

తన ప్రియుడు దూరదేశప్రయాణమునకు సమునస్కుడై యున్నాడని విని గాని కలత బారి, ఇంటిపనులు చేయ చేతులు రాక, నిగులుతో కూలబడిన సవతిని చూచి, ఈర్ష్యోపాలంభముతో పరిహాసోక్తి యయిన ఆ సుమతి—

ఆమె పతిపరాయణ. ప్రయత్నించి భంగపడెను.— అని జాలిగా సూచించుచు, ప్రియప్రవాసవార్త చెవిని బడగానే నిగులుపడి నిశ్చలయై కూర్చున్న ఒక ప్రోష్యత్పతికతో మాతిక —

ఉపిద! తనకోర్కె నెరవేరె, కెవఁడో, చెవుల
విప్రవాసపుటూసుఁ జొప్పించి యుండు;
విషముఁ బెట్టినట్లుగ దాన, పినశేషము లయి,
యలసి తూలిన విగత నీ యవయవములు. ౧౧

స్పష్టముగా వ్యక్తమవుచున్నను తమ భావమును గోప్యముగ నుంచ నేర్పు కత్తెలు అట్లు కప్పియుంచుకొందురని బోధించుచు ఒక ప్రౌఢ తన సఖురాలికి యశోదముందఱ గోపికల వైదగ్ధ్యమును ఇట్లు వివరించినది.—

పొందు, పసికూన దామోదరుండు కృష్ణుఁ
డింక, నను చు యశోద యేమేమొ పలుక,
వనజనయను మోమున వాలుగనులు పెట్టి,
పెదవులందు నవ్వీరి మొల్ల వ్రేఁత లెల్ల. ౧౨

ఒక చతురవనిత, సుజనప్రశంసావ్యాజముతో, కలకాలము అవికల మైన ప్రేమను నెఱపు మని సూచించుచు తన ప్రియునితో—

ఎడసి ముఖప్రసాద మొకయింతయుఁ దప్పక, నాఁడునాఁడునుం
గడు నుపచీయమాన మయి క్రాలెడు నెవ్వరిస్నేహ, మవ్విగా

ముడివడి సంక్రమించునో స్వపుత్త్రులయందును, నట్టిసజ్జనుల్
పుడమిని జాల తక్కువగఁ బుట్టుచు నుందు రమందవృత్తులై.

పరాయివారు ఉన్నారు అని అయినను చూడక, వారిసమక్షముననే ప్రణయభావమును ప్రకటించుచున్న సఖురాలిని మందలించుచు చెలికత్తె, కృష్ణానురక్త యయిన ఒకగోపికయొక్క పరమనైపుణ్యము నిట్లు వర్ణించినది—

ముద్దులు మూట గట్టునటు ముద్దియలార! నటించినార లీ
ప్రొద్దున నంచు నిల్వఁబడి పొంతి వ్రజాంగన యోర్తు, వారిలో
న్నిద్దపుఁజెక్కుటద్దములనీడఁ గనంబడు బాలకృష్ణునిన్
ముద్దులు వెట్టుకోఁ దొడఁగె, ముద్దులుగాఁ దనువల్లి పుల్కలన్.

అంతకంతకు ముసిరి పోవుచున్న ఈ వర్షాకాలములో నన్ను ఒంటరి దానిని జేసి, నీవు పరదేశమునకు ఎట్లు వెళ్ళగలవు? అది నీకు న్యాయమేనా? అని కాంతునకు సూచించుచు, ఒకకాంత—

కటకతలమ్ములం బొడిచి కాఱునఁ గ్రమ్ముచు, దాడి సేసి ది
క్తటముల నెల్ల నుద్దపడిఁ దామును లోఁగొని, పోయి, రేఁగి, యు
ప్పటికపు డాఁగి వచ్చి విడఁబాఱెడు మబ్బులతోడ నుబ్బునం
బెటిలి త్యజించుచున్న దదె వింధ్యము, పైవలెవాటునట్లుగాన్.

పైయర్థమునే మఱొకగాథ, భంగ్యంతరముతో —

ధనువులం బూని, గిరిరాజుతలను నిలిచి,
శబరు లదె చూచుచున్నారు, ప్రబలకరుల
చేతఁబోలెఁ, గాఱుమొయిళ్ళచేతఁ గ్రమ్మి
క్రుమ్మఁబడుచున్న వింధ్యనగమ్మువంక. ౧౬

"వానలు వెనుకఁ బట్టినవి. శరత్కాలము సమీపించినది. నదులు ప్రవాహములు తగ్గి మార్గావరోధము కలిగింపక కాల్నడ అవుచున్నవి. తృణకంటకాది మార్గాంతరాయము లన్నియు ప్రశాంతము లయిపోయినవి. ఇక నీ ప్రియుడు త్వరలోనే రాగలడు,— అని తనసఖురాలిని ఓదార్చుచు చెలికత్తె వర్షావసానమును వర్ణించినది.—

ల్కొనగావించిన ఘోరకార్ముకపునూత్నస్మృత్యాక్స్ఫురత్పంక్తిఁ, ద
ర్ఘన సౌభాగ్యరమా జయధ్వజ పతాకంబోలె, నుల్లోలమై. ౨౦

ఎవ్వరు నోటిమీదుగా చెప్పవలసిన అవశ్యకత లేకుండగనే, ఆయా చిహ్నములను బట్టి నేర్పరులైనవారు సంఘటిల్లిన ఆయా సంఘటనలను లెస్సగా తెలిసికోగలరు.— అని తన సఖురాలికి ఇంగితచాతుర్యమును బోధించుచు ఒక మించుబోడి —

పుట్టినయింటినుండి తగుముచ్చటతో నరుదెంచులోననే
యట్టె గ్రహించె వ్యాధునికులాంగన, నాథునిచేతు, చుట్టునుం
బట్టులఁ గుంభికుంభ మదవర్ష నిఘర్షణ పంకిలంబులై
నట్టి కరంజశాఖలు దృగబ్జములం బొడకట్టినంతనే. ౨౧

వనచరులుకూడ పూర్వప్రేమానువృత్తిని మఱచిపోజాలరు అనిన, ఇంక సహృదయుల సంగతి వేఱే చెప్పవలయునా? అని నిరూపించి దూతిక, పూర్వనాయికాప్రణయానువృత్తికి పురికొలుపుచు ఒకనాయకునితో.

పెనఁగి రెయింబవల్ శబరవీరుఁడు రెండవభార్యతో రతిన్
మునిఁగి బలమ్ము తగ్గియును, మూఁపుపయిం గొనిపోవుచున్నవాఁ
డనువుపడం గడుం దనిత మయ్యును నెక్కుడ రాని దొడ్డవిం
టిని వనిలోనికిన్, మొదటినెచ్చెలిప్రేమము నోముకొంచుఁదాన్

తనతో కలసి మెలసి మెలగు జవరాలిమీద కారణాంతరమున అలిగి పోట్లాడి, ఒకగు ఆమెను నిరసించినాడు. అతరువాత అతడు తన ఉపభార్యతో— ఇక నేను దానిముఖమైనను చూడను, అని ప్రతిజ్ఞాపూర్వకముగా చెప్ప సాగినాడు. ఆమాటలు విని విని, ఆ సవతి—ఈమాట లన్నియు నిలుచునవి కావులే!— అని సూచించుచు ఆతనితో— ఇదిగో, ఇది విన్నారా? — అని సోత్ప్రాసముగా—

ఉండుఁడు తల్లులార! యను ఉక్కిరిబిక్కిరి యయ్యె నోర్వ నీ
గండము దాఁటి బైటఁ బడఁగాఁ గలదేనియుఁ బిండ, మింక నె

ఆ జవరాలు నీకుఁ బ్రియురాలు, ప్రియుండవు నీవు నాకు; నా
భ్రాజితశీల కీవు పగవాఁడవు, నే నటు లౌదు నీకు; నీ
యోజ నెఱింగియే పలుకుచుంటిని, వింటివె? ప్రేమ మన్న, స
వ్యాజము;నిండియుండునత మందు వికారము లెన్నొ నెయ్యుఁడా!

తనమీద తనచెలికానికి గల యనురాగాతిశయమును, తన సౌభాగ్యమును, తన లజ్జాశీలత్వమును సదర్పముగా ప్రకటించుచు, ఒక స్వాధీనపతిక, కాళ్ళకు పారాణి దిద్దుచున్న ప్రసాధికతో—

మా చెలికాని ప్రేమములు మచ్చర మన్న నెడమ్ము లయ్యెనుం
దోఁచును హెచ్చుమచ్చరముతో, నసమానలు జాణలన్నిటన్
నూ చెలికత్తె లెల్ల; రభినూనను సిగ్గును నొంతు నాకు; నే
లా చరణారుణాబ్జయుగళమ్మున కీయెఱలక్క పూయుఁగాన్?—౨౭

ఆ అరణ్యములో ఘలానాచోటికి నేను వచ్చెద నని సంకేత మేర్పఱిచి, నమ్మించి ఆమెను పంపినావుగదా! ఆమె అప్పుడే అక్కడకు పోయి నీకోసము ఎదురు చూచుచు ఉండును. త్వరగా బయలుదేఱి పోయి ఆ జవరాలి నభిసరింపు— మని తెలివిడి యగు లాగు ప్రసంగము సాగించి దూతిక జారునితో—

ప్రవాసఖేదము ననుభవించుచు ఇంకను ఇంటికి మగిడి పోవుటకు తీరిక గాక మిక్కిలి బాధపడుచున్న ఒక పథికుడు ఒక అరణ్యమార్గములో తనవలెనే ప్రయాణము చేయుచు ఎదురుపడిన మఱొక బాటసారితో— ఏమయ్యా; నీవుకూడ నావలెనే ఉన్నావా? ఎందుకీ గిక్కుమాలిన ప్రవాసము? ఇంటికి త్వరగా పోయి, నీరాకకై చూచి వేచి ఉన్న నీప్రేయురాలితో హాయిగా సుఖము అనుభవింపు— మని యభిప్రాయము సూచన యగులాగున—

మధుర వసంతమారుతకుమారకుఁ డూయెల లూపు తోఁటలోఁ,
మధుకర దివ్యగాన రసమాధురిలోఁ బస మీఱె వర్ణముల్
వశికమనో విమోహనకలల్ వెలయింపఁగఁ, బాడుచున్న దు
మ్మధుర గభీర నాద సుసమంచిత వ్రేత, వియోగగీతికల్ —

లతని సనఁబోఁడుఁ డింక నేదైన నీఁగు;
స్థిరతరప్రేమ మాపైపైఁ జేయునేమొ! 31

భర్త ఊరిలో లేని సమయమును చూచి వచ్చి, తనను గ్రోషమును చేసి పెట్టు కొన ప్రయత్నించుచున్న ఒక దూతికను మర్యాదగా పంపివేయుచు ఒక సాధ్వి అయిన ప్రోషితపతిక —

దయితునిరూపు కన్నువిరితామరలందును, వానిస్పర్శ మ
వ్యయసుఖరూపమై యవయవమ్ములయందును, గూర్మిపల్కు తే
నియ చెవులందు, నెమ్మనము నెమ్మనమందును, నాఁటి యున్న; న
ట్టియెడ, నెడమ్ము సేయు విధి యెక్కఁడ నేర్చెనొ దేమొ చెప్పవా!

ఒక ప్రోషితపతిక యొక్క చెలికత్తె, తత్కాలోచితముగా వేపు చున్న ఒక బాటసారితో, — మా సఖురాలి స్థితి క్రింది విధముగా ఉన్నది. అతడు తొందరగా ఇంటికి మరలి వచ్చునట్లు చేయుము, — అని సూచించుచు నామె దుర్భరదుస్థితిని గూర్చి—

తలిమమున నొంటిఁ బవళించి, తలఁపులోన
సఖునిఁ గాంచి, మీలితాక్షియై, సకియమిన్న
మించు నెటఁ దన్నుఁ దాఁ గౌఁగిలించుకొనియు,
శిథిలవలయముల్ చిఱురాకుచేతు లెసఁగ. 33

ప్రణయకలహముచేత ఎడమొగము పెడమొగము పెట్టుకొనిన ప్రణయినీ ప్రణయులకు మరల మాటలు కలిపి, ఇరువురను ఒకటి చేయుటకు అటు ఇటు తిరిగి తిరిగి, లాభము లేక, విసిగిపోయిన దూతిక, చివరకు వారిరువుర కోపము చల్లారి పోవునట్లు వారు వినుచుండగా తన్ను తా నిట్లు తిట్టుకొన సాగినది.—

ఎగసి పరిభూత మయ్యెఁ గా లీఁచపోపఁ
దిరిగి దిన మెల్ల నింటింటి కొఱులకొఱకు,

చివురు దోడిగిన; దదె నీను జీవితేశు
పయన మాఁపివేయును; నగఁ బోకుము మింక  ౪౩

"హారిహిఇ పిఅస్స ణవచూఅ పల్లవో పఢమమంజరి సణాహో,
మారువను పుత్తి! పత్థాణ కలస ముహసంఠిఓ గమణమ్"
అని ఉన్నది. దీనిఛాయ గంగాధరభట్టు—
"హరిష్యతి ప్రియస్య నవచూతపల్లవః ప్రథమమంజరీసహితః,
మా రోదీః పుత్రి! ప్రస్థానకలశముఖసంస్థితో గమనమ్."
అనియు; పండిత భట్ట శ్రీ మథురానాథశాస్త్రి—
"పుత్రి! ప్రస్థానకలశముఖనిహితః ప్రథమమంజరీసహితః,
నవచూతపల్లవోఽయం హర్తా గమనం ప్రియస్య మారోదీః."
అనియు, కూర్చినారు.

అనగా— బిడ్డా! ప్రయాణమునకు శుభశకునముగా ఉండవలె ననుసుద్దేశముతో, నేను ఒక లేతతీయమావికొమ్మను ఈవసంతకాలములో అంకురించిన ప్రథమమంజరితో సహా తెచ్చి, ప్రస్థానకలశముఖమున గ్రుచ్చి ఉంచినాను. అతడు ప్రయాణమై వీధిగుమ్మముదగ్గరగా వెళ్ళగానే చిగురుటాకులతో అది కంటబడును. వెంటనే అతడు వసంతాగమలక్షణమును గమనించి, తన ప్రయాణమును ఆపుకొనగలడు. తప్పదు. నీ వెందుకు దిగులుపడెదవు? ఊరడిల్లు.— అని గాథభావము.

అయితే, దీనిలో ఒకటి శంకింపవలసి ఉండును.— వసంతఋతువు అని తెలిసియుండి ప్రయాణమైనవాడేగదా అతడు? అప్పటికప్పుడు తెచ్చి, ప్రస్థానకలశములో మట్టిలో గ్రుచ్చి నిలబెట్టబడిన మామిడికొమ్మ చిగుళ్ళను చూచి ఇక వాడు వసంతాగమలక్షణములను లక్షించుట యెట్లు జరుగును? వెంటనే ప్రయాణమును మానుట యెట్లు పొసగగలదు? అతడు ఎంతగనికుడు అనవలసి ఉండును?

పై పై యగత్యము, వైరుధ్యము పద్యములో లేకుండ, సరసముగా ఉండునట్లు తెలుగుపద్యము కూర్చబడినది. తదభిప్రాయమును ఈవిధముగా సహృదయులు గమనింపవలెను.—

కలికీ! అతడు వసంతఋతువులో ప్రవాసమునకు పోవునా? పోడు. వాడు అట్లు పోవునంత పామరుడు కాడు. ఒకవేళ తప్పనిసరిగా పనితొందరను బట్టి, నీ నా మాటలుకూడ వినక ప్రయాణ మాసినా, కానిమ్ము. ఆ ప్రయాణము

ఇంత గట్టిగా చెప్పి పోయినాముకదా? అప్పుడే ఆతనిని చూడగానే జావ జావ అయిపోయి, ఆ కోపము, ఆపట్టుదల, ఎక్కడో దాచిపెట్టి నావే? అంతలోనే అంత తొందరగ ఏమి వచ్చినది?— అని చెలికత్తెల అడుగగా ఒక చతుర, సపరిహాసముగా—

ఎట్టులో సందు సేసి, నా హృదయకుహర
మందు మీరు చొప్పించినయట్టి కోప,
మాఱి, చోరకాముకుఁ డట్లు పాఱిపోయెఁ,
బ్రాణదయితుఁడు కనుదారిఁ బడినయంత. ౭౭

దాసానిపూలు కోసికొని రావలె నని పోయి, ఈమె అక్కడ ఏదో చిన్నపని చేసి వచ్చినట్టు ఉన్నది.— అని సూచించును సపత్ని, సోత్ప్రాసముగా, కథాభంగిమలో—

కలుకుం గుబ్బలపైఁ దవుల్కొనె, నవే కొంగ్రొత్తదాసానిపూ
వుల రేకుల్, తిలకింపుఁడీ! యనుచు గుంపుల్ గట్టి చూపెట్టి, నె
చ్చెలు లువ్వెత్తుగ నవ్వసాగి, రరుణశ్రీ మించు నున్గోటిగం
టులఁ బయ్యెంటన కప్పిపుచ్చుకొని, దాఁటుల్ సైచు నమ్ముద్దియన్.

గాథానురక్త అయిన ఒక నాయిక, మందానురాగుడైన నాయకునితో—

---

కూడ సాగడు. తనకు దానుగా ఆతడే తనప్రయాణమును కట్టిపెట్టుకొనగలడు. ఎందుకని అందువా? ప్రస్థానకలశములోని మధురసహకారవల్లి ఉండనే ఉన్నదిగదా? అది ఋతుధర్మానుసారముగా చిగురు తొడిగి, మధుకరము లను ఆహ్వానించుచు, రసనిర్భరమై, నవవసంతలక్ష్మీ సమాగమోల్లాసముతో విలసిల్లుచు ప్రత్యక్షముగా కంటబడును. అంతకుపూర్వము ప్రయాణధోరణిలో, పనిమొగములో, వసంతఋతు వను ధోరణి మనసున తట్టక పోయినను ఆ మామిడితీగను చూడగానే అతడు తప్పక వసంతసమయసమాగమసంపదను తెల్లగా గమనించి, రసికుడు కాబట్టి వెంటనే ప్రయాణము కట్టిపెట్టగలడు. బిడ్డా! నీవు నా కడుపున పుట్టిన దానివంటి దానవు. నామాటలు ఊరకే ఓదార్పుమాటలు కావు. నిజముగా నమ్ము, ధైర్యము నవలంబించుము. అట్లు కన్నీరు కాలువలై ప్రవహించునటు విలపించి, అధీరవు కాకు,— అని.

కడుఁగడు నొల్ల కిచ్చు ననుఁ గా దని, నెయ్యుఁడ! త్రోసి వేసి యీ
యెడ నవధీరణమ్ముఁ బ్రకటించుచు మాఱుమొగమ్ముఁ బెట్టఁ బా
ల్పడి, తిపు డీ విసంష్ఠుల వల న్నయనార్ధ శితప్రసారముల్
పడిఁ గొనిపోవుచున్నటుల పన్పడుచున్నవి నాదుజీవమున్. ౮౬

బహువల్లభు డగుటచేత కంటికికూడ కఱవైన వల్లభునితో ఒక వల్లభ తనహృదయము నెఱిగించుచు ఒకనాడు —

బహులవల్లభ! నినుఁ గూర్చువల్లభునిఁ గఁ
గొననిచానలు ధన్యజీవనలు గదర!
పెద్ద వేఁడినిట్టూర్పులు విడరు; సుచిర
మేసుపరు; చిక్కి తోడుగులై యీడిగిలరు. ౮౭

ఒక సుభగుడు తనసహచరునితో —

భరపడి నిద్దురం గునుకుపాటులు, తూలున సోలి వ్రాలుచుం,
దిరుగుచుఁ, దిర్యగంచితగతిన్, వివలన్మధురార్ధతారకా
స్ఫురణము లొప్ప నిందుముఖిసుందరసుందరదృష్టిపాతముల్
విరివిలుకాని కేనిఁ బలువీఁకున దుస్సహరూపముల్ సుమీ! ౮౮

చాల కాలముక్రిందట ప్రవాసమునకు పోయిన తనప్రియుడు ఇక రాడు అని గట్టిగా నిరాశ చేసికొని, ఒకప్రోషితపతిక తాను అంతదాక జాగ్రత్త గానే ఉన్నను నిలువలేక, ఒకబాటసిమీదికి ప్రసరించిపోయిన మనస్సును ఆతనికి తెలియబఱుచుచు ఆతడు వినునట్లుగా తనహృదయమునకు బుద్ధి చెప్పుచున్నట్లుగా దానినే సంబోధించి—

జీవమాత్రావశేషనై చిక్కి, యింత
వఱకు నిర్వహించితిఁ బ్రేమబంధ మెటులొ;
ఓ దరిద్రపుహృదయమా! యుడుగు మింకఁ;
దవులు నడి యెందొ, రమియించుదారిఁ జనకు. ౮౯

ఒక నాయికమీఁద ఒకనాయకునకు ఆసక్తి పుట్టునట్లుగా దూతిక, తిన్నఖక్షతావలోకన కౌతుకమును అతఁడు వినునట్లుగా—

అల వలరాచవానిసిరి యా నని తా నెలకొన్నపీఠ మా
కలికిమిటారిమిట్టచనుకట్టు, నఖక్షతపంక్తులం గుతూ
హలమునఁ జూచుకో మొనయు, నందుఁ గనంబడు నాయొయారిక
న్గలువలపూజ లందుకొని, గణ్యత నొందినయట్టు లొప్పెడిన్. ౫౦

నాయికమీఁద అంతగా అనురాగము చూపని నాయకుని అభిముఖుని చేయుటకు, విపరీతగతిప్రక్రియ తెలియని నాయికకు ఆచనువులు చెప్పుటకు, నేర్పరురాలైన ఒకదూతిక, లక్ష్మీనారాయణుల కామకేళీసేవనపాటవమును నమస్కారవ్యాజమున వర్ణింప సాగి—

అతులితశోభమైన కమలాలయయాననబింబ మచ్చుగాఁ
బ్రతిఫలియించి యెవ్వనియురఃస్థలకౌస్తుభదర్పణమ్మునం
దతిశయిలుఁ, మృగార్భకము నావలఁ బెట్టి ఖరాంశుబింబచుం
బిత మగు చంద్రబింబమటు; విష్ణుని వాని నమస్కరింపుఁడీ! ౫౧

ప్రియతము డెంత బ్రతిమాలుకొన్నను సుముఖురాలు గాక, బిగువు గొను చున్న ఒక కలహాంతరితానాయికను అనుశిక్షించుచు దూతిక —

ప్రముదముఁ గూర్పఁబోకు ప్రతిపక్షుల కింకను, సుప్రసాదలో
భమున మునింగి యున్న ప్రియవల్లభుఁ బ్రేముడి నేలుకొమ్ము వే
గమ; యటు గాదొ, హీనగతిఁ గాంతువు పేరిమి తగ్గి, వట్టి! సం
భ్రమము మెయిన్ గృహీతమగుమానము పెంపున రాశియట్లుగాన్

నాయికయొక్క విరహవేదనాతిశయమును నివేదించి, తత్సంగమమునకు త్వరపెట్టుచు దూతిక, నాయకునితో —

పాటున నోర్వరాని యెడఁబాటును అంపవుకోఁతచేత న
ప్పాట విపాట్యమాన మగు పాటలగంధియురఃకవాటమున్

చేటున ధార గట్టి ప్రవహించెడి కాటుకకంటినీరు కా
నోటను, ప్రసవాణసూత్రమటు లొప్పెడు నున్నది స్పష్టరూపమై.

ఆగి తేలిన ఒక వెలజాణమీఁద మనసు పోయి, ఊగక ఉబలాటపడు చున్న ఒక నాయకునకు, నిషేధరూపమైన వ్యాహరణితో అతని ఉత్కంఠను మఱింత పెంచివేయుచు, వయఃప్రౌఢ యయిన దూతిక సచాతుర్యముగా —

నమ్మ మిద్ది దుర్నిక్షేపకమ్ము పుత్త్ర !
యిట్టి సాహసమున కొడిగట్టఁబోకు;
మిందుఁ దవిలినహృదయమ్ము లెన్నఁటికిని
మరలి రావు; కోల్పోకుము మానసపటిమ. ౫౮

సుగతావసాన సముచిత వ్యాపారములు తెలియక, అట్టే ఉన్న ముగ్ధ రాలి మౌగ్ధ్యమును వెల్లడించి, ఆమెయొక్క చిరగతసందేహమును తొలగించి వేయుచు సఖురాలు, నాయకునితో —

రతి ననుభవించియును లెన్న. రతివిరామ
గతి నెఱుంగుమేరకు నేర, కతివ మిన్న,
యవిరతహృదయమై, కల దన్య మింక
ననుచుఁ దలపోయుచున్నది మనసులోన. ౫౯

విటకాంద్రను ప్రోత్సాహపఱచుటకు ముక్కాలు గడచిన ఒక వృద్ధవిటుని, వేశ్యాజనప్రేమప్రశంసా ప్రసంగముగా —

మోహముఁ బెంచు, ముచ్చటలు పొంగిన త్రోవలలో గమించు, ను
త్సాహము మించిపో సకలసౌరతసౌఖ్యరసానుభావతృ
ష్ణాహరణమ్ములై జగము సన్నుతిఁ గాంచు, ననేకకైతవ
వ్యూహవిశేషనిర్మితుల నొప్పఁజుమీ, వెలయాండ్రప్రేమముల్.

ఎందుల కట్లు చిక్కి సన్నమై పోవుచున్నావు ? అని నాయకుడు నవ్వుచు నడుగఁగా, గాఢానురక్త యయిన విరహోత్కంఠితా నాయిక —

మంచిది, మన్మథునిఖ మను పరాటు యెఱుంగవు, సంగిపెంఁడ! నో
ర్వంచుక నవ్వె దేటికి? పరాపరిసించుచు నుంటివోశ్కా, యీ
సంచున నాదు కార్శ్యమును! జంచలచిత్తజనమ్ముగ్రోసోత్తు ప్రా
పించినాఁడు నీకు విసిపించెదలే నతి మెల్ల దీసికా! ౫౭

చాలకాలమునకు వచ్చిన జారునితో ఒక విరహోత్కంఠిత సనిర్వేదముగా —

చెలులహితోక్తు లెల్లఁ జెవిచేర్చవఁ జేరఁగ నీక, దుర్వివా
రల నొక లెక్కసేయక, కరమ్మునమోఁదుగఁ ద్రోసివేసి, నీ
వలపునఁ గూడి, కాంచనసుఖభావన లబ్బులె యుండెను న్మహో
చెలువుఁడ! వానిచే నిపుడు జీవితసంశయమే ఘాసంగెరా! ౫౮

మధూకనికుంజములో సంకేతము చేసికొనిన జారుని దూతిక, ప్రతివేశినితోడి మాటలసందర్భములో— అక్కడ ఇప్పుడు సూర్యసహాగము పోసగిను. మెల్లమెల్లగా జనసంచారము సాగినది. కాబట్టి మీరు మఱొక సంకేతమును చూచుకొనవలెనునుమా,— అని సూచించుచు—

ఆ లతాతన్వి చెలువుఁ డీర్ష్యాళుఁ డయ్యె,
విచ్చిన మధూకసుమము లావెలది నెపుడుఁ
గోసికొననీఁడు, తనకుఁ దాఁ గోసి తెచ్చి
యిచ్చు, సరసస్వభావమ్ము హెచ్చిపోవ. ౫౯

అనునయించినను కోపము సడలనీక, సాభిమానముగా లేచి వెడలి పోవుచున్న నాయికను చూచి నాయకుడు నవ్వుచు చాటూక్తితో—

చంచలగాత్రి! యింత రభసంబున నాకరమందునుండి చే
లాంచల మూఁడలాఁగికొని యంత పరుంగిడి పోయె దేల! యొ
క్కించుక మెల్లగాఁ జనుము, యేపునసీయురమెక్కి త్రొక్కునా
కాంచనకుంభముల్ సనని కోనుకుఁ దెచ్చునో యే మొమోసముస్

నాయికానాయకుల కిరువురికి ఒక్కమాఱుగా ననురాగము అంకురించినచో ఎంత మనోహరముగా వర్ణ్యముగా ఉండునో, కర్ణరసాయనముగా వివరించుచు రసికు డొకడు, తనసహచరునితో, ఉదాహరణకు ఒక కలివేంద్రములోని ప్రణయఘట్టమును తీసికొని—

దోసిలిం గొన్న వ్రేళ్ళ సందులు వొనర్చి,
కనులు పై కెత్తి, పథికుఁడు కడఁగి దప్పి
ద్రావుకొలఁదిని, సన్ననిధార మిఁవుల
సన్న మొనరించెఁ బ్రపలోని చానమిన్న. ౬౧

బిచ్చగానికి బిచ్చము పెట్టబోయి చాల సేపు అయినదే! ఇంకనుఅంతులేదేమి? ఏమి చేయుచున్నది?— అని అత్తగా రడుగగా, చిన్నకోడలు చమత్కారముగా—

కనులు పొక్కిలిపై బిచ్చగాఁడు నిలిపె,
వెలఁది యాతనిమోముఁ జాబిల్లివయిని;
వానిమొల్లచిప్పను, నామెపళ్ళెరమును,
బొడిచి తినుచున్న వవె కాకు లుడిగి జడుపు. ౬౨

కలహాంతరితతో సఖురాలు—

ఎవ్వఁడు దూరమైన బ్రదుకే కడు సందియ మౌనొ, సందులం
ద్రవ్వి యొకప్పు డాతఁ డపరాధము సేయును గాక, కూరిమిం
బ్రెవ్వక యేలుకోవలయు ధీనిధి; గ్రామము నెల్లఁ గాల్చ్బగా,
కెవ్వసిచే గ్రహింపఁబడె దెంత ప్రియంబుగ నగ్ని చెప్పుమా! ౬౩

ఒక రసికునకు తన మనోగతానురాగమును తెలియబఱుచుచు ఆతడు వినునట్లు తనసఖురాండ్రతో ఒక రసికురాలు, తాను నివసించుచున్న ఆ ఊరును తిట్టుచున్నట్లుగా నేర్పుతో—

ముచ్చటగాఁ గనందగిన మోములు లేవు; వొకస్నేహపాత్రుఁడున్
మచ్చునకుం గనంబడఁడు; మంచియుఁ జెడ్డయుఁ బోయి చెప్పుకో

నెచ్చటి యేమృగమ్ములో; యిఁకెక్కడి హాసవిలాసకౌతుకం?
బచ్చవుఁబల్లెటూరి ప్రజ కాలము మే! యిది సుందర గ్రామ సుందరీ[illegible]

ఎప్పుడో, ఆచేనిలో పైగా [illegible] ప్రవర్తించునట్టి [illegible] నవి ఏవేవో లోలోపల తలపోసికొని, మురిసిపోవుచున్న [illegible] చూచి, రసికు డొకడు — [illegible] తలపులను వచ్చినపుడెల్ల పరాభిసారిక పరాయణులైన పల్లెవాండ్రగలు లోలోపల [illegible] పడుచు నుందురు. — అని నిదర్శించుచు, సహచరునితో —

దూదిపాలములు త్రొత్తగా దున్నఁబోవు
నాఁడు, నాఁగలి కుంబ్రాళ్ళు నవ పునవుము,
కోర్కెలుబుకెత్తు నెడఁదతోఁ గుచము లదరు
హాలికు నెలనాఁగ చేతులు వడఁకిపోయె. [illegible]

మాయదారులైనవా రెంతకైనను తెగుదురు. ఎంత కఠినమైన పనులైనను సరే, వారు తమపనిని మిక్కిలి యుక్తితో నెరవేర్చుకొందురు. — అని సఖు రాలికి బోధించుచు చెలికత్తె, ఒకధూర్తచేష్టితమును ఇట్లు స్పష్టీకరించినది.—

చీఁకటిదయ్యముల్ బలిసి చిందులు ద్రొక్కుచునుండ, గుప్తసం
దాఁకని త్రోవడొంకలన దట్టము గుట్టను నైన మట్టిచె
ట్లాకులపైని నెవ్వరో ఘనాంజన మొక్కటి చల్లినా, రచో
మూఁకగఁ జేరి, పాంథజనముల్ పడి కోయుదు రన్న శంకతోఁ

మొనద్రవేళ్ళమీద నిలబడి, చేతు లెత్తి, ఒకడు కానుగుచెట్టున పట్టు దోమపుల్లలు కోసికొనుచున్నాడు. అది తనకు సంకేతస్థాన మగుటచే ఒకతు ఆతనిని ఆపనినుండి మరలించుటకై సోపాలంభముగా—

నాకముఁ జేరఁ గోర్కె మది నాటుచు, నిల్చి నిజాగ్రపాదికన్,
స్తోకకరంజశాఖలను ద్రుంచుచునుంటివి, మేలు! చెంగటన్
వాఁకయు నల్లదే పరమపావని; కాని, ధరిత్రి కింకనుం
దాఁకుచు నున్నదేమి యిటు, ధార్మికుఁడా! భవదీయపాదముల్!

ఒక పరకీయానాయిక వినునట్లుగా ఒకచతురుడు సహచరునితో సరసముగా—

వెల్లువఁ బాఱు క్రొవ్వాలవు వెన్నెలలన్ వెదఁజల్లి యుల్లముల్
కొల్లలు గొట్టు నా కుసుమకోమలియాననచంద్రదర్శనం
బల్లలి నుండ నిమ్ము; నిజ, మాజవరాలు వసించుచున్న యా
చల్లనియూరి మేరయును జాల సుఖమ్మున ముంచియెత్తెడిన్.

మంద స్నేహుఁడైన నాయకుని గాఢానురక్తుని జేసికొనుటకు, ఒక చతుర, తమరైతుసంగతి సాకుగా తీసికొని, సోత్ప్రాసముగా—

కాలకరాళజిహ్వ కెఱగా నుసు నొడ్డి గతించిపోవ ని
ల్లాలు, లటు శూన్యమైన స్వగృహమ్మున, కాఱువిశోకమూఁపుకోన్
హాలికుఁ డొక్కపోఁట యయినన్ జనఁ; జేపనిపాటు లేక యే
రేయుఁబగళ్ళు నూరక చరించుచునుండును గాని చేనిలోన్. ౧౯

ప్రోషితపతిక యొక్క సఖురాలు, తత్పతికి ఒక పాంథునిద్వారా కబురు పంపుట —

రవరవ గాలివాన విసరన్ విడఁబాఱిన కప్పునుండి యు
ద్గవిడి స్రవించు వర్షజలధారలకుం జెడిపోక యుండ మ
క్కువమెయి నా వెలంది, గదిగోడపయిన్ లిఖియించుకొన్న నీ
యవధిదినమ్ముఁ జేతలిరుటాకులఁ గప్పుచునున్న దార్తయై. ౨౦

ఆ సంకేతస్థలములో — ఆతఁడు నీకోసము ఎదురు చూచుచున్నాడని నాయికకు; అబ్బో! ఆ గోదావరి యొడ్డున, ఆ పొదదగ్గఱ, పెద్ద గండుక్రోతి ఒకటి ఉన్నది. ఆ చుట్టు ప్రక్కల కది యెవ్వరిని రానిచ్చుట లేదు. వచ్చిన వారిని బట్టి పెట్టి అల్లరి చేయుచున్నది, అని ఇతరులకు భయమూ, సూచించుచు దూతిక, ఒక నాయికతో అన్యాపదేశమున —

క్రోవల కష్టమై నిలిచి, క్రొఁవ్వునఁ గూల్చుచుఁ జెట్టుపుట్టలం,
గావర మెత్తిపోఁతలుగ, గంతులు వేయుచుఁ, బైరుపచ్చలన్

లావునఁ బాడుసేసి, వెడనవ్వు మఁ, గూఁకుము, మున్న, నల్ల గో
దావరియొడ్డునందు భయదంబుగఁ గ్రోఁతి యొకంతు గంతునన్.

ఒకనికి పాపము, చాల గుణవంతురాలైన భార్య చనిపోయినది. మగల
ఆతడు రెండవ పెళ్ళి చేసికొనినాడు. ఒకనాడు అతడు తన మొదటిభార్య
నగలతో వానికి తగని ఆ రెండవభార్యను అలంకరింప బూనినాడు. అది
చూచి సహింపలేక మొదటిభార్య చెలికత్తె అన్యాపదేశముగా—

నాలుగునూర్ల కుం గొనిన నాఁటెవ్వఁగాసర రాజ మీఁల్గిపోఁ
గాలము మూఁడి, దానిమెడ గంటలపట్టెడ దాచి యుంతిరో
కాలము, కొన్న దున్నల నొకంటను దానికిఁ బోలఁబోమి, నా
లోలతఁ గట్టె గంగిగుడిలోనఁ దుదిన్ హాలికుండు ప్రేలఁగాన్.

సవతులవైభవాతిశయమును చూచి, అది తన కవమానముగా తలచి,
లోలోపల బాధ పడుచున్న నాయికను సఖులు — నీకు నీ అలంకారముగ
వైభవముకంటె మగని ప్రణయాతిశయమే అతిశయమైనది. అదియే అమూల్య
మైనది. యథార్థముగా మహిళామణులకు కావలసినదియును అదే. అది నీ
సొమ్మే కదా? — అని బోధించి, సమాధానపఱచుచు నన్యాపదేశమున—

కులుకుచు మత్తకుంభికులకుంభములందలి క్రొత్తముత్తియ
మ్ములు ధరియించి గర్వమున ముస్గు సవత్నులమధ్య నెంతయుం
బలువున నుల్లసిల్లె, నల వ్యాధవధూతిలకమ్ము, నెమ్మియిఁ
కెలు తలఁ దాల్చి, ఱేకు మడిగింపని పింఛపు నుత్సవమ్మునన్. 23

విటకానిని ఉబ్బవేసి వశుని గావింపుటకు కుట్టని, స్వభావసిద్ధమైన
వేశ్యాంగనలవక్రత్వమును సుమధురముగా సమర్థించి, చెప్పినారు—

వక్రపుఁజూపుజంకెనలు, వక్రపుదారులు, వక్రపుఁగతుల్,
వక్రపుఁబల్కులున్. మిగుల వక్రపునవ్వులు నొవ్వ నుల్లల
ద్వక్రవినీలకుంతలల వారనిప్రేమములం గడింప. నే
వక్రత లేని పుణ్యములపై రులు పండి ఫలింపగావలెన్. 24

గోదావరీతీరమున పొదరిల్లు సంకేతముగా ఒకజవరాలి కభిసారసుఖము అన్యాహతముగా జరిగిపోవుచున్నది. ఒకనాడొక సన్యాసి అది తన ధ్యానాదులకు చాల అనువుగా, విజనముగా ఉన్న దను నూహతో ఆపొదరింటను కాపు వేసి ఉన్నాడు. తనవేళ కచటికి పోయి, ఆమె అతనిని చూచి, ఎటులైన సన్యాసిని వెళ్ళగొట్టి, తనపని నెగవేర్చుకొనవలె నని సంకల్పించి, అతనితో ఆపొదరిల్లు ఒక భయంకరమైన సింహమునకు ఆవాసముసుమా! అనియు, ఇక్కడ ఉందువో, నీకు చాల ప్రమాదముసుమా! అనియు సూచించి వెఱపించుచు, నేర్పుతో, విధిరూపమైన నిషేధమున —

ఇక నిన్ను అడ్డగించువారు ఎవ్వరు లేరు. నీ వభిలషించుచున్న మా సఖురాలితో హాయిగా గమింపవచ్చు. గోదావరీతీరములోని ఆ ఫలానా నికుంజము సంకేతముగా నేర్పఱచుకొనుడు.— అని జారునకు తెలియబఱచుచు, మాటికి అన్యాపదేశముగా—

త్రోవ నెదిర్చి నీవయిని దూఁకిన బింకపు గ్రామసింహముం
గావునఁ బట్టి గట్టిగ మెడం బిగలించి వధించినైచె గో
దావరియొడ్డునం గల లతాగృహమందలి సింహపోత; మిం
తే వెఱలేక, స్వేచ్ఛగఁ జరింపుము నీవిఁక, నోయి ధార్మికా! ౭౫

జాలిపడి సహాయపడుచున్నట్లుగా సమీపించి, ఒకజవరాలితో స్వర్గసుఖానుభవముచ్చాగా తనయభిలాష తీర్చుకొనుచున్న ఒక యువకుని చూచి రసికు డొకడు పరిహాసపూర్వకముగా—

చెవి నిడుకొన్న క్రొత్తగిరిచెందొవపూవులలోని పుప్పొడుల్
పవనసమీరితమ్ములయి, వాలున వచ్చి పడం, గలంగు నా
యువిద మొగంబు పెద్దగను లుఫ్ఫనియూఁదుచుఁ దీపిఁ గాంచుచుం
టివి పలకారిముద్దులను, నీ వని మేషులలో నెవండవో! ౭౬

ప్రియవిరహవిధుర యయిన ఒక ప్రోషితపతిక, పతిసమాగమము గలిగించుటకు త్వరపెట్టుచు సఖురాలితో—

క్రొవ్విన యీ కదంబములగుత్తులయుంతగఁ, దక్కినట్టి యే
పువ్వులుగూడ నన్ను వెత ముంపవు ప్రల్లదనంబు మీఱఁగా,

ఎంత బ్రతిమాలినను సుముఖుఁడు గాక, నాయకుఁడు మఱింత కలుషింపఁగా, నాలుక తెగఁ గొఱికికొని వానిని మరల తన కభిముఖుని చేయవలసినదిగా బోధించుచు కలహాంతరితా నాయిక, ఆప్తసఖియగు దూతికతో—

తెలివిఁ జాలిన నేర్పుకత్తె వీవు, దూతీ! నీవె నిక్కంబుగాఁ;
బలుకన్ నేర్తువు గట్టిగా వ్యవహృతుల్ గాఁ జాల్మముల్ నోర్చుచోఁ
గల నిందాతిపడంగి పాండురత పొక్కంబోని చందానన, నా
వలకాంక్షన్ సరిదిద్ది త్రిప్పఁ గల నవ్యాజానురాగంబునన్. ౮౧

బహువల్లభుఁడైన ఒక నాయకునితో దూతిక, ఒక నాయిక యొక్క ప్రణయాతిశయమును గూర్చి వివరించుచు—

మదనుతు లెందఱో మితికి మాలినయట్టుండఁ గూడియున్న నీ
హృదయమునందుఁ దానమఱి యేర్పడి నేరక, క్రుంగి యాత్మశాం
గి, దినదినమ్ముఁ జాల పొరఁగించుచు నున్నది కార్శ్యసంపదా
స్పదమగుమేన, వేఱుపనిపాటులుమాని, నితాంతకార్శ్యమున్.

ఒక ఉత్తమైత తనకుగల యనురాగమును వివరించుచు సహచరునితో—

స్వాంతమునందునుండి నిముసమ్మడఁ బాయదు, నాఁడునాఁడు దు
ర్దాంతదురంతతాపమునఁ ద్రవ్వి యొదవన్ గిలిగింతవెట్టు నా
కాంతకుసీలకుంతల, జగన్మహనవెల్లడి సేయు వీలుగా
కెంతయు గూఢగూఢమయి యేఁచెడి పాపపుశంకపోలికన్. ౮౩

వ్యక్తాపరాధుఁ డయినను కౌఁగిలించుకొని, మఱి యేమేమో చేసి, అనునయించుచున్న ప్రియుని గని ఆగ్రహావశ యయిన ప్రగల్భానాయిక—

నా శోకక్రోధతాపములకునా? సరి యీ యుపలెమ్ము పాదముల్
దాఁకునో యేమొ శీఘ్రము; చిరా బ్రతిమాలెద వేల? వెఱ్ఱివాఁ
డా! కనుఁగొంటెఁ గ్గ కొనుము; న్యాయము గాదులె నీమనమ్ము చీ
కాకయి పోవఁ గంతదనుకం గినుకం గొని సీల్గ నాకునున్! ౮౪

విరహావిధుర యయిన నాయిక యొక్క సఖురాలు, ఉత్సాహగించుము కోసము నాయకుని తొందరించుచు—

ఆ రమణీలలామమధురాధరబింబము పెద్ద వేడి ని
ట్టూరుపుగాడ్పుమంటలకు నొందుచుఁ దాపము, కంటినీటిలో
సారెకుసారెకుఁ మునుఁగ సాగుచు, నీవిరహామ్ముసం గల
ల్వారిసదోయి! ♦శ్యామశబలవ్రతదీక్ష వహించినట్లుగాన్. ౮౨

తాను పూనిన కోపమును పురస్కరించుకొని, ఆత్మాభిమానముతో నాయకునితోడి కూడికకు సంకోచపడుచున్న నాయికకు — గంభీరమైన ఆశయము గలవారికి ఒకవేళ కోపము వచ్చినను అది అంతస్సులో నుండును. అవసరమును పురస్కరించుకొని పైకి మాత్రము తగుమాత్రముగా నాటకీయముగ కోపము వచ్చినట్లు అభినయింతురు. — అని సూచించి, నాయకుని కలియుటకు ప్రేరేపించుచు దూతిక. అది జనసమక్షము కావున బహిరంగముగా చెప్పవీలుగాక, శరత్సరోవరవర్ణనవ్యాజమున—

అమలతరశరత్కమలాకరములలోని
నీళ్ళు వెలికి వెచ్చన, లోనఁ జల్లన యయి,
మధురగంభీరములు నయి, మహిమ మెఱసెఁ,
గినుకఁగొన్న సాధులనిండుమనములట్లు. ౮౩

ఏమో ! అక్కడికి పోయి, అతనిని సమీపించుట యనిన నాకేమో అదరు పుట్టి, గుండె దడదడలాడుచున్నదినుమా— అని యనుచున్న ప్రథమాభిసారికను — అది ప్రప్రథమములో ఎంతటివారికైనను తప్పదులే! — అని సమాధానపఱుచుచు దూతిక —

చెలువుఁడే తెర దరి, కేమిసేయువలెనో?
యేమి యనవలెనో? యది యెట్లు లవునో?
యనుచుఁ దొలిసారి దరియ సాహసము సేయు
ముద్దరాలికి దడదడ పుట్టు నెడఁద. ౮౪

♦ఈ వ్రతములో తొలుత అగ్నిప్రవేశము, పిదప జలప్రవేశము పౌనఃపున్యమున చేయబడుచుండును.

ఎంత వేఁడుకొన్నను ప్రసాదమునకు రాక, ఇంకను కోపముతో అల్లరి చేయుచున్న కలహాంతరితానాయికకు గ్రహాలత్వదోషమును ఆపాదింప జేయుచున్న నాయకునకు, అది త్రోసి పుచ్చుచు దూతిక ఆమెవైఖరిని సమర్థించి—

అడుగులమీఁద వ్రాలి వినయమ్మున వేఁడుచు, నీవు మ్రొక్కున
ప్పాడు, రతనాలయుంబెలఁ దవులొక్కని చిక్కులుపడ్డ నీకులుల్,
విడువని ప్రీతి లేతలిరు వ్రేళుల మెల్ల నెడల్చునప్పుడే,
పడఁతుఁ మిన్న నేరుపున వ్యక్తము సేసెను గోపమూఁగుటన్. ౮౮

ఒక జవరాలి యనురాగాతిశయమును తెలియబఱిచి, ఆమెతోడి సమాగమునకు ఉత్సాహపఱుచుచు దూతిక, నాయకునితో—

ఆ విరిపూవుబోఁడి జవరాలు వరాలమెఱుంగుబొమ్మ గో
దావరి రేవునన్ దిగి ముదమ్మున స్నానము సేసె, నయ్యెడన్
నీవు మిగుల్ప మెట్లపయి నిల్చిన కుంకుడుకాయను ర్వనీ
ష్యావశవృత్తిఁ దోముకొనె, శ్యామలకోమలమైన మేనికిన్. ౮౯

తన ప్రాణపతియొక్క గొప్పదనమును, ఊరిపెత్తనదారుతనమును, సఖురాలితో చెప్పుకొనుచు ఒక ప్రోషితపతిక—

ఇపుడె దూర దేశమ్మున కేగె దయితుఁ,
డిపుడె శూన్యశూన్యము లయ్యె నెల్ల రచ్చ
బండలు, కచేరియరుగులు, మండపములు,
గుళ్ళు, ముంగిళ్ళు, మా చిత్తకుహరములును. ౯౦

గుణసంపదలో తనకు ఏమాత్రము ఈడుకాని ఒక గణికను ఒక భుజంగశిఖామణి యూరూరఁ బొగడఁ బొగడఁ బొంగిపోవుచుండఁగా విని సహింపలేక, గుణగర్విత యయిన మఱొక గణిక—

ఓను వంకర లెన్నియో యొక్కయింత
తెలియ నేరనట్టి నిరక్షరులును, గార

వమున నధికులుగాఁగ స్కాంధనులటుపంపుఁ
దాల్పఁబడుచుండు, రగసాలిత్రాసులట్లు. ౯౧

స్నేహితునితోఁడి మాటలసందర్భములో విలహాంతరమున ... ప్రియకాంత తలపునకు రాగా, సమయస్ఫూర్తితో ఆసంగతిని ... ఒక రసికుడు—

వలుచనిచెక్కుటద్దములు వంపునఁ గెంపులు పాఱి, సీనుసం
భలుమఱుఁ దొట్రిలం బలుకు, పాఁశరమోవి నహింకిపోవఁగా,
వల దిఁక నన్ను ముట్టకుము, ప్రాఁపునఁ జేరకు, పొమ్మటంచు స
గ్గలమగు కిన్కఁ దానెయెడగాఁజనుప్రేయసియుంద మంతయో!

ఆఫలానావారికి, ఒకరిమీద ఒకరికి ప్రేమ లెన్నగా అంకురించినది ఉన్నది. అది నేను కనిపెట్టినాను, అని ఒకడు నేస్తకానికి వివరించుచు, అందుకు నిద ర్శనముగా—

దిగుచు గోదావరి, నెగుచు దిగుదు లోవ్వు
లనుచు నాతసిఱొమ్మున నలిన రొమ్ముఁగ;
దయకుఁ దావల మైన ట్లతండు నామెఁ
గొనియెఁ జవ్వాన గాఢోపగూఢమందు. ౯3

మందానురాగుఁడైన నాయకు ననుకూలపఱుచుటకై దూతిక, నాయి కానురాగప్రకటనముద్వారా—

నీవు నీచేత నొసఁగిన పూవుదండ
వాడి వాసన సెడినను, పహి వహించు
చున్నదికదోయి! యిపుడు నా సుదతి, యుద్వ
సిత పురీగృహదేవతాస్థితి దలిర్ప; ౯౪

వ్యక్తాపరాధుఁడైన ప్రియునిపై కోపము నుపదేశించుచున్న బంగసపురం ధ్రితో ఒక పతివ్రతాయువతి—

నడవడిఁ దప్పిపోయి యొకనాఁడు ప్రియుం డవినీతవృత్తికిం
గడఁగునుగాక, నా కలవి గాదిది నవ్వులకేనిఁ గోపముం

దోడుగుట; యెట్టులో తోడుగఁ, దోడనె పిల్చినయట్లు వాని వెం
బడిఁ బడిపోయి, నాయువయువమ్ములు బానిసలై వశంపడున్. ౯౫

కత్తిపీట (ఉత్ఫల్లిక) ఆట ఆడుకొనుచున్న తమ ఆడుపిల్లలను,— మీ
రీ ఆటలు ఆడుకోకూడదు. — అని వారింపసాగిన తల్లులతో ఒక నెఱజాణ—
అట్లు కాదు. వారు ఆ ఆటలు తప్పక ఆడుకోవలెను. అందుకు తగిన కారణ
మున్నది.— అని ఉపక్రమించి, తనమాటలు వినుచున్న కాముకజనులమనస్సును
అపహరించుటకై ఉపరతాదులలో తనకు గల చాతుర్యమును, అనుభవమును,
సామర్థ్యమును లెస్సగా సూచించుచు—

కత్తిపీటయాటల నాడు కన్నె నెపుడు
వల దని మరల్పకుఁడు; ముందు పైఁకొనుమగ
పాడిలోఁ బెద్దపిఱుఁదులబరువుచేత
నలసిపోకుండఁ, దప్పక కావలయు లెస్స. ౯౬

తన శీలమునుగూర్చి లోకులు శంకించి గుసగుసలాడుకొనుటవలన
మిక్కిలి కించపడి, బాధ పడుచున్న సఖురాలిని తగినమాటలతో సమాధాన
పఱిచి ఓదార్చుచు ఒక చెలికత్తె, ఆమెతో లోకసామాన్యమును తీసికొని—

కులీనయయిన తన సఖురాలి శీలసంపదనుగూర్చి శంకించి, కళంకములు
ఆపాదించుచున్న విరోధిజనులను నోరు మూయించు తలంపుతో, తత్పక్ష
పాతిని అయిన చెలికత్తె, వారితో ధార్ష్ట్యముగా—

కలరు యువతులు పలువురు గ్రామమందు,
మధుగమనునహనుసను.మునుచున్న, మగఁడు ముసలి,
తగినపసువు, జీర్ణసుర, స్వతంత్రు గాలు,
♦చెలువ చెడిపోక మఱియేమి చేయవలయు? ౯౭

---

♦పైపద్యమూలములో మఱొక భావము కూడ గోచరించుచున్నది.
అప్పుడు అవతారిక, పద్యము, ఇట్లు చెప్పకొనవలెను.—

"మీసఖుగాఱు చిక్కిపోవుచున్నదేమి? అని పరియాచకముగా అడుగు
చున్న మంచానుగాగుడైన నాయకునకు నాయికాసఖి, మర్మచ్ఛేదకముగా—"

నాయికయొక్క ప్రేమ వ్యక్తపఱుచునట్టి [illegible] నాయకునితో —

> ఎన్నిరీతులనో, మఱి యెన్నిమార్లొ,
> నీదు పలుకులు నేను విన్పించుచుండఁ,
> జివురుచేయిసన్న వినలేదు చెప్పు మనుచు,
> నూఱుమార్లు చెప్పించుకొనుఁ లతాంగి. ౯౭

ఒకానొక కులాంగనమీద మనసు పోయి అనవరతము, ప్రేమ పెచ్చు— ఆమెకు నేను అంతగా ప్రేమపాత్రుడను కానేమో — అని సంశయముతో సదమద మవుచున్న ఒక కోడెగానికి దూతిక — ఆమె నీమీద మిక్కిలి అనురాగముతోనే ఉన్నది. కాని అది లోకమునకు తెల్లమౌతుందని జనసమక్షములో చాల నేర్పుతో మెలగి దాచుకొనుచున్నది. అంతటి తెలివి తేటలు గల ఆజనరాలు చాల సగిసుగాలు. ఆమె నిన్ను వలచినది అనగా అది నీభాగ్యవిశేషమే అని చెప్పక తప్పదు.— అని సూచించి, దానిని ఉత్సుకపఱుచుచు —

> తరుణి సంవరణమ్మునఁ దవిలియునికిఁ,
> బ్రకటితస్నేహ సద్భావరస సునిర్భ
> రముగ నిన్నుఁ గంటఁ జూచిన క్రమమె దోఁప,
> నొరులసైతముఁ జూచుచు నున్నదోయి! ౯౮

ప్రసవించి చాల కాలము అయినను రమింప బూనక, రమణుడు ఇంకను ఆలసించుచుండుటచేత ఒకరమణి గమనాభిలాష పొడమి, — పిల్లవానికి పళ్ళుకూడ వచ్చినవి; ఇక మనము దూరముగా ఉండవలసినపని లేదు, అని తెలియ బఱుచుచున్నది. — అని ఒకతె మఱొకతెతో —

> ఇదిగో కైకొని చూడుఁడీ యిట్టు లనుచుఁ,
> జిన్ననగవు కెమ్మోవిపైఁ జిందు వొందఁ,

---

"కలరు యువకులు పలువురు గ్రామమందు,
మధుర మధుమాస సమయమ్ము, మగఁడు వృద్ధు,
తగిన పరువు, జీర్ణసుర, స్వతంత్రురాలు,
చిక్కిపోక యా చెలి యేమి సేయఁగలదు?" ౯౨

బతి కొసంగుచున్నది సతి, ప్రథమజాత
దంత యుగ లాంకితమ్ముఁ గన్నతనయుమొగము. ౧౦౦

రసిక మనో మిళింద నికరమ్ముల ర మ్మని యాగళమ్ముగా
రసములు జాలువాఱ మధురమ్మగు విందులు వెట్టి, పేర్మి హె
చ్చ, సుకవివత్సలప్రముఖ సత్కవి నిర్మిత గాథలం దమో
ఘసమయి మీ ద్వితీయశతకమ్ము సమాప్తిని బొందెఁబొందికన్

పాలితసత్కవిత్వ కవివత్సల పాలిత పాలితాది సం
లాలితమైన గాథలకలారసవాటికలో రసాలముల్
జాలునఁ దేనియల్ గురియఁ జాలిన రెండవ కోటి యిద్ది, యీ
లీలఁ గొనెన్ నృసింహకవి లేఖినిలోఁ బరిపూర్ణ వైఖరిన్. ౧౦౨

సరసతరము గాథాసప్తశతకమందు
రెండవు శతక మతిమనఃప్రీతిఁ దనరె;
నెద్ది చెవిదారిఁ బడినంత, నెడఁదలోనఁ
జొరగ సమ్మోహమేని మధురతా గరిమఁ జేసి. ౧౦౩

# షూంటవశతకము

నాకు అన్యవనితాసక్తి ఏమాత్రము లేదు. [illegible] నామమాత్రము అట్లు అపవాదములం నెత్తిని పడవేసి కూయుచున్నారు. [illegible] నిజముగా నమ్ము, — అని అనునయించుచున్న ప్రియునితో [illegible] సపరిహాసము గా —

లోకమ టనుకొనుఁగాక, లోకు చెప్పును,
నీకు నీడెందమే సాక్షి నిక్కువముగ;
నంత చులుకందనాన నిందార్హ మనఁగఁ
గలుగు మందానురాగము గాదు నీది. ౧

ఒక కులట, తనచూపుదారిలో అందుబాటులో [illegible] గానిని వశపఱుచుకొనవలెనని అతడు వినునట్లు నిజహృదయమూ [illegible] —

ఇచ్చ వచ్చినదారిఁ బఱ్ఱెత్తుచుందు,
నందఁగా రాని పండ్లకు నఱ్ఱు సాఁతు,
పురక యాకాశపథములఁ దిరుగుచుందు,
నెపుడో తిందువు డెందమా! యెదురుదెబ్బ. ౨

గుణగర్వితి అయిన ఒక గణిక, [illegible] కాలము లోనే విరక్తుడై తన్ను వదలిపోయిన ఒక విటగానిని నిందించుచు [illegible] —

గుణములె గౌరవమ్ము సెడి కొన్న వియోగ చులుకందనమ్ము! నా
గుణముల గుర్తెఱుంగఁగల కోటికి లోకమె లోకువయ్యెనో!
గుణములు లేనిదాన నయి క్రుంగితినో మఱి నేనె! చాల, స
ద్గుణములకల్మి భాసిలునదో యుల వాసిజనమ్ము మిన్నయై! 3

నీహృదయము అనుభవించు ఆవేదన వానికి చక్కగా తల కెక్కునట్లు నివేదించి, అన్యాసక్తుడైనవానిని ఎటులైన నీదెసకు త్రిప్పుకో; — అని బోధించ

దూరదేశప్రయాణమునకు సిద్ధపడి మంచి ముహూర్తములో మఱొకరి యింట మూట ముల్లె పెట్టుకొని ఉన్న నాయకునిదగ్గఱకు అతనిప్రయాణము ఆపివేయింపవలెనను తలంపుతో పోయి, అతనిభార్యయొక్క సఖురాలు మఱొక ప్రోషితపతికయొక్క సంగతి ప్రస్తావించి—

ఏగెను దూరదేశమున కీదినమందె ప్రియుండు; వల్లభుం
డేగెను నేఁడె; యీదినమె యేగె సఖుం;డని యా వెలంది యు
ద్వేగముతోడ లెక్కిడి పదింబదిగాఁ, దొలినాఁటిపూఁటలో
నే గదిగోడపైని లిఖియించెను నల్లని రేఖ లెన్నియో! ౮

ప్రథమసమాగమములో సమకూరిన సురతసుఖము కంటె మఱునాఁడు సలజ్జమధురమైన నాయికావలోకనము ఎంతో మనోహరముగా ఉండును, అని సూచించి, తన సహృదయత్వమును ప్రకటించుచు రసికుఁడొకఁడు స్నేహితునితో—

ప్రథమసమాగమమ్మున భరంపడు సౌఖ్యముతో రతోత్సవం
బధికముగాఁ బొసంగినను, నంతటి సంతస మీ, దపత్రపా
మధుర మనోహరస్మిత సమంచిత మంజు దృగంచలమ్ము త
న్మధురముఖాంబుజమ్ము మఱునాఁడు కనంబడినప్పుడట్లుగాన్ ౯

చెలిమికాఁడు బ్రతిమాలుకొనగా బ్రతిమాలుకొనగా ఎట్లో ఒకక్రమమునకు ఒకజవరాలు అనునయములో పడి, ప్రసాద సుముఖి అయినది. ఆమఱునాడు, ఆమెచెలికత్తె, ప్రసంగ వశాత్తు మన్మథబాణ గుణగణములను గూర్చి ముచ్చటించి, గొప్పగా వానిని పొగడ సాగినది. వినుచు వినుచు ఆ జవరాలు — మన్మథబాణములలో అట్టిగొప్పతనము ఉండిన ఉండవచ్చు. కాని, మన్మథబాణములు అనగా నీవుచెప్పే అరవిందము, అశోకము, చూతము ఇత్యాదులు కావు. అవేఅనితలచువారికి నిజముచెప్పవలసివచ్చినచో మన్మథ సామ్రాజ్యములో బొత్తుగా స్థానము లేదు. అసలు మన్మథ బాణములు అనగా ఇవి,అని మధురమధురముగా వ్యాఖ్యానించి వివరించుచు—

మాలిమి నేలు మంచు బ్రతిమాలి, చివాలునఁ గాళ్ళవ్రేళ్ళపై
వ్రాలి, హతాశుఁడై, ప్రియుఁడు, క్రక్కురునప్పటి జాలి చూపులే

చాల సహింపరాని సుమచాపుని వాఁడి మెఱుంగు తూఁపులై
క్రాలను మమ్ముఁబోఁటులఁ; తగుఁగా వృత మన్యుల కెవ్వియేనియున్

పిఱుఁదుల పైభాగమున మెఱయుచు వ్రేలాడుచున్న బంగారు మొలనూలుతో సింగారించుకొని ఒలికించుచున్న ఒక నితంబినిని చూచి రసికుఁ డొకఁడు సాకూతముగా—

ఆరసినిష్ఠ శ్యామశబలాఖ్య మహావ్రత సాధనమ్మునం
దేరసి దెట్టి దెద్దియును నేరదు శ్యామ! భవద్విశాల గం
భీర నితంబబింబ మణిపీఠతలాభ్యధిరోహ సంగ కే
లీ రససిద్ధికిన్, జిగి వెలింగెడు క్రొత్త పసిండినూల్విన్. ౧౧

తనపలుకులు అప్యాయముగా ఆలించుచు ఉన్న కాముకుని మఱింత ప్రసన్నింపఁజేయుటకై మూర్తికి, నాయికతో, ఆమెసౌభాగ్యాతిశయమునే ప్రశంసాపూర్వకముగా ప్రసంగింప మొదలిడి—

తనకుం గల్గినకల్మి నన్యులకు మోదస్ఫూర్తితో నిచ్చుటల్
జనసాధారణధర్మమే యగును నాశ్చర్యంబు లే దందు, జ
వ్వని! నీ కొక్కరవంత లేకయును, దౌర్భాగ్యమ్ము కోకొల్లగా
ననుభావింపఁగ నీసవత్నులకు నీయం జాలినావీవహో! ౧౨

ప్రోషితుఁ డొకఁడు తనప్రియురాలిని తలఁచుకొని కలతపడుచు తత్సమాగమాభిలాషముతో ఉత్కంఠితుఁడై మనోవినోదముకొఱకు సహచరునితో ప్రాసంగికముగా—

పొలఁతి నెమ్మోము చందురుఁ బోలుఁ; జెలువ
మధురస మమృతరసముతోఁ బోల్కిఁ గొనును;
సరస సకచగ్రహా గాఢసోజ్జ్వల కపోల
చుంబనము దేనితో సమానంబో! తెలియదు. ౧౩

ఎన్నో పన్నాగములు పన్ని తనవలలో వేసికొనబడిన వాఁడయి నప్పటికి చిరవిస్మృతికారణ మగుటచేత ఎన్నాళ్ళకును తనసఖురాలికి

సుముఖుడు గాని నాయకుని ఉత్తేజపఱుచుటకై మాతిక లోకసామాన్యమును తీసికొని—

తమకముతోఁ దలంచుపని దాఁపున వచ్చిన వేళ, మీఁన మే
షములుగుణించియుందుఁబొరసందులుదిద్దుచుఁగూఁచుచుండిమాం
ద్యమునఁ, జిరావిమర్శముల నంతులు పట్టని మానవుండు, క
ర్జములను బాడుసేసికొని ప్రమందక తప్పఁడు చేతిమీఁదుగాన్.

ఎంతగా బ్రతిమాలినను ప్రసన్నతకు రాక మఱింత బిగిసి పోవుచున్న నాయకునితో నాయిక, భణితి మార్చి తన గాఢానురాగమును ప్రకటింపుచు చమత్కారముగా—

ఎన్నియో రెట్లు నీకంటె నెక్కుడైన
నాదుజీవితమే చాల నాకుఁ బ్రియము;
నీవు లేకున్న నది యిల నిలువఁబోమి,
నలిగి బిగిసిన నిను వేఁడవలసివచ్చె! ౧౫

ఆమాటలు ఆమాటలు విని, లేనిపోని అనుమానములతో ప్రియతముని మీద పట్టరాని కోపము తెచ్చుకొని ఒక మానవతి బిగిసికొనినది. అతడు చాటూక్తులతో, చరణప్రణిపాతాదులతో, చేతనయిన ట్లెల్ల వేడుకొనినాడు. సాంత్వనదాక్షిణ్యముతోనేమి, మఱొకవిధముగానేమి, ఒకవేళకు ఆమె కోపము తగ్గి సుముఖురా లయినది. అతడు తననిర్దోషిత్వమును, ఇతరుల కుట్రలను, బాగుగా వివరించి చెప్పినాడు. దానితో ఆమెలోని అనుమాన పిశాచము లన్నియు పటాపంచ లయిపోయి, మనస్సు అద్దమువలె నిర్మల మైనది. వెంటనే ఆమె పశ్చాత్తాపపడి, ఒదుగుగుండెతో — చెప్పుడుమాటలు విని నిన్ను చాల నొప్పించినాను. — అని సప్రణయముగా, ససౌహార్దముగా, అనినది. ఆమాట విని 'ప్రియుడు —అవును— అని తల ఊపుచు కాకూక్తితో— మరల ఇట్లే ఎప్పుడు చెప్పుడుమాటలు విని వానిని నమ్ముచు ఉండు — మని విధిముఖముగా యుక్తితో నిషేధించుచు ఇటు లనినాడు.—

బేలతనమ్ముఁ జేసి పలవించెదు నీ నుసునెచ్చబొమ్మముల్
గ్రాలుమదీయపృష్ఠఫలకమ్ముపయిం బడి, చిన్నిచిన్నిము

త్త్యాలుగ భిన్నభిన్న మగుదాఁక, నిటుల్ నను నమ్మఁబోవు,నీ
లాలక! పీనులందుఁ బస లాడెను మాటలె నమ్ముచుండుమా!

కాముకుని ప్రేమును మఱింత దృఢపఱుచుటకు ఒక మిటారి ఆతడు వినుచు నుండగా తనదూతికతో లోకసామాన్యమును ముచ్చటింప సాగి—

వ్యసనములయందు, దేశకాలాదులందుఁ
బొందుపడి, కుడ్యలిఖితమౌ బొమ్మవోలెఁ,
దోడునీడ యై, విముఖతఁ దొడుగఁ బోని
చెలిమికాని గడించుకోవలయు లెస్స. ౧౭

ఈ పొదరింటిలో జరిగిన కథ అంతయు, నేను బాగుగా తెలిసి కొన్నా నులే! —అని తన నేర్పరితనమును వెల్లడించును, విదితరహస్యుఁడైన చతురుఁ డొకఁడు తనవయస్యునితో—

ఇంతి నదీనికుంజమున కేగి యుదే తొలిచూలుగా, మనః
కాంతుఁ డొకండు తోడుపడఁగా, నొనరించిన శీలభంగవృ
త్తాంత మెఱింగి, సిగ్గిలి, పతత్త్రికులమ్ములు పాఱి సాగె వ్యో
మాంతముదాఁక తెక్కలమహాధ్వనిఁ జాటుచునున్నయట్లుగాఁ

ఒక ప్రోషితపతికయొక్క సఖురాలు వెంటనే ఇంటికి రావలసినదిగా తత్పతికి ఒకబాటసారిద్వారా కబురు పంపుచు—

సత్య మింత, దురంతవసంతసమయ
మునకుఁ జేతగానిది లేదు; వినుము కుఱ్ఱ!
కురవకపరిమళము వాఱె, కొంచెమేని
చెఱుపుఁ గొన దింతవఱకు నీ తెఱవమిన్న. ౧౮

నాయకు నుత్తేజపఱుప దూతిక నాయికానురాగమును వర్ణించుచు—

బాలకా! యి ల్గడచి నీవు వచ్చుచుండ,
నొకొక్కకవృతి వేష్టనమున నొవ్వు వివర

ములనిడి తరలనయనముల్ కలువకంటి,
పంజరమ్ములోపలి పక్షిపగిది కయ్యో. ౨౦

ఆమెయింటిముందుగా అన్ని మార్గముపోయినను నన్ను కన్నెత్తి యయినను చూడలేదే? ఇక నామీద ఆమెకు ప్రేమ యేమిటని? — అని ఉపాలంభముగా మాటాడుచున్న నాయకునితో దూతిక — అట్లు కాదు. ఆమెకు నీమీద గాఢమైన అనురాగము ఉన్నది, — అని తెలిపివేయుచు—

పట్టుపరదాలఁ గీల్కొల్పఁబడిన చనులు
బిగిసిపో, నరబొట్టనవ్రేళ్ళమీఁద
నిలిచి, నిస్పృహమా మేన నిగిడి కనిన,
నీవు కనిపింపనవు డామె యేమి సేయు.? ౨౧

ఒక ప్రోషితపతిక నభిలషించి, కాముకు డొకడు తన అభిలాషమును దూతికతో వెల్లడించినాడు. అపు డామె — ఆమె చాల శీలవతి, పతివ్రత — అని ప్రతిపాదించుచు, ప్రకృతవిరహము నొందిన పతివ్రతావృత్తితో ఆమె అనుభవించుచున్న దీనదశ నతని కిట్లు వినిపించినది. ....

వలపుల పెన్నిధాన మగు ప్రాణపతిం దలపోసిపంత నే,
జలజల రాలి బాష్పములు జాఱునఁ గాలువ గట్టి పాఱఁగాఁ
గలవనునూహ, మోము పెడ గానిడి, చాంగుని కాంత, పంత లోఁ
గెలుకఁగ, సందెవేళ వెలిగించుచున్నది దీప మింటిలోన్.

కాముకు డొకడు పురవీధిలో తనకభిముఖముగా వచ్చి దాటి పోవు చుండగా ఒక కామిని వెనుదిరిగి ఆతనిని స్నేహదృష్టిసూచకముగా చూచినది. ఆవెనుకనే ఉన్న దూతిక అది కనిపెట్టి, ఆ కాముకు నుపాలంభింపదలచి ఆ కామినితో తాను వలె నను తలంపున నాతనితో చేసిన ప్రసంగము సాగించి—

తలఁవనిదారిఁ గానఁబడి, దబ్బున నీ విటు పోవుచుండ, న
య్యలరు మెఱుంగుబోఁడిమ్రుదులావయవమ్ములు వెల్లువెత్తగా
వలితము లయ్యె; నంత, నునుపల్చని ఱెప్పల బాష్పబిందువుల్
వెలువడి, చిందు వొందె, యదె వీఁపున జాలులు వాఱెఁజూచితే?

ప్రియతముని యెడబాటు సహింపరానిది సుమా!— అని సూచించుచు ఒకతె అన్యాపదేశముగా సఖురాలితో—

అరయ మధ్యముఁడే లెస్స యువ్వుఁడు; సుజన
దుర్జనులతోడి పొత్తులు దొరుకరాదు;
కంటి కగపడి కుజనుఁడు కష్టిఁ గుడుపు;
సుజనుఁ డగునాతఁ డగపడుసుద్ది లేక. ౭౮

తనవల్లభుని సాభిలాషముగా చూచుచున్న ఒక వాలుగంటితో ఒక చతుర సాసూయముగా—

సుందరీ! కన్ను లరమూసి చూడ నేల?
సహజముగఁ జూడుమా వానిఁ జలము మాని;
వాఁడు లెస్స కన్నులపిండఁ జూడఁబడును;
నిన్ను ముగ్ధగా ననుకొను నిఖిలజగము. ౭౯

ప్రవాసమునందున్న ఒకడు, కులశీలాదులను చక్కగా పాటించుచు తనతో కలిగోని నాలుకగా మెలగు తనప్రియురాలిని దలచుకొని దిగులుపడి వినయమున మనస్సును కుదుటపడచుకొనుటకు సహాధ్యయునితో ఇట్లు చెప్పకొనసాగినాడు.—

గృహకృత్యంబులు దీర్చి యెల్లపని లోకింపంగ తే బ్రాల్మాల, కా
మ్యహృదంతర్గతసౌఖ్యంబులఁ గ్రాచు పగతో మానంబు వాటించి, మిం
చు హుహూశబ్దగళాయమానశిఖమున సంక్షోభిల్లుచుంగూడ, మ
ద్గృహిణీకర్ణము మెల్లఁ గాళ్ళకస నిద్రించుం గనుల్ విప్పచున్.

నీచస్త్రీయందు తనువులు నడి శోభుగుణాసుపున్నాడు, అను ఏవగింపుతో తనమీద చాల అనురక్తుడే అయినను ఒక ధనికయువభుజంగుని విడిచిపెట్టె చున్న కూనుగాను వేశ్యమాత, శిక్షనిమిత్తమై—

పూవి వెలిఁగియుఁ గల్లునుకాణమందు,
బుజ్జనాటమందును సైత మగ్గి వెలుఁగుఁ

గానిత్రోవలఁ బడుదురుగాక, విడువఁ
దగరు గాదటే మగవారు, ముగుదమిన్న! ౨౭

తనయెదుట తాను వినుచుండగా తనయిల్లాలి నెక్కువగా పొగడుకొని పొంగిపోవుచున్న ఉపనాయకునితో ఒకకులట సాధిక్షేపముగా —

నీమగువ యొక్కతె పతివ్రతామతల్లి;
మేము కులటల మౌదుము; మెలపుకాఁడ!
దీనికిం గత మేమొ గుర్తించినావె?
నిన్నుఁ బోలిన యువకుఁడు సున్న సున్న! ౨౮

ఒకానొక యువకునిమీద వలపును వెల్లడించుచు ఒక వలపులాడి, సఖురాలితో —

అరగడియలోన సర్వస్వ మంటు లేక
మంటఁ గలిసిన నేమాయె? మదికిఁ బ్రియమె;
తగులఁ బడుచుండ నూరెల్ల, దయితుఁడు తన
చేతితోఁ గొనె ఘటము నాచేతినుండి. ౨౯

ఒక అత్తమామలచాటు కులటకు ఇంటిలోని పెద్దలు నలుగురు ఉన్న సమయమున దూతిక, కాముకుడు పంపిన సమాగమసందేశమును తెచ్చి అందజేసినది. దానిని సమర్థించుటకు చాల విచారపడుచు ఆ పడతి, దూతికతో నన్యాపదేశముగా —

ఆకు నలముఁ గొమ్మలు లేనియట్టి వట్టి
మొద్దుగాఁ బెద్ద యడవిలోఁ బుట్టవచ్చుఁ;
గాని, త్యాగియై, రసికుఁడై, కడు దరిద్రుఁ
డై, నృలోకమ్ములోఁ బుట్టు వందరాదు. ౩౦

ఉపపతిమీద గాఢానురాగమును వెల్లడించుచు ఒక మించుబోడి యాతని చెలికానితో —

వానిసౌభాగ్యవిభవముల్, మానవతుల
యూహ కందని నా మహాసాహసములు,
నతులగోదావరీప్రవాహమునకు, జడి
వానతో నర్ధరాత్రికి, వాసి నెఱుఁగ. 31

అబ్బ! అపారమైన ఆనాటి ఆ ప్రేమలీలలను వదలివేసి ఇపు డెట్లు నిలువ గలుగుచున్నావు? — అని కాముకు డొకడు సాకూతముగా నడుగగా చెడిపె ఒకతె సఖేదముగా —

ఎవరికి వారె యైరి రమియించిన యానడికోడెగాండ్రు; రా
వువుపొదరిండ్లలో నిపుడు మొద్దులుమాత్రమె కొన్ని నిల్చియు
న్నవి; యకటా! గతించె నలనాఁటి మిటారపుజవ్వనంపువై
భవమును మాకు;రూపడఁగి పాసెను బ్రేమము కవ్వరంబుగాఁ.

యౌవన మంతయు ఉడిగిపోయినను సుగతాదులలో ఇంకను నాసక్తి యడగని ఒకకులటనుగూర్చి పరియాచకముగా ఒకడు—

ప్రాయము జాఱిపోయి, ముదిప్రాయము పైఁబడినట్టి స్త్రీల య
న్యాయపుఁజన్నులందుఁ,దొడలందుఁబిఱుందులయందుబొందికం
బాయని గోటిగంట్లు కనుపట్టు సముద్వసితమ్ములైన యా
కాయజునింటి స్తంభముల గాతలరీతిని లోఁతులోఁతులై. 33

విరాగందఱు అక్కడికి పోయి యా సుందరాంగిని చూచివచ్చినారు గదా. ఆమె యెటు లున్నదో అసంగతి సందర్భములు చెప్పుడు. విందము — అని నాయకు డడుగగా సహచరులు —

ఎందు నెవానిచూపు వికసించుచుఁ దొల్తఁ బ్రసక్తమయ్యెనో,
యందె తిరమ్ముగా నిలిచి, యాతనిచూపు మరల్పరానిదై,
స్పందము లేనిదై, బలిసి పాదుకొనెన్; నిలు వెల్ల లెస్స యా
సుందరియందచందములు చూచినవాఁ డొకఁడేని లేఁడునూ! 34

ప్రవాసములో భరింపరాని విరహవేదన ననుభవించి యనుభవించి ఇంటికి మరలివచ్చిన పిమ్మట మధుమధురమైన ప్రియతమాసమాగమసుఖ రసములో మునిగి తేలి తేలి తెప్పతిరుగా తృప్తుచున్న ఒక సుభగుడు ఆనందాతిశయములో—

అరయ, వియోగమందు విషమట్టులుగా విషమస్వభావమై,
యురవడినార్తిఁ ద్రోయు; సహయోగము సందమృతస్వరూపసుం
దర యయి, తేర్చు సౌఖ్యముల; ధాత, విష మ్మమృతమ్ము రెండునుం
బెరిమ గ్రహించి, నేరుపునఁ బ్రేయసినిన్ సృజియించినాఁడొకో!

నాయకుని చిరప్రవాసమును నాయికకోరికమీద వారించుచు, మిక్కిలి లోకానుభవము గడించిన ఒక వృద్ధదూతి—

చెలఁగి స్నేహానుబంధముచేత లెస్స
ఘటితముల యయ్యుఁ బ్రేమముల్ క్రమముగా వి
గలితముల యౌను దోసిట జలము లట్టులు,
చిర మదర్శనంబున నుపేక్షించి యున్న. ౩౮

ఇల్లు కదలి రాదే! ఇక నా మిటారి నాకెట్లు దొరకగలదు?— అని సంశయించి ప్రశ్నించుచున్న ఒక కాముకయువకునితో దూతిక, —మరేమియు ఫరవా లేదు. ఏదో ఒక ఉపాయముతో నామె నిన్ను పొందగలదు. బహుచ్ఛలత్వము మహిళలకు ఉగ్గుబాలతో నలవడినవిద్య! — అని నిరూపించి, వానిని ప్రేరేపించుచు—

తేలు కుట్టిన దంచు గగ్గోలు పెట్టి
మెలఁతమిన్నను జేతులమీఁద నడిపి,
జారవైద్యునింటికిఁ జేర్చినారు నేర్మి,
మగఁడు చూచుచునే యుండ మాయలాండ్రు. ౩౯

ప్రయోజనము నపేక్షించి అల్పులు స్నేహము చేసికొందురు. తమ అక్కఱ తీఱిపోగానే వారు తిరిగి చూడరు. — అని సూచించుచు, పూర్వము తనమీద ఎక్కువ మక్కువతో పడి, అపరిమితమైన సుఖము

నిచ్చి, ప్రకృతములో సంతగా ఆదరింపక విముఖత పాటించుచు, మఱొక జవరాలికి తన ప్రణయసర్వస్వమును అర్పించుచున్న ప్రియునితో ఒక ప్రణయిని—

మాఘమాసాన హాలికకుమారకుండు
కౌమరప్రాయపుఁ బ్రియురాలి తిమురుచనుల
బిగువు కనిపెట్టి, దుప్పటి వేగ మమ్మి,
యొక్క బలిసిన గిత్త నాయూరఁ గొనియె. ౩౮

సహజముగా అవ్యాజమైన అనురక్తితో ప్రవర్తించు వారికి కాల వయోవ్యత్యయములు సంభవించినను మానసికభావములు మాత్రము ఏ మాత్రము పరివర్తనము చెందవు. — అని సూచించుచు కొంచెము వయసు మళ్ళిన ఒకతె—

ఈ నరదేహ మింకఁ ద్యజియించి సుఖింపఁ, బవిత్రమైన తా
పీనదిరోద్ధనం దిటు తపించుచు నుంటెనిగాని, యిప్పుడుం
బూని తమిం బరుంగు లిడి పోయి, చివాలున వ్రాలుచున్న పీ
నా నయనద్విరేఫములు, నల్లవు నా పిరిపూవుటెండ్లపై. ౩౯

కులటలచేత ప్రలోభింపజేయబడి వారివలలలో పడిపోయిన తనమగని నుద్దేశించి ఒక కులాంగన, చెలికత్తెలతో—

కప్పి యిడుచున్న వా రంధకరములందు
బదరపాత్రమునట్లు నా ప్రాణపతిని;
మిగుల నీనుఁ గొన్నారు నామీఁద వారు;
తోఁక లిప్పుడు వడగట్టై దూఁకె నమ్మ! ౪౦

అల్పులు స్వల్పలాభమునకే ఉబ్బి గర్వపడుదురు.— అని వెల్లడించుచు,— నీవు కోరుకొనుచున్న ఆ వాలుగంటి స్వల్పద్రవ్యముచేతనే వశపడ గలదుతె,—మ్మని ఒక కాముకున కాంతర్యము సూచించుచు దూతిక—

ఎలమిని లేక లేక లభియింపఁగ నెఱ్ఱని కోక, పొంగుచుం
బలుమఱునుబ్బికుల్కుచొకమానెఁడుకుంచెఁడుగాఁగఁగాఁ పుకో

డలు, తనుగాత్రి యయ్యు మిన్నులకున్, సువిశాలములైన గ్రామవీ
ధుల నిముడంగ నేర, దదె తోరపుఁదీవ మెఱుంగు మేనితోన్.

తాను చేసిన తప్పు స్పష్టముగా మగనికంటబడినను వాక్చాతుర్యముతో దానిని కప్పిపుచ్చివేసి, ఆతనిని సుముఖుని గావించుకొనిన సఖురాలితో ఒక జవరాలు, సంతోషబహుమాన పురస్సరముగా—

మురిపెపుఁబొందుపోకడలఁ బోవు జవాబులు గాఁగఁ, దేనియల్
గురియుచు నొడ్లడెందములకుం జవిచిందులు వెట్టి, యేవియో
పొరసులు పైపయిం బడినపూఁటల గేఁదఁగి తేనెసోనలం
గురిసెడి మాటనేర్పు సమకూరఁగ నేర్చెనె యెల్లవారికిన్?

మగనికి చాల అనిష్టురా లయినను ఏదో కారణముచేత నాతనిమీద అలిగిన ఒక మగువతో చెలికత్తె—

ప్రభు వయినవాని స్వేచ్ఛాప్రవర్తనమ్ము,
కూర్చు ప్రియురాలికోపము, నేర్చువాని
తాల్మి, వాచాలువచనమ్ముకల్మి, మూఢ
జనునిమానమ్ము, శోభిలు జగతి మిగుల. ౪౩

నీచేతిమీదుగా ఒక ప్రణయలేఖ వ్రాసి, నీ వేదన అంతయు నాతనికి తెలియబఱుపు, — మని జాలిగా చెలికత్తె ఉపాయము చెప్పగా విని, దర్శనశ్రవణాదులచేతనే ప్రణయిమీద ప్రరూఢమైనయనురాగముతో నిండిపోయి ఉన్న ఒక ప్రణయిని—

లేమ! వడంకు వాఱి, జడి లేపిన చెమ్మట ముంచియెత్త, నె
ట్లో మునివ్రేళ్ళతోడఁ గొన, నూరక లేఖిని జాఱిపోయి, శ్రీ
రామయుఁ బూర్తిగాదు సుతరా మొకతీరున కేనిఁగాని; యిం
కేమి రచింపు మందువె చెలీ! చెలికానికిఁ బ్రేమలేఖలోన్? ౪౪

అనుకొన్నది అనుకొన్నట్లుగా నెఱవేఱకపోవుట స్వభావసిద్ధమే కాని స్వదోషము కాదు. — అని ఒక కామినికి చింతావైక్లబ్యమును త్రోసిపుచ్చుచు దూతిక—

పై అభిప్రాయమునే వివరించుచు ఒకకాముకునితో సంగడీడు—

దైవ మనుకూలముగ లేనితఱి, లెస్స
కలిసివచ్చినదియు నేలఁ గలిసిపోవు;
నిసుకతోఁ బోయు కట్టయు, నెట్టులేనిఁ
బనుపడదు కొన్న కర్జము బంధమునకు. ౨౫

ఒకజవరాలు తనమాతులానితో గోదావరీస్నానమునకు పోయి ఇంటికి తిరిగివచ్చినది. ఆ తరువాత రేవులోఁ కనిపించిన ఒకయువకునిమీద తనకు గలిగిన అభిలాషమును వెల్లడించుచు నామెతో నా తరుణి చెప్పగా—

మజ్జనం బాడునపు డేను మాతులాని!
వాలునన్ డిగి నదిలోనఁ, బచ్చివసుపు
చేఁదునీళులు ద్రావె నా చెలిమికాఁడు,
నాదుహృదయమ్మునుం బోలె ననుచు ప్రేమ. ౨౬

అలిగి బిగిసిన నాయిక ననునయించుకొనుచు నాయకుడు—

జీవితమా, యశాశ్వతము, సిద్ధమె; క్రమ్మరి రాదు, పోయెనా,
యౌవన మొక్కనాఁడయిన; నన్నిదినమ్ములు నొక్కరీతిగాఁ
బో; విఁక నెందుకో జగము పొంగునఁ బూని పదేపదే యహం
భావము నిష్ఠురత్వమును బట్టుదలన్, బిగువారిపోవుటల్! ౨౭

వెలిచవులలోఁ మునిగి తేలుచున్న ప్రియునిగూర్చి, ఒక జవరాలు సాసూయముగా—

కలిమి గడియించుకొన్నను, దులువల కిలఁ
దులువలే దానయోగ్యులై దొరకుచుండ్రు;
పచ్చగాఁ బండినను వేఁపపండ్లఁ బొడిచి
తినెడునవి కాకులేగద తీపి వెంచి! ౨౮

ఒకానొక యువతియింటిగుట్టుమట్టు తెలిసిగిన నాగరికు డొకడు, తన ఇంగితజ్ఞతను వెల్లడించుచు సహచరునితో—

కాఱుచీకటితెరలలోఁ గాంతు దరియ
నరుగఁగా వలె నేఁడె నే నని లతాంగి
తనదు చీకటిగదిలోనఁ గనులు మూసి
యిడుచు నున్నది మెలమెల్ల నడుగు లిపుడు. ౭౯

అలిగి కోపముతో లేచిపోయినాడుగదా! నే నిపు డాతని పాలికి బోయితినో నన్ను చులుకనగా చూచి, అగౌరవసంభవ మొలడేమో! — అని శంకించి, చెలికాని నభిసరింప మానిన నాయికతో చతుర యయిన చెలికత్తె — అట్లు ఎప్పుడు జరుగదు. — అని నిరూపించుచు, సుజనచర్యను స్పష్టముగా వివరించె. —

కినియఁ డేనాఁడు సుజనుఁడు; కినిసె నేనిఁ,
బూనఁడు ప్రతిక్రియాచింతఁ; బూనె నేని,
వెలికి నూరక పలుకఁడు; పలికె నేని,
సిగ్గునం బడి సగమయి చిక్కిపోవు. ౮౦

చాలు చాలు! ఆ చూపుగుఱ్ఱపుసంగతి నాయెుంసు చెప్పకు. ఆమె చక్కదనమునకు నీవే మురిసిపోవలెను. — అని సవతిని తూలనాడుచు, తన గుణగౌరవమును వెల్లడించుకొనుచు ఒకతె కాంతునితో —

ఎసఁగి స్వహస్తమునఁ గలదే సుమి విత్తము; తోడునీడమై
వ్యసనములందు నాడుకొనవై, ఖెడగాని యశంబదె స్నేహితుం
డు; సరసమైన గుణోదయమనోహర మైనది రూపు; విజ్ఞతా
భ్యసనముకల్మి నుల్లసిలునట్టిదె ధర్మ మనంగ నొప్పెసుమా. ౮౧

అబ్బ! ఇప్పు డీ మాటల కేమి? ఆ ప్రవాససమయములో రాత్రి ఎట్లు గడచిపోయినదో! — అని రాత్రివేళ సరసాలాపములలో ప్రియురా లనగా చిరవిరహాగతుడైన ప్రియుడు —

చంద్రబింబాస్య! దీర్ఘాక్షి! చంద్రబింబ
ధవళమై దీర్ఘమై రేగి, భవదయోగ
మునఁ, జతుర్యామ మైన యామినియుఁ గడచి
పోయె శతయామగా, నెట్టులో రొయికొల్లు. ౫౨

తా. ననుఁగొనినంత సొమ్ము ముట్టకపోవుటచేత సంతసింపక, ముఖము ముడుచుకొన్న దూతికతో ఖలచరిత్రప్రదర్శనవ్యాజమున నాయిక—

ద్విముఖుఁడై యకులీనుఁడై పిశునుఁడైన
యుతఁడు, ముఖమునం బోన మున్నంతవఱకు,
మధురఫణితిని మద్దెలమాడ్కిఁ బలుకు;
బోన మమరదో, విరసతఁ బూని మొఱఁగు. ౫౩

ఒక వరవర్ణినియొక్క అందచందములను, ఆమె మాపుగోపులను తటస్థులైన బాటసారులుకూడ వివశులై పోవుటయును ఉపవర్ణించి, ఒక నాయకుని లోభింపజేయుటకు దూతిక ఆతనితో—

దరవివలిత మనోజ్ఞార్ధతారకముగ
సింటికోడలినొకకంట వీక్షితుఁ డయి,
బయటిఁగదిలోన నిదురించె బాటసారి,
పల్లకా దన్న గృహావతి, మెల్లఁ జేరి. ౫౪

అంత స్వకుచమర్దనము పనికిరాదట.— అని ఒకనికి బుద్ధి గఱపుచు చతురుఁ డొకఁడు—

కొండయంతటివానినిఁ గూడ మివులఁ
బలుచనఁ జేయఁగాఁ జాలు పనులు రెండె;
పనిని నిర్వహింపకమున్నె పలికికొనుట,
పూని నిర్వహించిన వెన్కఁ బొగడుకొనుట. ౫౫

ఫలానా కోడెగానిమీద మనసు పోయికూడ నీ వింతదాక నాతో చెప్పకుండ దాచినావుకద? "అది నేనే స్వయముగా ఈనాడు కనిపెట్టి నానులే ! — అని తనగహాస్యజ్ఞతను వెల్లడించుచు ఒక నెఱజాణ ఒకానొక కామినితో —

తుంగ కుచకందు కోత్సంగ సంగనిరతి
నున్నమిత హేమ శుభకుంభ యుగనివేశి
తోర్ఘ కమలము ల్గుహరి మో మందగింప,
ద్వారమున నిల్చి చూతు వెవ్వానినే? చెలున! ౫౬

ఈ యింటిలో ఒక చక్కనిచుక్క ఉన్నది. దుగద్రుష్టవశాస్తు ఆ బంగారుబొమ్మ ఒకచవటచేతిలో పడి నవసిపోవుచున్నది. నీవు ప్రయత్నింతువో, ఆ జవరాలు నీకు సులభసాధ్య కాగలదు. — అని ఒకనాగరికునకు తెలియబఱుచుచు దూతిక, నేర్పుతో —

వృతివివర నిర్గతచ్ఛద వితత మదిగో,
యూముదవుకొమ్మ చెప్పుచున్నటులు వెలయు
చున్న, దీయింటఁ గల దింతచన్నులు గల
హాలికు నెలనాగ, యువకులారా! యటంచు. ౫౭

ధనిక యువ భుజంగు డొకడు పడుచును పంపుమని కబురు పంపగా వేశ్యమాత, వానిని మఱింత లోభపెట్టి లోబఱుచుకొనుటకు సవ్యాజముగా తనకుమార్తెయొక్క అందచందములను అభివర్ణింప సాగి, సమాధానముగా —

ప్రేయసి యింకను రాలేదేమి? — అని తొందరపడుచున్న కాముకునితో సహచరుడు, అభిసారికయొక్క ఆలస్యమునకు కారణమును సరసముగా సమర్థించుచు —

బలిసి, మెఱుంగు వాఁడి విరిబంతులువోలె, నిరంతరమ్మునై
కలిసి, మదేభకుంభములఁగట్టితనమ్మున మిట్టలైన చ
న్నులవరహాలమూట లెద నూలొక్కన, నూపిరి నేనిఁ బీల్చుకోఁ
గలుగదు లేమ; యింక నెటుగా నడవంగలదో వచింపుమా!

అపరిమితముగా ధనమిచ్చి సంతోషపెట్టుచున్న ఒక ధనిక యువభుజంగునకు కామశాస్త్రరహస్యము నుపదేశించుటకు, నాట్యాదులలో నిపుణురాలైన తనకూఁతురుమీఁద అతనిని అత్యంతము అనురక్తుని చేయుటకు, నాట్యాదులతో అలసి యున్న సమయమున ఆ కుసుమాంగిని క్రీడాదులలో తనరీతి కనిపెట్టి, సకరుణముగా మెలఁగి సుఖపెట్టుటకు, వృద్ధవేశ్యమాత స్వయముగా అతనితో—

ఎంతసేపు పెనఁగులాడినను వెలయాలికి గవంతర్గమైన తృప్తి కలుగుటలేదే!— అని తననేరమికి విచారపడుచున్న ఒక కాముకునితో వృద్ధదూతిక— అట్లు కాదు, ఒక్కమాఱు నాట్యము చేయించి అలసియున్నమీఁదట ఆ పడుచుతో రమించు. సంతృప్తితో నీయందు మునుపటికంటె ఎక్కువ మక్కువ పూనఁగలదు.— అని బోధించుచు—

అరసి నెలమాత్రబాలెంతరాలి, నాఱు
నెలలచూలాలి, నర్తించి యలపు గొన్న
వాలుగంటిని, నొకరోజు జ్వరమువడిన
కొమ్మఁ, గూడి, సుఖంపుము కోడెగాఁడ! ౫౯

మిట్టచనుకట్టు గల ఒక కులుకుమిటారిని చూచి, తన అభిలాషమును వెల్లడించుచు రసికుఁడొకఁడు —

కానివారల మన్న్యనిధానకములు,
లలితలావణ్యకలశముల్, మదనకుంభి
కుంభములు, రసికౌఘహృత్కుహారధృతము,
లీ స్తనము లెట్లు వహియింతు వే? మిటారి! ౬౦

విషక్రిమిన్యాయముగా ఒకరికి ప్రతికూలమైనది మఱొకరికి అనుకూలము కావచ్చునని నిదర్శించుచు సహృదయుఁడొకఁడు—

కూరుచు చెల్వమిన్న కులుకుంజనుబంతుల పొంగువాఁ ఱుసిం
గారపుఁ గౌఁగిలింతలసుఖమ్ముఁ మున్గి, బహిఃప్రవృత్తికిన్

దూరుఁడు, భావిపాంథునకు దుశ్శకునమ్ములు విష్టివాసరాం
గారకవాసరమ్ములును గ్రమ్మని వయ్యె, సుఖంకరమ్ములై. ౬౧

త్వరగా నాయికాభిగమనమునకు ఉత్కంఠ పొడమించుచు, నాయకునితో దూతిక, నాయికానురాగాతిశయమును వర్ణింప నుపక్రమించి—

పాప, మాపిల్ల నీకునై రేపుమాపుఁ
గ్రందుకొని గృహద్వారతోరణమునందుఁ
బొందుపడియు వందనమాలచందమునను
వాడిపోవుచున్నది యెల్లపవలుఁ గుఱ్ఱ! ౬౨

కపటానురాగముతో పై పై మెఱుగులు చూపుచున్న నిన్ను నమ్మి చాల మోసపోయినాను. — అని నాయకుని నిందించుచు ఒక పూవుబోడి అన్యాపదేశముగా —

ఊరిబయట వటప్రాంతమున దత్తసంకేతస్థాయి ఒక నాతి— కాదు కాదు. ఆ మఱ్ఱిచెట్టుక్రింద చాలమంది బాటసార్లు చేరుచున్నట్లు తెలియుచున్నది. పైపెచ్చు ఋతుధర్మముచేత ఆకులు కూడ రాలిపోయి, చెట్టు వట్టిమోడై పోయినది. మనగుట్టుమట్టు బట్టబయలు కాక తప్పదు. కాబట్టి, మఱొక సంకేతము నేర్పఱచుకొనుట మంచిది. — అని కాముకునకు సూచించుచు, తనచెలికత్తెతో —

పచ్చనియాకుజొంపములు, పండిన యెఱ్ఱని పండ్లగుత్తులై,
ముచ్చట సూపినట్టి శుకముల్ వెఱ నార్చుచు లేచిపోవఁగా,
నచ్చెరియమ్ముతోడ నగి రల్లన శుష్కవటమ్ముఁ జేరఁగా
వచ్చిన పాంథు లందఱును బల్మఱుఁ గొట్టుచుఁ బెద్దచప్పటల్

అన్యాసంగదూషితుడైన ప్రియుని అనునయములో బడక, సుదృఢాగ్రహపరిగ్రహములో పడిపోవుచున్న నాయికను చెలికత్తె ఎట్లో ఒడంబఱిచి, వయస్యునితో అనుసంధానము చేసి, రహస్యముగా తలుపుసందులో నుండి వారివిశేషము కొంతవఱకు కనిపెట్టి వచ్చినది. మఱునాడు ప్రొద్దుననే, రాత్రి వారిసంగతి ఏమైనది? ఎట్లు జరిగినది ?— అనిమాతులాని ప్రశ్నింపగా ఆ సఖురాలు నవ్వుచు ఆమెతో —

ఆ గోపసంతతప్రియసహోద్యోగిత్వనైఖరి నేమి సెప్పవుదుఁగా?
లోఁగడిలోన నా లిపిలేఖలవలనే యుతఁ డింతికాళ్ళపై
వేగమె వ్రాలె; నా పలుఁది సెంటనె వెల్గుచునున్న దీపముం
బాగుగఁ బెద్దఁజేసె; నవు వచ్చెను నాకది చూచినంతనే. ౮౨

తన సౌందర్యము గల పూర్వప్రియురాలిని అనువర్తించి మెలగ నారంభించుట చేత — నే నామెకంటె గుణహీనను కాబోలు! నే నాతనికి నచ్చలేదు కాబోలు! — అని తన సౌభాగ్యమును లెస్సగా భావింపక, కించపడుచున్న క్రొత్త ప్రియురాలిని తగు సమాధానములతో ఓదార్చుచు సఖురాలు, సుజనస్వభావవర్ణనమును ప్రాసంగికముగా తీసికొని—

ఎనసి ముఖప్రసాదమున నింపుగ మాఱ్పను దోఁపనీక, స
జ్జనుఁ డొకనాఁడు ద్వేష్యజనసఖ్యముఁ జేసి మెలంగుఁగాక, య
య్యనఘుఁడు చాలఁ జిత్తమునఁ డయ్యును లెస్స, నిజాభిజాత్యకీ
ర్త్యనుపమగౌరవమ్మునను నవ్వాహముఁ బశుఁడై ప్రవర్తిలున్

అనుకూలవతి, సౌందర్యవతి అయిన తనప్రేయసి ఉండగా ఒక యువకుడు, బహువిలాసశక్తుడై ప్రవర్తింప సాగినాడు. అతని చరిత్ర సమగ్రముగా తెలిసికూడ బుద్ధిమంతురాలైన వానియింతి సత్కులప్రసూత యగుట చేత నిండుమనస్సుతో మెలగుచు, అమితవ్యథ వచ్చినప్పుడుకూడ కోపతాప ఈర్ష్యాదులకు తావీక గానీక, ప్రియునిపై నత్యంత ఆదరము చూపుచు నడవ సాగినది. ఆ గుణముచేత అతడు ఆనాతిమనస్సును గుర్తింపనేరక — నా విషయమింతవరకు ఈ మెకు తెలియలేదు లే. ఫరవాలేదు లె! — మ్మని పొరపడి, తల యెత్తుకొని మామూలుగానే నడవ సాగినాడు. అతని ఆ దుర్విదగ్ధతను గమనించి, బుద్ధిగలవు వృద్ధసఖి ఒకతె—

దినదిన మాదరమ్ము, ననధీరణ లేని ప్రియమ్ముఁ, బెంపుగా
మునుకొని, విజ్ఞతాదిగుణభూషణభూషితుఁడై, మహాకుల
మ్మున జనిఁ గన్నయాతఁ, డొకపోలికి నాత్మ విరక్తిఁ బూని యు
న్నను, గమనింపఁగాఁ బడఁ డెనాఁడు నపారగభీరవైఖరిన్. ౮౪

లోకములో చాల పెద్దగా పేరు మ్రోగుచున్న గొప్పవానిమీద అనురాగము చేయవలసిన దని ఒత్తిడి పెట్టుచున్న సఖితో నాయిక—

మేదురవిజ్ఞతాగుణసమృద్ధుని ద్వేష్యుని నైనఁ గోరి తాఁ
గా దనిపించుకొన్నఁ, నది గౌరవమే యగు; నుండఁబోదు సగా
చేఁదులు మ్రింగుపొట్ట కొక చెట్టకు లోఁబడునో యటన్న దు
ర్వాదము నేనియుం బడయుపాపముకంటెను సిగ్గుచేటిలన్ ౬౭

గట్టిగా బిగువైన చనుకట్టు గల ఒక కులకుమారి, అచిరకాలము లోనే సడలి జారిపోయి కనిపింపగా చూచి, రసికుఁ డొకఁడు సహపాఠునితో—

చాలి, స్వభావగౌరవవశంవదమై బలువారి, నిస్తుల
శ్రీలసమాన మా చెలువచిక్కనిజక్కనచన్నుక, ట్టటుల్
మూలమునందు జారి పడిపోయిన దేటికొ! నిల్వఁబోదు గాఁ
బోలును, కామినీహృదయభూములలోఁ జిరకాల మేదియున్!

ముఖబింబముమీద ప్రసరించుచున్న బాలభానునికిరణముల నాపు జలతారు పైటచెఱగు అడ్డముచేసికొని వారించుకొనుచున్న ప్రియురాలిని చూచి ప్రియుఁడు, చాటూక్తులతో —

తరుణి ! నీముఖమ్మును దాఁకి తడవి చూచు
పద్మహితు నడ్డగింపకు పైఁటచేత;
తరుణుఁ డాతఁ డిద్దానికిఁ దమ్మివిరికిఁ
గల సుఖస్పర్శ మెట్టిదో తెలియఁగలఁడు. ౭౦

అపుడు తా నున్నది ఎంతటి కోపదశ యయినను అగుగాక, మధుపానోత్సవప్రసక్త యవుచేని ఎట్టి ప్రమద యయినను చాల సులభముగా నభిముఖురాలై చాల మృదువుగా, చాల సరసముగా ప్రవర్తించును. తప్పదు. నీవుకూడ నీప్రియురాలికోపమును పోగొట్టవలె ననిన, వెంటనే రతిఫలాది మధుమదిరాపానమును ఉపక్రమించు. ఆమెచేత ఇంత త్రాగించు. వెంటనే ఆమె నీకు వశపడును. ఆఁ! అది సంభవమా ? అని యందువో ? అదిగో, అటు చూడు. ఆమానిని, కోప మాఱి, ప్రియునిగండూషమధువును

ఎట్లు ఎంత హాయిగా ప్రాఁగి, ఆనాటి ఎంత ఉల్లాసమును గలిగించుచున్నదో! — అని సనిదర్శనముగా మానసికోల్లాస మాహాత్మ్యమును చతురతతో బోధించుచు, నాగరకుఁడొకఁడు మిత్రునితో—

ఆసఖుఁ జూచి నేఁ బ్రియుఁడు హా స్వపుటమ్మున గడ్డమంటి, యు
ల్లాసముతోడఁ ద్రిప్పి, మిన్నులకు సుదూఖమ్ముగ నున్నమించి సా
మూసినకన్నులకు ముఖముఁ, బుక్కిటఁబట్టి యుతం బొసంగు ద్రా
క్షాసవ మానుచున్న, పెదవల్కినడంబు మహౌషధమ్ముగాక్.

నాయకునినియుపాలంభమును ఇట్టిపటి చేయుచున్న దూతిక, నాయికా సౌందర్యాతిశయమును కన్నుగసాయనముగా వర్ణింప మొదలిడి—

అందము చిందుచుండు నవయౌవన రేఖ నటించుచున్న యా
సుందరగాత్రినిన్ సరగఁ జూచుటలేదేల? తదంగపాళి నెం
దుం దొలిగాఁదవుల్పడిన కనుంగవ నిల్చునో యుండదె చిక్కి, యో
పిం దిగఁబట్టి యుర్వులగ బింబలె, లేవని దయ్యె పెండియుక్. ౨౧

ఒక అల్పునితో తాఁ ప్రసయత్నించి, బలాత్కారపడుచు దూతికతో నాయిక—

తునుకుకొనిపోవు, నలఁతిపైఁ దొడుగు స్నేహ
భావ మప్పుడప్పుడె, నీట ప్రాలువోలె;
శాశ్వతమ్ముగ నిల్చు, సజ్జనునిపయినిఁ
జలువు స్నేహభావము, శిలాక్షరము వోలె. ౨౨

చిరప్రవాసమునుండి మరలివచ్చి, తిరిగి వెనువెంటనే ప్రవాసమున కుద్యుక్తుఁడవుచున్న కాంతుని గనుగొని కాంత, సదైన్యోపాలంభముగా—

అకట! క్రమ్మర దూరప్రయాణమునకుఁ
గడఁగుచుంటివా? దుష్కరకారకుండ!
యుల్లుకొనిపోయి యులలైన యులక లివిగో,
సరలములు గావు నేఁటికి నైన మింత. ౨౩

సురతప్రకరణములో అంతగా వ్యుత్పన్నుడు కానేరనట్టి చేత, లోపల అంతు లేని ఉబలాట మున్నను చేతగాక, తనబుద్ధి హాస్యాస్పద మగునే మో అను భయమున పూనుకొనక మానుకొనుచున్న ఒక ధనికయువకుని వైలక్ష్యమును పోగొట్టి, ఆపనికి పూనుకొనుటలో సత్వరంతి పాటవము కలిగించి, ప్రోత్సాహపఱుచు తలంపున ఒక నెఱజాణ, సద్యఃప్రసన్నహాసయుతు లైనవారల రతములను ప్రశంసింప బూనుకొని —

ఏ యువకాళిమోదొరకి, యెంతయు నెయ్యముతియ్య మొప్పఁగా,
నేయెడనో, యెటో తమి రమించెడు జంటల క్రీడలెల్లను, లా
ప్యాయముగా హరింపవు హృదంతరముం, బునరుక్తగాఁగ లీ
లాయతమై రసజ్ఞుల కలాభినివిష్టము-లౌ రతమ్ములున్. ౭౮

మఱొకస్త్రీ తనవరాలిమీది తేవులాటముతో తిరుగుచున్న చెలికానితో తత్ప్రణయవంచిత యయిన పూర్వనాయిక ఒకతె—

ఇంత కృశించిపోయితి వి దేమిటి, కంచు, నెఱుంగనట్లు ప్ర
శ్నింతువు, కాంతుడా! సతత మేను వహించుచు నుంటిఁగాదె, యా
యింతులమిన్న తోడ నిను! నెట్టి మహోత్సుకము నేను, మోపతే
నంతటిబర్వు పైఁబడినయప్పుడు ముచ్చెమటం డింగిపోన దే? ౭౯

ఓహో! మీవారు చాలకాలమునకు వచ్చినారు గాబోలు! గాఁక్రి ఏమేమి జరిగినది ?— అని సప్రేమహాసముగా కలసి మెలసిన సఖులారాయి అడుగఁగా ఒకగమణి, సానురాగస్మిత లీలా విలాస వైఖరీ విశేషముతో —

లలితాలాపకలాప! గాఢదృఢమూలగ్రంథికమ్ముల్ వలెన్
వలనౌ నా మృదుబాహుబంధముల నానాఁ డెట్టులో విస్సి; న
య్యలవుం జూచి, మహానిఖాతములచాడ్పున్ నేను నవ్వానిని
స్తులవక్షఃస్థలమందునుండి చనుబంతుల్ చేసి తత్ఖాతముల్. ౮౦

అమాయికముగా కలహపడి బాధ పడుచున్న ముగ్ధనాయికను ఓదార్చుటకు వచ్చిన సఖి, తత్కాంతునితో —

ఎఱుఁగను ముగ్ధ నాయికల, యింపుగ నుంచితిఁ జెడ్డ, మెల్లగాఁ
గఱపిన నీరాఁగ, శాంతనుముఖత్వముచేఁ జూపితిఁ, నీదొసంగులన్
మఱిమఱి లేక నెత్తి, మిగి మాటలచే, సిరు గేల వ్రేళ్ళ, నా
తెఱఁగున నాయికం గలఁగి, దీనముగా విలపింప సాగెరా! ౭౭

చెమటతో దడిసిన మేనితో ప్రియునివద్దనుండి వచ్చిన ఒక కలికిని లాడిని చూచి సఖురాలు, తోడిసఖురాండ్రతో పరియాచకముగా—

తనుతరఙ్గస్నాన యాతన్వితనువునందు
సిముడలేక లావణ్యము చెమటపేర
వెలికి వచ్చుచున్నది జాలు లోలసి యదిగో,
నలుల పేరిటి సోపానపంక్తిఁ గడచి. ౭౮

వద్దా? నసకమా ? ఏమి ప్రయోజనము ఆతనితో చెలిమి చేసి ? — అని విసుగుచెలులతో నసనసలాడుచు, ఒకపల్లవునిగూర్చిన రోషమును ఆరోపించి, స్నేహముయొక్క గుణము సెలవిచ్చెను. ఆ మాట ఆ కించ నదలిపోవునట్లు సమాధానమును సంయుక్తిగముగా చెప్పును వేశ్యమాత అన్యాపదేశముగా—

ఇల సశోకపల్లవముల కితరపల్ల
వమ్ముల కేవిధము సరిసమానమ్ముగా, వ
టంబు మాత్రము గట్టిగా ననఁగఁ గలము;
ఫలము మాత్రము దైవేచ్ఛపైని నుండు. ౭౯

కలహాంతరిత యైన తన ప్రియకాంత ననునయించుకొనుటకు వచ్చిన కాముకుడు, కన్నీరు నించుచున్న ఆమెను చూపి, తన సౌభాగ్యాతిశయమును శ్లాఘించుచు సఖునితో—

వలుచని చెక్కుటద్దముల వ్రాలిన పున్నమచందమామలోఁ
గల యల కృష్ణసారమును దొంగిలన సేయుచు నున్నయట్లుగాఁ
బొలిచె, సిరంతరాశ్రుజలపూర సుపూరిత చారులోచనా
మల కలశద్వయమ్ముఁ గొని, మానవతీకులరత్న మల్లదే! ౮౦

లతో పనిలేదని, శాశ్వతముగా మనోహరముగా నిలబడవలె ననిన ఇట్టి ప్రేమయే నిలబడవలె నని, తక్కినవి నిజముగా ప్రేమలే కావని, అసలు అవ్యాజమైన ప్రేమ లభించుటయే దుర్లభమని, అకస్మాత్తుగా పొసగుట మఱియు అసంభవమని నిదర్శించుచు, అన్యాపదేశముగా—

అవ్యాజానురాగవతి యయిన నాయికమీద దృఢానురాగము నను శిక్షించుచు, మందానురాగుడైన నాయకునితో దూతిక, అన్యాపదేశవిధానమున —

ఒకచోఁ జల్లని మంచినీరు, నొకచో నొప్పారు లేలేఁతప
చ్చిక, నార్జించి స్వయమ్ముగా, జతలుగా జీవించుచుం, గాన కా
నకు సంచారము సేయుఁగాక, తమజన్మం బుండుసంబాఁకఁ బా
యక ప్రేమమ్ములు నిల్పు, జింకలకు నాయా లేళ్ళకుఁ గాఢమై.

నడివేసవికాలమే యయినను మనసు కలిసిన కాముకులకు పరిరంభణాదులవలె తదితరవ్యాపారము లెంతమాత్రము సుఖకరములు కాజాలవు.— అని నిరూపించుచు సహృదయు డొకడు సుహృద్వరునితో —

వేఁడిమి సైపరాని నడివేసవిరోహిణిమంటమధ్యలోఁ
గూడ, నిరూఢమైన యుపగూఢములట్లు, నికామకామసం
తాడితు లైన జంటలకుఁ దాపముఁ బాపఁగ లేవు, తమ్మిపూఁ
దూఁడులుఁ, గల్వ రేకులును, దోరపు గందపుఁబూఁతచల్లులున్.

కులాంగనలు సహజముగా వ్రీడావతులైనను వారి భావసూచనాచాతుర్యము మధురమధురముగా అతిమనోహరముగా ఉండి, ప్రియతముల ఉల్లాసమునకు, సుఖమునకు పరభూమిగా పనుపడును.— అని నిదర్శించుచు నాగరికు డొకడు సహచరునితో —

పున్నమచందమామ నగుమోమున నర్ఘ్యఘృతామృతమ్ము సం
పన్నము గాఁగ, నిట్లొదిగి పొసెద వేటికి? కనం బ్రియుండు, ము
క్కొన్న త్రపం బిఱుందులను గొంగున గట్టిగఁ గప్పిచూచుకోం
పన్నులమిన్న కమ్మని స్మితాంకురముల్ మొలిపించె మోవిపై.

కులాంగనల పాతివ్రత్యము చూడఁ గాఢము సుమా! — అని బోధించుచు పురంధ్రి యొకతె యొక కులవధువుతో —

ఎద గుఱుతించియుండుఁ దమయింటిపసం,బొలుచూలుగా స్వదో
హదమునుదంతమును దెలుప దాప్పులకే నొకనాఁడు, సద్గుణా
స్పద, శుభశీల, దుర్గతునిభార్య, కడుం జెడువార్తనట్లుగాఁ;
దదుదరభూమిలో నదియు దాఁగి తలిర్చె నిధానమట్లుగాన్. ౯౦

సంతానము కలిగినతరువాతకూడ ప్రియురాలిసొగసు ఇంకను ఎక్కువ అవునేకాని తగ్గిపోదు.— అని నిరూపింప దలచి, సహృదయుఁ డొకఁడు సహచరునితో —

బరువున జాఱిపోయి విడఁబాఱి సుదీర్ఘములైన కేశముల్
కరయుగలమ్మునం గొని, చెకాపిక ప్రేల్మిడి వైచి, వీధిలోఁ
బరుగిడి పోవుచున్నయది, పట్టె తలన్ చము రంటనీక, తాఁ
బరుగులు వాఱుచున్న తన బాలకు వెంబడి, గేస్తురా, లదే! ౯౧

విటకోటిని ప్రలోభింపజేయుటకు దూతిక, ఒకజవరాలి వయస్సంధిని సౌభాగ్యాతిశయమును ప్రశంసింప సాగి —

చెలువవు క్రొత్తజవ్వనపుచిన్నెపసందులు చిందువాండు కో
మలకుసుమాంగకమ్ములసుమాళముతోఁ జెలి యెక్కివచ్చిన
క్కొలఁదిని జాల సన్నపడి క్రుంగఁ దొడంగెను,మధ్యదేశముం,
బలుమఱు సైపలేని ప్రతిపక్షకులమ్మును, వల్లభుండునున్. ౯౨

కులాంగనలకు మగనిమీద అకారణమైన ప్రేమ పనుపడి యుండును. అది వారికి ఉగ్గుపాలతో పెట్టినది. మహిళామండలిలో బహుమానము పొందవలె ననిన, వల్లభునిమీద అట్టి అవ్యాజప్రేమ ఉండవలె.— అని బోధించి ఒకవృద్ధ, వృద్ధుడైన కారణముచేత మగనిని ద్వేషించి, చంచలస్వభావముతో సంచరించుచున్న ఒక మించుబోడిని అనుశిక్షించుటకు—

పాణిఁ గైకొన్నపతి జరావరిణతుండు,
దుర్గతుండు, విరూపుఁడు నయి తోఁచుకొలఁదిఁ,

గొలఁదికిన్ మీాఱు ననురక్తి వెలయు, మిపుల
వల్లభతరుం డగును గులపాలికలకు. ౯౩

బజారున పోవుచు ఉన్న ఒక వన్నెకానిని చూపి, ఒక వన్నెలాడి తనమాతులానితో —

ఆ నడికోఁడెజవ్వనపుటచ్చునఁ బోసిన పూరుషాకృతిన్
వానినిఁ జూచినావె, మన పల్లియలోని మిటారు లెల్లరున్
వీనినిఁ బొంది తా రనుభవింతురు వంతులుగాఁగ గ్రీష్మకా
లాన వసైకకూపసలిలమ్మునునట్లుగ గ్రామసీమలోన్. ౯౪

పరాంగనాసంగదుర్లలితుడై తనపతి యేర్పఱుచుకొనిన సంకేతస్థలమునకు భంగము వచ్చిన దని విని, చాల సంతోషముతో పొంగిపోవుచు ఒక కులాంగన, తన మేనత్తతో —

పాండురపాండురమ్ము లయి వాడినమోములతోడి పుంశ్చలీ
మండలిజాఱుగుండియల మానని వేదనతోడ నల్లదే,
వండి ప్రచండవాతహతిఁ బట్టులు దప్పి, భ్రమించు చూ·డ, కా
పాండురమైన గ్రామవటపత్రము రాలుచు నున్న దుర్విపై.

తన యింగితజ్ఞతను ప్రకటించుచు నాగరికు డొకడు సహచరునితో —

చూచుచున్న దలత్యపుఁజూపు, చన్ను
లొడుగ బిట్టు నిట్టూర్పుచున్నది, యకార
ణముగ నవ్వుచున్న, దస్ఫుటార్థముగఁ బలుకు
చున్న, దీ చానమది నెదో యున్న దడఁగి. ౯౫

మంచి సమయస్ఫూర్తి గలిగి, మంచి తెలివితేటలతో మెలగగల కులటలకు, ఎంత దిట్టమైన చేయి యయినను తమ కట్టుకొన్న మగనికిగూడ నాయాసమయములలో కన్నులకు గంతలుగట్టి, వలలో వేసికొనుట ఒక లెక్క లోనిది కాదు. అందు ఏమాత్రము వారు వెనుదీయరుకూడ. — అని తెలుపుచు నాగరికు డొకడు నేస్తకానితో —

చిక్కె మనశరణమ్మునఁ జేరినాఁడు,
గృహపతీ! కూర్మి నితని రక్షింపుమయ్య!
యనుచు, సమయాన నేతెరిసట్టి పతికె,
జారు నప్పగించెను నెఱజాణ చాన. ౯౭

ఎంత దాచిపెట్టుకొన్నను ప్రణయ మనునది కుశలులైనవారి యొఱుకకు అందరానిది కాబోదు.— అని సఖురాలికి సనిదర్శనముగా బోధించుచు ఒకతె —

హృదయగుహాంతరస్థితున కీ సుకుమారిఁ గుమారి నిండు; మీా
రెద గమనింపరో కడుఁ గృశించుచు నుండిన బాలచో? ప్పనన్,
హృదయమునందుమాకునొకఁడేర్పడియుండు నె?పొండటంచు, నె
మ్మదిఁగనుమూసి,యుత్తలసమక్షమునందుఁగుమారిమూర్ఛిలెన్

సురతావసానములో ముఖ్యముగా ఆచరింపవలసిన ఉపచారములు చాల ఉన్నవి. అవి సక్రమముగా ఆచరింపబడినప్పుడే అతీతరతిక్రియ ఆహ్లాదముగా ఉండును. అవి ఫలానా, ఫలానా విధముగా వాని నాచరింపవలె,— నని నేర్పుచు సఖురాలు, నిదర్శనముకోసము ఒకానొక కలికిమిన్న కథను ముచ్చటింప మొదలిడి నాయికతో —

పూని రమించి, నెమ్మెయిని ముచ్చెమటల్ విగజాఱ, గ్రీష్మకా
లానఁ బరాహ్ణవేళ బడలంబడి తూలిన చెల్వఁజొమ్మపై,
స్నానసుగంధిలమ్ము సరసమ్ము గలత్ప్రసవమ్ము రమ్య మా
వేసలి చల్లఁజల్లనగఁ బీనపయోధర పూన్చె నల్లనన్. ౯౯

శరత్కాలపువెన్నెలలో కేలీవిలాసము లనుభవించుచు రసికు డొకడు ప్రియురాలికపోలకాంతిని గనువిందులుగా జూచి —

చాల వెలుంగ నేర్చె సరసమ్ముజమండల మొప్పు నీ కలా
లోలుపచెక్కుటద్దములలోఁ బ్రతిబింబితుఁడై సుధాంశుఁ డు

తూ్కలరసాప్తి,లోననొకకొంచెము కుంకుమచాఁదుతో రుచు
ల్దొలెడు శంఖభాజనముతో సరిపోలిన పోల్కి కుల్కుఁగాక.

రసిక మనో మిళింద నికరమ్ముల ర మ్మని యాగళమ్ముగా
రసములు జాలువాఱు మధురమ్మగు విందులు వెట్టి, పేర్మి హె
చ్చు, సుకవివత్సలప్రముఖ సత్కవి నిర్మిత గాథలం దమో
ఘసమయ మీ తృతీయశతకమ్ము సమాప్తిని బొందెఁ బొందికన్.

పాలితసత్కవిత్వ కవివత్సల పాలిత పాలితాది సం
లాలితమైన గాథలకలారసవాటికలో రసాలముల్
జాలునఁ దేనియల్ గురియఁ జాలిన మూఁడవు కోటి యిద్ది, యీ
లీలఁ గొనెన్ నృసింహకవిలేఖినిలోఁ బరిపూర్ణవైఖరిన్. ౧౦౨

సరసతరము గాథాసప్తశతకమందు
మూఁడవు శతక మతిమనఃప్రీతిఁ దనరె;
నెద్ది చెవిదారిఁ బడినంత, నెడఁదలోనఁ
జొర దమృతమేని మధురతా గరిమఁ జేసి. ౧౦౩

# నాలుగవ శతకము

నాగరికుఁ డొకఁడు సహచరునితో ఒకకులటయొక్క వంచనానైపుణిని గుఱించి—

మాపుట్టింటినుండి యీ మహితుఁ డరుగు<br>
దేరె నిప్పుడే, యను చొక తీవఁబోఁడి,<br>
తొట్రుతుపడక వచ్చిన పతికౌఁగిట లగింపఁ<br>
జేసె జారపూగుమును, రసశ్రీ యెసంగ. ౧

ఒక స్వాధీనపతికనుగూర్చి సఖి, సఖురాండ్రతో—

నెలఁత మొగమునఁ గుండలనీలమణుల<br>
కిరణములచేత నాహతతరములైన<br>
చంద్రకిరణమ్ములఁ బ్రియుండు సరగఁ దుడిచి<br>
వైచెఁ గొంటుకకన్నీటిభ్రమము దోఁచి. ౨

ఒకానొక నాయికయొక్క సౌందర్యాతిశయమును వర్ణించి చెప్పి, నాయకుని మిక్కిలి ప్రోత్సాహపఱుచుచు, దూతిక—

అమృతకలాప్రపంచరచనాద్భుతశిల్పికి మెచ్చు దెచ్చు సీ<br>
మము లగు సుందరీముఖమండలముల్ వెయివేలు దాల్చి భ<br>
వ్యము లగు నీవిశాలజగమందు బరింగొనె శ్యామవామభా<br>
గముసొగసుల్ నెలంతుకనిగారపు దక్షిణభాగ మొక్కటే. 3

ఎన్ని తప్పులు చేసివచ్చినను ఆతని నేమియు ననక, ఎందుల కట్లు పూసి పెట్టుకొందువు? ఒక్కమాఱు కోపము తెచ్చుకొని, కొంచెము మందలింప రాదా? అని అనుచున్న చెలికత్తెకు గాఢానురాగవిధుర అయిన ఒకనాయిక—

ప్రియుఁడు వాదించుకొలఁది, నే వేల మించు<br>
చంచలప్రణయమున నర్తించుచుందు;

సహజముగ స్తబ్ధ మగుఁగాక, మహీరుహమ్ము
నందు వలయింపదా మేని నలరుఁదీవ? ౪

ఎన్నో అవస్థలం పడి, ఎట్లో ఒకట్లు సంపాదించుకొనబడిన దయితుడు తనతో అనుకూలముగా మనసిచ్చి ప్రవర్తించుటలేదని సనిర్వేదముగా తెలియబఱుచుచు ఒకతె సఖురాలితో—

ఎంతో పాటునఁగాని దుర్లభుఁడు చిత్తేశుండు; లాభించుఁబో,
యెంతో కష్టముమీఁదఁగాని వశుఁడై యేపారఁ; డట్లౌనుబో,
పొంతం బొందిక నొక్కటై కలిసిపోవో డెందముల్ రెండు, నా
సంతన్ వాఁడుపొసంగియుం బొసఁగుమచ్చల్ లేనివాఁడేసుమా!

ప్రియుని గూర్చి గాఢోత్కంఠిత అయిన ఒక కలహాంతరితా కలకంఠి తనసఖురాలితో—

ఆ సరసుండు వేఁడుకొనునప్పటి సౌఖ్యము నాసఁజేసి, యే
దోసము లేని వాని కొక దోసెఁడు దోసము లంటఁగట్టి, యి
ట్లా సరలస్వభావమధురాత్మునిఁ గాంతునిఁ జేతిమీఁదుగా
నోసకి! త్రిప్పుకొంటిఁగదె! యుల్కున నే నవినీతరీతికిన్? ౫

ముద్దరా లయిన ఒక ప్రోషితపతిక యొక్క చెలికత్తె, ఆమె విరహావేదనాభరమును, మౌగ్ధ్యమును ప్రకటించుచు ఆమెపతికి ఒకబాటసారిద్వారా కబురు పంపినది.—

కాళ్ళవ్రేళ్ళతోఁ జేతులవ్రేళ్ళతోడఁ
గడఁగి లెక్కింప లెక్కింపఁ గడచి చన్న
విన్నినాళ్ళును; వేనితో నింక లెక్క
పెట్టఁ గల? నని ముద్దరాల్ బిట్టు వనరె? ౬

వల్లభుని ప్రయాణసన్నాహమును ఆపివేయవలయు నను నూహతో ఒక ప్రియవల్లభ, మదనోన్మాదక మయిన వసంతఋతువును, దానితోపాటు ప్రయాణనిరోధకములైన అపశకునములను వాచా తలపించుచు —

పొలుపు వహించె రాచిలుకముక్కులపోల్కిని గన్నవిందులై
యలరుపలాశపుష్పనిచయమ్ములతో వసుధాతలం, బొగిం
దలకొని బుద్ధదేవునిపదంబుల నానమితో త్తమాంగులై
విలసితభక్తిం బొంగిలిన భిక్షుగణంబులతో డుతంబలెన్. రా

మానవతి యయిన ప్రియురాలిని అనునయించుతలపున ప్రియుడు సదాక్షిణ్యముగా —

బడలు మెయిం గృశోదరి! భవత్ప్రథులావయవమ్ము సైతముం
గడుం గృశియించిపోయె; లతికాలలితాంగిరో! యంతం బోక, పే
ర్పడి సహజమ్ముగాం గృశతర మ్మగు నంగముగూడ, వాడునం
దొడం గెడనుత్వముం గొనం గం;దొయ్యాలి!యింకనుగోపమేటికే?

ఆ ప్రాయాలు సుగుణాలప్రోవుగదా! ఆమెను కాదని త్రోసివేసి ఈతడు ఎందుచేత అన్యాసక్తు డయినాడు?— అని సఖురా లడుగంగా నాయికి యొక్క చేటిక సఖురాలు —

వెస గుణగౌరవమ్ముం గనిపెట్టి వశంపడంబోం డెవండుం; గై
వస మయిపోవు, నెమ్మదిని భావన సేయుచు నున్నవారికిం;
బొసంగి పులిందసుందరులు ముత్తెపుపూసలం ద్రోసివేసి, క్రొ
త్త సరులుగా ధరింతురుగదా యలుతగ్గు గురివెందగింజలన్?౧౦

పోయి వచ్చెదను, అని చెప్పిన —ఏ మది, కట్టు చూచెదవు? నా కేమియు అనుమతి, సమాధానము ఈయవేమి? — అని ప్రియతము డడుగగా మిన్నకున్న ప్రియురాలికి సంబంధించిన ఒక వృద్ధురా లాతనికి సమాధానముగా—

♦ఓ సుపుత్త్రక! లంకానివాసములు, వ
సంత మాసైక లబ్ధప్రసార బహుల

♦ఈ పద్యములో అనుగణనవ్యంగ్యముద్వారా— లంకానివాసములు, అపీతలోహితములు, పలాశశతములు ఇత్యాది పదములద్వారా నెత్తురు,

ములు, సమాపీతలోహితములు, పలాశ
శతముల కడలుచున్నది జనము మదిని. ౧౧

ఒకానొకనాయికకు దయితునిమీద గల అనురాగాతిశయమును గూర్చి సఖి తనసఖురాలితో —

చెలువునిపైనిఁ జల్లవలెఁ జెంగున నంచు, గులాము గుప్పిటం
జెలువలమిన్న యొక్కరిత చేకొనె; నంతఁ బ్రహర్షవర్షసం
వలిత మహోత్సుకత్వ రసవాహిని వెల్లువ గా, వడంకు నా
యలరులబోఁడిచేతలిరుటాకుల నిండె గులాబియత్తరుల్. ౧౨

మఱదితో రహస్యముగా మసలిన సవతితో సవతి —

అంటుకొన్నవి యింటింత లింటివెనుక,
సరగ నీవీఁపు దులుపుకో సరలశీల !
జాణ లా దేవరునికొన్నచాన లిట్టె
యావులించిన లెక్కింత్రు ప్రేవులెల్ల. ౧౩

మగడు చెడుత్రోవన పోవుచున్నట్లు బాగుగా స్పష్టపడినప్పుడు మగువ ఆతనిని ఊరకే పులుముకొని నడవగూడదు. ఏకొంచెమైన కోపము వహించి, ఆత్మగౌరవము కాపాడుకొనవలెను. లేదో, ఆతడు చెవులకు తడకలు కట్టి

---

మాంసము, త్రాగి, తిని, బలిసి, భయంకరులై లంకలో నివసించు రాక్షసుల వలన లోకము భయపడినట్లుగా, వసంతమాసములో పూచి చెలరేగిన ఈ పలాశపుష్పమాలవలన లోకము తల్లడిల్లి పోవుచున్నది.— అని ఉపమాలంకారము ధ్వనించుచున్నది.

తదుపపాదకముగా—

“లంకాలఆణం పుత్తఅ వసన్తమాసేక్క లద్ధ పసరాణమ్,
ఆపీఅ లోహిఆణం వీహేఇ జణో పలాసాణమ్.”

అని మూలమున శ్రూయమాణమైన— వసన్తమాసేక్క లద్ధపసరాణమ్— అనుదానికి — వసన్తమాసైక లబ్ధప్రసరాణామ్ — అని, - వసన్తమాసైక లబ్ధవిభవానామ్— అని అర్థములు లభించుచున్నవి అది గ్రహింపవలెను.

ఆడింపఁగలఁడు.— అని మానోపదేశము చేయుచున్న సఖురాలితో దయితునిపై నత్యంతము అనురక్త యయిన ఒక నాయిక —

కనఁబడినంతనే ప్రియుఁడు, కన్నులు రెండును రెండుచేతులం
గనుకని మూసిపెట్టుకొన గట్టిగ నేరుతుఁగాని, యంకురిం
చిన పులకప్రరోహములచేతఁ గదంబసుమమ్ముపోలికిం
దానికి కదంబితమ్మగు తనూలత నెట్టులు కప్పివెట్టుదున్? ౧౪

ఒక ప్రోషితపతికయొక్క చెలికత్తెలు ఒక తెరువరిద్వారా తత్పతికి కబురు పంపుచు, ఆతనియెడబాటున నామెకు సంభవించిన దురవస్థను, ఇంటఁ బ్రాపురించిన దుర్దశను గురించి—

హోరున గాలివానవిసు రూఁపఁగ నాకులు లేచిపోయి నీ
ర్గారెడు పూరియింట నొకప్రక్కనఁ గూరుచునుండి యార్తయై
ఘోరము నొందు ప్రోషితునికొమ్మను గ్రమ్ముచు, నాఘనాళికిన్
సారెకుఁ జూపుచున్నయవి సంచలనమ్మునఁ జంచలాలతల్. ౧౫

తనపై మిక్కిలి ప్రేమ గలదియే యయినను నాగరికత లేనిది యగుట చేత ఒకయువతిమీద నంతగా ఆసక్తుఁడు గాక, మందానురాగముతో మెలగుచున్న ఒకయువకుని లెస్సగా ననురక్తుని జేయుటకు దూతిక, ఆతనితో సాకూతముగా—

అనుభవింపుము చేపడినట్టిదానిఁ,
బల్లెటూరిలో నెటనుండి వచ్చు లవణ?
మది పొసంగిన, స్నేహము కుదురదేని,
దానితోఁ బ్రయోజన మేమి? తరుణరసిక! ౧౬

రసహీనమే యయినను స్నేహవశముచేత మనోనుకూలము కాక తప్పదు.— అని సమీపోపస్థితుఁడైన నాయకునకు వినిపింపజేయుచు ఒకకామిని, సఖురాలితో అన్యాపదేశముగా—

అరయుచు నాఁటిస్వాస్థ్యము, మహాధృతితోఁ బ్రియురాలు సంచర
త్పరిమలబంధురం బయిన వక్త్రసరోరుహమారుతమ్ముతో

సరగునఁ జల్లవాఱిచి రయొసంగిన చేఁదుకపాయ మెల్లఁ దా
నరిమురిఁద్రాఁగెఁబానకమునట్లుగహాలికుఁ డొక్కఁగ్రుక్కలోన్,

అనుకొన్నట్లు ఆమె రాలేదు. నేనుమాత్రము ఆ పొదరింటిలో చాల సేపు ఆమెకోసము నిరీక్షించి కూర్చుండి, విసుగెత్తి, చివరకు లేచివచ్చినాను.. అని యనుచున్న నాయకుని మరల సంకేతస్థలమునకు కొనిపోవలె నను నాలోచనతో దూతిక –

మఱచి సమాగమస్థలము మంజుల వంజుల కుంజభూములం
దెఱవ పరిభ్రమించు చతిదీనత నీదగు చూపుపొందికల్
మఱిమఱి కోరికోరి వికలంపడి యారయుచున్న దిత్తఱిన్,
గుఱుతులు దప్పి విస్మృతనిగూఢనిఖాతపదమ్ములంబలెన్. ౧౮

ఏనాడైన, ఏకారణముచేతనైన నామీద కోపము వచ్చినప్పుడు ఈమె నారహస్యమును బట్టబయలు చేసి, నలుగురిలో నన్ను ఎండవేయగలదేమో అను భయముతో దూతికకు తనమనోగతమును చెప్పక, దాచుకొనుచున్న ఒకమచ్చెకంటికి సుజనచరితోపవర్ణనముద్వారా భగవా లేదని ధైర్యము చెప్పుచు, లోకానుభవము చాల గడించుకొని ఉన్న ఒక అన్నుమిన్న –

కలఁగునుగాక రోసమున గట్టిగ, సజ్జనునోట నెట్లుగా
వెలువడ నోపు నప్రియము? భీకరరాహుముఖాంతరమ్మునం
దల వఱి చిక్కఁగాక, యమృతాంశునియంశువు లెల్లఁ జల్లగాఁ
బొలములలో నవామృతపుఁబూరము నే కురియించుఁగాదొకో!

తాను పంపిన ప్రణయోపహారమును పరిగ్రహింపక త్రిప్పివేయుటచేత ప్రియురాలికి తనమీద గల ప్రేమ విముఖమైన దని తలచి దిగులుపడి నానాటికిచిక్కిపోవుచున్న ప్రియుని ఊరార్చుచు ఆమెసఖురాలు–నిజముగా నామె నీయందు సహజముగా నవ్యాజమైన యనురాగము కలది. ఆమెకు నీప్రేమ కావలెను గాని కానుక లక్కఱలేదు. – అని నిదర్శించుచు, సుజన చరిత ప్రశంసా ప్రసంగమున—

పనివడి లోకు లెల్లరొక ప్రత్యుపకారము సేయలేని యు
ల్లునిగ వినిశ్చయించి తను లోకువ సేతు, ధనాఢ్యుఁడైన దు

ర్జనునివిధంబునన్ మది విషాదము నొంది కృశింపఁబోఁడు ని
ర్ఘృణుఁడయి సజ్జనుం డొకవిధానఁ దిరస్కృతి నొందనయ్యునున్

ఎంత రహస్య మైనను నాతో చెప్పవచ్చు. ప్రాణము పోయినను నే నా రహస్యమును ఎన్నడు వెల్లడిచేయను.— అని దూతిక, నాయకునితో చెప్పుచు, గట్టినమ్మకముకోసము అన్యాపదేశమున—

కలఁపనఁబిండియై యొకవికారమునం గలహమ్ము వచ్చినన్,
వెలువడఁబోవు సజ్జనునివీనుల కెక్కనయట్టి రాస్నెముల్;
నిలఁబడిపోయి నెమ్మదిని, నిల్వున జీర్ణములై, తుదిన్ జ్వల
జ్జ్వలనునిచే సమూలముగ భస్మముసేయఁబడున్ నితాంతమున్

దురంత మయిన వసంతసమయమున నంతు లేని విరహతాపము ననుభవించుచున్న ఒకప్రోషితపతికయొక్క దుర్దశను వివరించుచు, తత్పతిసమీపమునకు పోవుచున్న ఒకపాంథునిద్వారా సందేశములో సఖురాలు —

ముంగిటం గల విరజాజిపూలగుత్తు
లెడ యొసంగక వాఁకిటిగడియ లయ్యె;
బాటసారులఁ జూచు నాశ్వాసమేని
లేదు ప్రోషితపతికల కీదినమున. ౨౨

ఒకానొకప్రియురాలికి ప్రియునిమీద గల ప్రణయాతిశయమును,ఆమె వాలుగన్నుల అందచందములను వివరించుచు, చెలికత్తె మఱొకచెలికత్తెతో—

ప్రణయిముఖ విలోకన సుఖరసముచేత
ముకులితమ్ములు కావేని ముదితకనులు,
నాతి చెవిలోన నిడుకొన్న నల్లగలువ
పువ్వు లెవ్వఁడు తిలకించుపాలితి కగును? ౨౩

ఆహా! చల్లని ఈ నానకాలము ఎంత హాయిగా ఉన్నది?— అని ఒకడు ఊరకే ఉల్లాసముతో పొంగి పొగడ సాగినాడు. అతనిమాటలు విన్ని విని, సహచరుడు చమత్కారముగా —

అడుసులోఁ గూరుకొనిపోవు హాలము లాఁగి
దున్ని దున్ని శ్రమంపడియున్న మగఁడు
బిట్టు గుబ్బున నిద్రపోఁ, దిట్టఁ నోడఁగ
నిండువానకారును వాని నెలఁతమిన్న. ౨౮

ప్రవాసమున కుద్యుక్తుఁడై యున్న ప్రియుని ప్రయాణమును ఆపివేయ వలె నను తలంపున ఆతని ప్రియురాలు, రానున్న వేదసాఁగిశయమును సూచించుచు, కామశర నమస్కారాప దేశమున —

తాపముఁ బెంచు, డెందము నితాంతసుఖాభిరతిం గరంచు, దు
ష్ప్రాపతరస్ఫురన్ మధురరాగరస మ్మొలికించుఁ, దేఁవకుం
దేఁవ రమింపఁ బంచు, నరతిన్ రతినిం బొసఁగించుఁ బ్రాఁపులై,
యా పువువిల్తు బాణముల నోఁదల నంజలిఁగూర్చి మ్రొక్కెదన్.

తనమనస్సు అనుభవించుచున్న వ్యధను కాముకునకు దెలియఁబఱుచుచు ఒక కామిని, మన్మథబాణవర్ణన వ్యపదేశమున —

కుసుమమయమ్ములయ్యుఁగ ఱకుల్, మెయిసోఁకనివయ్యు దుస్సహా
మ్మసమము నొప్రతాపముననాయతముల్, చొరఁబాఱి మర్మము
ల్వ్రేస వెసఁ జించి వైచియును బ్రీతి రతింకరముల్; వచింప వె
క్కసమగు పేర్మితో బహువికల్పము లాకుసుమాస్త్రునస్త్రముల్.

ప్రియపతిగుణస్మరణమున గాఢోత్కంఠిత యయిన ఒక ప్రోషితపతిక, మనోవినోదముకోసము సఖురాలితో —

ఈసుఁ దొడిగించుఁ, బొడమించు నిక్కుచావు,
నెంత విప్రియమైన సహింప నేర్చు?
విరహసమయమ్మునన్ మేను విడువనీవు,
దయితునిగుణమ్ము లతివిచిత్రమ్ము లహహ! ౨౯

నాయకునితో దూతిక —

అలరి యలంకరించుకొని యాలవలీలలితాంగి పావ మా
వలుదమిటారిగుబ్బచనుబంతులబర్వునఁ గ్రుంగిపోవుచుం
బలుఁమఱు నాయనమ్మలను బంచిన దింటికి నింటి కేగి, యు
గ్గలముగ నిన్నుఁ జూచుకుతుకమ్ము కృపారహితాంతరంగుఁడా!

బాగుగా రశ్మి రాల్చు ధనికభుజంగుని గాదని త్రోసి వేసి, పరమ దరిద్రునిమీద మనసుంకొనుచున్న ఒక సన్నతాంగికి వల దని బోధించుచు సఖురాలు, దరిద్రులదుర్గతిని వర్ణింప సాగి—

ఏఱుపిడకలచిచ్చు నేపాఱుకంపు
వాఱి పొగచూఱి చినఁగిన ప్రాఁత మఁటికి
బట్టతో ప్రేలుచున్నాఁడు పచ్చిపుండు
వంటి యీ చలిలోన దౌర్భాగ్యుఁ డితఁడు. ౨౯

దురదృష్టవశాత్తు హేమంతకాలములో ప్రవాసము సంభవించినదో, అప్పుడు పైబడు కడగండ్లు ఇంతంతలు కావు.— అని ప్రవాసమునకు సమకట్టి యున్న ప్రియునకు సూచించి ఆతనిప్రయాణమునకు స్వస్తి చెప్పించు తలంపున ప్రియురాలు—

పొలములలోఁ బలాలమఁలముక్కలు గీఱుకుపోయిగాయముల్
బలిసిన కాయముం దడవి వల్మఱుఁ బాంథుఁడు బండవార్చుకోఁ
దలపడినాఁడు నిండుచలి దాడి యొనర్చు ప్రభాతవేళలోఁ,
గలకొని యాచమించుసుదకమ్మున నార్ద్రితమైన చేతితోఁ ౩౦

రూపగుణాది విభవమునందు తనకన్న మిన్న యయిన ఒక ఉత్తమాంగనను నీచు డొకడు బలాత్కారముగా లోగొనినాడు. వానివలెనే తాముకూడ ఉత్తమవనితను పొందవలె నను నభిలాషతో మఱికొందఱు నీచులు ఆతనివెంట బానిసలై యనుసరించి తిరుగుచున్నారు. వీరందఱివలెనే మఱొక దౌర్భాగ్యుడు ఉత్తమమహిలాసమాగమముకొరకు నానా అవస్థలు పడి, చేయరాని ప్రయత్నము లన్నియు చేయుచున్నాడు. ఆతనిక్షేమము కోరిన స్నేహితుడు — అది కూడని పని — అని బోధించి, ఆతనిని ఆ ప్రయ

త్నమునుండి మరలించుటకు చూచుచున్నాడు. ఒకతటి యాదృచ్ఛికముగా అట్టు లాతని వెన్నంటి పోవుచున్న హైకుంటరులను ఆతనికి చూపి, అన్యాప దేశముగా మిత్రుడు—

గోటఁ ద్రుంచి యనాగరికుఁడు తల నిడు
కొనిన సహాకారమంజరి ననుసరించి
తిరుగుచున్నారు గుమిగా భ్రమరయువకులు,
బలిమిఁ గొని తెచ్చి బంధిత వనితనటులు. ౩౧

ఓహో! ఎవతెతవులాటముననో తవులుపడిపోయి, నమస్కారాదులు కూడ చేయుచున్నావే! తెలిసినదిలే నీగుట్టుమట్టంతయు! అని నెఱజాణ యయిన దూతిక నాయకునితో—

వలపులు వోసి సూర్యభగవానుని పేరునఁ గూర్చి పట్టి యం
జలిఁ బలుమాఱు మ్రొక్కులిడ సాగితి వెవ్వరికోయి కుఱ్ఱఁడా!
యలఁతినిఁ బోక వేలుపుల కర్పణసేయు జయప్రణామ కౌ
శలములు కావుసుమ్ము సరసస్మితలోలకటాక్షమిశ్రముల్! ౩౨

తన కూర్చుదయితతమునితోడి సరసరతములో నత్యంతము అనురక్త యయిన ఒకనాయికను చౌర్యరతములోని సుఖరసవిశేషానుభూతిని మధుర మధురముగా వర్ణించి వినిపించి మోహపెట్టి ప్రలోభింపజేయు తలపున చతుర దూతిక —

పరిమలవక్త్రమారుతముపంపున దీపము నార్పి, యూర్పు లం
తరమునఁ జిక్కఁబట్టి, చెవిదారిఁ బడీపడనట్లు పల్కు లం
బరపుచు, నోష్ఠబింబ మతిభద్రముగాఁ గనిపెట్టియుండి, దు
స్తరశపథమ్ములం బొసఁగు చౌర్యరతమ్మునఁ దీపి యెంతయో!

సంగీతపుసాకున ఎవనినో ఒకప్రియుని సోత్కంఠముగా తలపోసి తలపోసి, నీవు దీనదీనముగా ఇట్లు విలపించుచున్నావు. అది ఆ ధోరణిలోనే బాగుగా వ్యక్తమవుచున్నదిలే! ఇక నీవు దాచుకొనవలసిన పని లేదు. నాతో చెప్పు. ఆ సరసునికోసము ప్రయత్నింతము.— అని నాయికతో దూతిక, తనమీద ఆమెకు నమ్మకము కలుగునట్లు మాటాడుచు —

గాన మను మిష వెట్టి సోత్కంఠముగ నే
వానినో తలఁచి తలంచి వగచుచుంటి
వబల! మధ్యనిరుద్ధకంఠార్ధమందు
నాఁగి వెలలుచుఁ దొట్రిల నక్షరములు. ౩౮

ఇంటిపాలేరుగా ఉండి తనకు ప్రేమపాత్రుడైన కోడెగానితో ఇంటి యజమానురాలు స్వయముగా —

కారులు గ్రమ్ముచీఁకటులు గట్టిన కోటల కాళరాత్రి, సం
చారముతోడ నేఁడె యజమానుఁడు నూరికిఁ బోయె, నింట నె
వ్వారును లేరు, మేలుకని భద్రముగాఁ గనిపెట్టి మమ్ముఁ బా
లేరుఁడ! చూచుచుండు మొక లేశము లోపము రాకయుండఁగాన్.

తానుకూడ ఒకప్పుడు అట్లు అనుభవించి యున్న వేదనను బాగుగా గుర్తున ఉంచుకొని, కష్టసుఖములు తెలిసిన కుటుంబినులు తమకోడండ్ర విషయములో చాల సదయముగా ప్రవర్తించుచు నుందురు. — అని నాగరికు డొకడు సహచరునితో —

క్రమ్మెడుకాఱుమబ్బులను గన్గొని కంఠగతమ్ములైన ప్రా
ణమ్ములతోడి కోడలిమనస్స్థితిఁ జూచి కలంగి యత్త, కృ
త్యమ్ముల నెల్ల మానుకొని యామెను గాచుకొనంగడంగె భ
ద్రమ్ముగఁ, బుత్త్రజీవితము రక్ష యొనర్చు మహాధమ్ముగాన్,

రహస్యముగా ఒక్క తనపతితో మాత్రమే చెప్పుకొనిన తనయభిలాషము సవతినోట రాగా విని, రహస్యము వెల్లడి యయినదికదా యని కినిసి కలగి నాయిక, ప్రియతమునితో —

దయితుఁడా! యెద నిడుకొన్న దయితతోడ
నాదు నెదలోన నిలుచుచున్నావు నీవు,
నిక్క; మట్లు గాదేని యామె నెఱఁతమిన్న
యెఱుక కెట్లయ్యె నాకోర్కె తెలుఁగు? చెపుమ! ౩౯

నాయికాప్రణయాతిశయమును ప్రకటించుచు దూతిక నాయకునితో-

వెరవరివన్నె కాఁడ! కనిపించి మొడమ్మొగఁ జూపుదారి కీ
వరుగుచు నుండఁగా జరిగి యుల్లస వీనుల కంటి, గిఱ్ఱునం
దిరిగి మహాశ్రుపూరమున నిండిన నెచ్చెలికన్నుగల్వపూ
విరులొసఁగెన్ జలాంజలులు పెద్దగ దర్శనసౌఖ్యరేఖకున్, ౩౮

ప్రోషితపతిక తనప్రాణపతికి కబురు పంపుచు—

పలుమఱు భావనాగత భవన్మధురాననబింబ దర్శనా
శలఁ బ్రతిరుద్ధమై సుఖపు స్వప్నములం గను జీవితమ్ముతో
నిలిచి, నిరంతరాశ్రు గహనీకృత నేత్రయుగమ్ముతో నెదం
గలఁగుచు నెంతకాలమిటుగాఁ గడపన్ వలె నింక నెయ్యుఁడా!

మొట్టమొదట చాల అందకత్తె యయినను, బహూపభోగములచేత ప్రకృతమున రూపయౌవనసంపద దిగజారిపోయిన ఒకకులటను చూచి కుట్టని, ఉల్లకుట్టుమాటగా—

కడచి కథావశేషితముగాఁ, గనిపింపని సొంపుపెంపునన్
మడఁగినయట్టి నీ మధుర మంజుల యౌవన రూప సంపదం
బొడఁగని యెవ్వఁడాత్మవగపొందఁడు సుందరి! యెల్లతొంటియూ
ళ్ళడపొడ గానరాక యడఁగారిన జన్మపదము నట్లుగాన్. ౪౦

అన్యోన్యమ్ము అనురాగాతిశయమున మెలగుచున్న ఒకానొక నాయికానాయకులను గుఱించి వివరించుచు నాగరికు డొకడు సహచరునితో—

అతఁడు పరితోషమున నింత లంతలైన
కనులతోఁ గోర్కె నెఱిఁగించె జనులనడుమఁ,
దొడరు చిఱువేఁడిచెమ్మటఁ దోఁగు నవయు
వములతో దాని గ్రహియించె వాలుగంటి. ౪౧

పరస్పరము ప్రణయపరీవాహములో మునిగి తేలిపోవుచునే యున్నారు. కాని, పాపము! వా రేమి చేయగలరు? ఒక్కనాడయినను రవంత సందు దొరకుటలేదు.— అని ఒకానొక కామినీకాముకులయవస్థను సూచించుచు నాగరికుడు సహచరునితో —

అనుతాపమ్మున గ్రుఙ్గుచున్ దినదినమ్మన్యోన్య సందేశ సం
జనిత ప్రేమరసోర్మిలం బెరిగి ప్రోత్సాహించు కౌతూహలం
బునఁ దబ్బిబ్బయి, కోర్కెలెందుసఫలంబుల్గాక లోఁగుందుచున్
దినముల్ పుచ్చుచునుంద్రు నెయ్యపుగవల్ నిండారుగోరుమ్ముతోన్

తన ప్రియతమునిమీద తనకు గల అనురాగమును కప్పిపుచ్చుకొనుచున్న నాయికతో సఖురాలు సచాతుర్యముగా —

వాఁడు కాఁడేని నీ ప్రియువల్లభుండు,
వాని పేరున మే మేదో పలికికొనఁగ,
దరుణి! నీ చిఱునవ్వేమొ మరుణకిరణ
వికసితాబ్జము కానేల? విప్పి చెపుము! ౪౩

తీవ్రరోషముతో త్రాచుబాము వలె నీ వింతదాక రోజుచునే యున్నావు గదా! ఇంతలోనే ఇంత మెత్తబడి పోయినావే! ఏమి జరిగినది? ఆతడు నిన్ను ఎట్లు అనునయించినాడు? ఎట్లు వశపఱుచుకొనినాడు?—అని మాతులాని అడుగగా ఒకమానిని చిఱునవ్వు నవ్వుచు, ఆమెతో —

పూనిన తీవ్రరోష మను భూమిరుహమ్మున కోర్వరాని జం
ఝానిల, మంగపాళి కమృతామృతపూరసిషేచనమ్మ, క
ర్ణానము తేకుచాప విజయసంవద నాటక పూర్వరంగ, మా
హా! నిబిడోపగూహన మనంతగుణాస్పద మద్భుతంబునన్ ౪౪

తాను ప్రేమించిన యువకుడు వినుచుండగా ఒకకామిని, తనసమాగమోత్కంఠను ప్రకటించుచు, హృదయామంత్రణవ్యాజమున—

నావలెనే మదన్యులమనమ్మును క్షోభిలుచుండు నన్న సం
భావన సేసి, మాను మనుమానము; పూనుము సుప్రసన్నతం;

గావుము నెయ్యముల్; గుఱుతుగాఁ బరమార్థ మెఱుంగలేని నీ
చావలిఁ గూడిమాడి మనమా! మముఁజుల్కన సేయఁబోకుమా!

ఉపపతికి నాయికమీది ఉబలాటము నినుమడింపజేయుటకు అతడు
వినునట్లు చెలికత్తె, నాయికతో—

లావణ్యామృతసారముం గురిసి యాహ్లాదమ్ముఁ జేకూర్చె నీ
జైవాంత్రుడనిమిన్నగాఁబొగడుచుల్ జాల్వార్చెఁబుష్పాంజలుల్
శ్రీవాల్లభ్యముతో భవన్ముఖమునం జెల్వొందు చార్వంగి య
ష్టావాసమ్మునవార లెల్ల నగలేదా వాఁడు లజ్జింపఁగాల్? ౮౭

శఠనాయకునియందనురక్త యయిన నాయిక వానితో—

ఎడయక తోడునీడయటు లీవు మెలంగుచు నుండి యున్న ని
వ్వడువున నా తనూలతిక వాడి కృశించి తఱుంగఁగాఁ గతం
బడిగిన నెవ్వరేని, మరియాదగ వారికి నేమి యుత్తరం
బిడవలెనో స్ఫురింపదు, వచింపఁగదోయి రసంత కాంతుఁడా!

మొట్టమొదటగా తన వలననే ఊడిపడినట్టు పట్టరాని అనురాగమును
చూపి, బంగారమువంటి శీలసంపద నేలపాలుచేసి, ఆవెనుక మందాను
రాగముతో ప్రవర్తించుచున్న నాయకునకు, నాయికయొక్క ప్రణయాతి
శయమును, వేదనను, హృదయమునకు తగులునట్లు వివరించి, వానిని అను
కూలపఱుచుటకు దూతిక సవ్యాజోపాలంభముగా—

అంగముల కెల్లఁ గార్శ్య మొసంగినావు,
నిరత మూర్పులు నేడ్పులు నేర్పినావు,
వినయమును దాఁటుమేరకుఁ బనిచినావు,
తలఁపనైనను దలఁప వా తన్వి నహహా! ౮౯

ప్రవాసోన్ముఖుడైన నాయకుని ప్రయాణమును ఆపివేయు నూహతో
ఆతడు వినునట్లు నాయిక, చెలికత్తెతో—

కూరి బలువాటి యోరుచుకొలఁది మీాటి
తలకు మిగిలిన స్వప్రియతరుని విరహ
వేదనకు స్వస్తి సెప్పఁగా వేఱె దారి
గలదె మరణవినోదమ్ముకన్న నెందు? ౮౯

అన్యాసక్తుఁడైన నాయకుని నేర్పున నొవ్వ నాడుచు ఒక నాయిక—

నీ గుణములు వర్ణించి వర్ణించి కులట
లైన పడఁతులప్రోల, నిన్నందరాని
ప్రాణిపం డొనరిచితిమి మాకు మేమె;
యెవరి నే మని యనఁగలమింకఁ బ్రియుఁడ! ౯౦

తనకు, తనప్రియునకు పరస్పరము గల అనురాగాతిశయమును ప్రక
టించి తనసౌభాగ్యభాగ్యమును వెల్లడించుచు తెలుప ఒకతె—

మునుమును జాఱిపోయి విడిపోయిన నా దృఢనీవికోసమై
నునుతలిరాకుచేతుల మనోహరుఁడుం దడవంగఁబోయి సి
గ్గునఁ బడిపోయె, నేనును నగుర్వొదువం దనువల్లి యెల్లఁ గ్ర
క్కున నిబిడోపగూఢమునఁ గొంటిని వాని రసైకలోలనై. ౯౧

కలహాంతరితయొక్క చెలికత్తె, అనునయమునకు పురికొలుపుచు
తత్కాంతునితో, ఆమె యనుభవించు విరహవేదనాభరమును వివరింప
మొదలిడి—

సరసశరకాండఋజుకయై సరళయైన
పాలఁతుకకు నేర్పినా వొక్కపూఁటలోనె,
భళిర! యనుసును లావులింతలు వగర్పు
లూర్పులును, వక్రగతిలోనె యుండి నీవు! ౯౨

మందాదరుడగుటచేత నిర్భయముగా విప్రియ మాచరించి, తిరిగి సద్భావ
శూన్యమైన దాక్షిణ్యముతో ననునయించుకొనుచున్న శఠనాయకునితో
నాయిక—

స్నేహముఁ ద్రోసివేసి చెయిఁ జేతుల నన్నాఁ, విన్న జిట్టె స
మ్మోహనదీనవాక్యములఁ బోయెప పోలఁ జేరనన్నగా,
నా హృదయమ్ము ఘోరగహనవ్యథఁ జుంచి కలంచివేసె వి
న్నీ! హత మూని నీ మొనయు చేఁతలకన్నులచేత నెయ్యుఁడా!

ప్రియునిచేత ఇంకను బ్రతిమాలించుకొని, అట్లు అమోఘమైన ఆ అనునయ సౌఖ్యము ననుభవింపవలె నను తలంపున ఒకమానిని, నిజమునకు తనకోపము లోలోపల రూపుమాసి పోయినను, పైకిమాత్రము కోపమానాభి నయముతో బిగుసుకొనిపో సాగినది. పాపము అతడు అట్లే బ్రతిమాలు కొనుచు, ఒక్కసారిగా గాఢముగా కౌగిలించుకొనినాడు. వెంటనే ఆ కోపాభి నయముకూడ పోయి, ఉల్లాసము ఎసకొనుటచేత, ఆ లతాంగి భుజాలతికలు అప్రయత్నముగా తమకు దామముగా వలితములై అతనిని పెనవైచుకొనినవి. వెనువెంటనే తెలివి గలిగి భావప్రకటనము వ్యాగా— వీనివలన నలిబడితిని గదా! అని సిగ్గుపడుచు, భుజాలతికలమీద బింబులు నిండు బాష్పబిందువు లతో మరల ఆమె, అలుక ప్రకటింప సాగినది. అది గమనించి నాయకుడు సప్రేమదాక్షిణ్యముగా ఆమెతో—

రమణునిఁ బ్రేమగాఢపరిరంభమునం గదియింప సంభ్రమ
భ్రమితములౌ భుజాలతలపై రమణీమణి! యూరక కిన్క కో
పము మొనయింపఁబోకు, వెలివాలుకనుంగవ కెంపువాఱి బా
ష్పము లురలించుచున్నయది పద్మముఖమ్ము ముడింగిపోవగా!

పూలసాకున పోయి గోదావరియొడ్డున ఆ పొదరింటిలో ఒకరితతో గూడి గమించుచున్నావుటే! నీ హాస్యము నాకు బాగుగా తెలిసినదిలే! అని ఒక విలాసపురుషునకు తెలియ బలుకుచు వృద్ధనట్టిని ఒకతె, పరిహాసూచకముగా వానితో—

చాలులె మ్మింకఁ బూవులు, చనకు మటకు,
దేవతలు జలాంజలులతోఁ దృప్తి గొందు,
రోలి నల్ల గోదావరీకూలము లన
శీలసంపదున్మూలములఁ బాలకుండ! ౫౫

ప్రియుడు ఎడమగుటచేత నీవు నిజముగా ఉన్మనస్క వయినావు. అది నీకవళికలె చాటుచున్నవి. ఇక మాదగ్గఱ దాచుకొన నేల? అని సఖురాలు నాయికతో—

ఓ సఖిమిన్న! నా పలుకు నొక్కొకవల్కునఁ బుచ్చువేఁడిని
శ్వాసలలో నొకొక్కపుకు సంచలియింపఁగఁ జేయుచుం దలక్,
ఆఁ! సరి! ఊఁ! యటంచు మన మవ్యవధానముగాఁగ గోలపాల్
సేసెద వేమొ? గొల్లు మని చిక్కుల ముంచి మముం దలోదరీ!

నాయకునితో దూతిక తన నేఱజాణతనము ఉట్టిపడునట్లుగా—

నీవయి స్నేహభావమును నిల్పి మెలంగఁగ వేఁడఁ బోయి, నేఁ
ద్రోఁపున ముంపఁగాఁ బడితి దుస్సహదుర్భరశోకవార్ధిలో,
బాపురె! యట్టి స్నేహ మిఁక వట్టిది వట్టి దటంచు నవ్వుతో
నూఁపుచు హాస్తపల్లవము నొట్టులు పెట్టిన నీవయస్యచే! ౫౮

పల్లెటూరి పామరజనులకు గూడ సంకల్పము కలుగగానే సాత్త్విక భావము లంకురింపక మానవు. అట్టిచో, గసికుల విషయమై వేఱే చెప్పవలెనా? అని తన మూర్ఖ కత్వమును వెల్లడించుచు నాగరికతాభిమాని యైన ఒకడు సహచరునితో—

కడుఁగడుఁ జిక్కఁగాఁ బెరిగి క్రమ్మకు వచ్చిన యీ పొలమ్ములో
విడక రమింపఁగావలెఁ బ్రేయసితో నని యెంచి పొంగుచున్
వడివడిఁ గంది విత్తుతరుణమ్మున మానిక జాఱెఁ జెమ్మటం
దడిసిన కర్షకాత్మజుని నాఁగవుచేతులనుండి నేలకున్. ౫౯

ఆ కూలిపడుచు నామగనిమీఁద కన్ను వేసినదిసుమా! అని తన సఖురాలితో గ్రామాధికారికోడలు—

మన మిటఁ గోయుచుండ యజమానికుమారుఁడు ప్రత్తికాయలన్
మునుకొని యన్ని కోసికొనిపోయెఁగదా యొడినిండ నెన్నఁడో!
కనుఁగొను మల్లకొమ్మవయిఁ గ్రమ్ముచు సాగిన దిప్డుఁ జెమ్మరిం
చిన నునుప్రేళ్ళలోఁ జెలువచేతలిరాకు వితా భ్రమింపఁగాన్.

నాగరికు డొకడు సహచరునితో —

రతిసుఖవివశ గ్రామీణసుత మృతయని
తలఁచి హాలికపుత్త్రుఁడు పిక్కబలముఁ జూప,
నరలు చిట్లిన కాయల బరువుతోడ
వంగి చెంగున నవ్వెను బ్రత్తిగొమ్మ. ౯౦

ఒక కులుకులమిటారి ఆత్మనిందావ్యాజమున, ప్రియతమునిమీఁద తనకు గల అనురాగాతిశయమును, తన సౌభాగ్యాతిశయమును వెల్లడించుచు సఖురాలితో —

పొసఁగు నిశ్వసితోత్కంప పులకితముల
లాస్య మొనరించుమదవతుల్ ధన్య లెంతొ;
కాంతుఁ డక్షిగోచరుఁ డయినంతమాత్ర
మఱచిపోదుము తమ్మును మమ్ముఁబోంట్లు! ౯౧

సపత్నులలో నీవు మేలుబంతివి! అని పొగడుచు ఒక నెఱజాణ, ముగ్ధనాయికతో —

నడుమను జిక్కియుండియు, గుణమ్మున లెస్సగఁ దోఁచి,నీమ నె
న్నడు ముడువై విపత్తులమనమ్మున బల్లెము నాటె; వింతి! యె
క్కుడుకృశమయ్యుఁగార్శ్యమున గ్రుంగఁగఁజేయుఁ గగుబ్బెఁడయ్యె
గుబ్బెఁడు సొదలన్ రవుల్ గొలిపి, పేరడఁగింపఁగ నేర్చె వారలన్.

ప్రవాసోన్ముఖుఁడైన ప్రియునితో ప్రియురాలు సానురాగముగా —

మందు మాకు లేని జ్వరమ్ముమాడ్కి, లేమి
నణఁగిపోయి స్వీయులమధ్య మనికియటులు,
వగతుపెంపును గనుకలివగిది, ననుఁగుఁ
జెలువుఁడా! నీవిరహ మోర్చుకొలఁది గాదు. ౯౩

తనకూతురు చాల విలాసవతి, చారూన్నతపీన పయోధరభారాలస.— అని తెలియబఱిచి, విలాసి యయిన భూపాలుని అనుకూలుని చేసికొనుటకు వృద్ధవేశ్యమాత, చాటూక్తులు సాగించి —

ఒలసి విపులమ్ము నిర్మల మున్నతమ్ము
నయిన నీహృదయమ్మును నాకసమును
నాక్రమించి రసమ్మున నధివసింప
ఘనపయోధరములు గాక కల వి కేవి? ౭౪

నాగరికు డొకడు సహచరునితో—

తొడరి పాదాగ్రములచేతఁ ద్రొక్కఁబడిన
ప్రాఁతయెండుటాకుల మర్మరధ్వనులను
వినుచునున్నది తెలివ తీవియలయింట
దత్తసంకేతయై యుబు కెత్తుచెవుల. ౭౫

నాయకుని యుబలాటమును ఇనుమడింపజేసి, ఆతనిని వశపఱుచుకొనుటకు దూతిక, నాయికాముఖసౌరభవర్ణనమున కుపక్రమించి—

తొవలదొరవల్ల నొక పరిభవ మెఱుఁగద
పూర్వ మమల మా శ్యామనెమ్మొముతమ్మి
చుట్టుఁ దిరుగుచున్నవి తేంట్లు సురభిల ముఖ
మారుత పరిమలాబద్ధ మండలముగ. ౭౬

నాయికాప్రణయాతిశయమును ప్రకటించుచు దూతిక నాయకునితో—

చనినయంత నీ వటు, గురుజనుల ప్రోల
ధైర్యముం బూని యుండియుఁ దరుణి, కనుల
నట్టె మూయుడు, ఱెప్పల నంటి యున్న
కంటినీరు గాఱెను జనఃకట్టువయిని. ౭౭

నాగరికు డొకడు సహచరునితో తనప్రియురాలిని గుఱించి—

అవలిమొగమ్ముతోఁ దలిమమందుఁ బరుండి నిమీలితాక్షియై
తవిలిన దొంగనిద్దుర యదాయదలై విడఁబాఱి పోవ మ

న్యపు పరివర్తనమున్మసకు నూల్కొని కుల్కుచుటారి రాపుచ
గ్గవ మివిలించు స్పర్శసుఖగౌరవకేలి స్మృతిం దోఁగుసే! ౧౮

విదిత రహస్య యయిన సఖురాలు సఖితో పరిహాసముగా—

ఫాల్గునోత్సవమందు నెవ్వాఁడో యిడిన
మధురనిర్ఘోష కర్దమ మండనమును
బృథుల కుచకుంభముఖ లుర స్స్వేదజలము
కడిగివై చెఁగదా! యింకఁ గడిగెదేల? ౧౯

నీమాటమీద నే నా మెదగ్గఱకు పోయినాను. కాని ఆమె ముచ్చటకై నను నెవ్వారైన మెదపలేదు.— అని యనుచున్న నాయకునకు దూతిక —

ఇంటిపెద్దలమ్రోల నీ కేది నోటువ
దూరిపెద్దకుమార్తె, కుమార! కనులు
మూయు కించుక వంచు నెమ్మోముతమ్మి
వఱపు వఱవాలుచూపులభణితిఁ? జెపుమ! ౨౦

పైయర్థమునే ప్రకారాంతరమున—

కలువకన్నులలోఁ గ్రమ్మి కలఁగి తిరుగు
బాష్పపూరాన నలసమై పరగు వాలు
చూపుతో సారెఁ జూచుచు సుందరాంగి
తెలుపుకొనలేదో నీ కేది, తెలుపుమయ్య! ౨౧

ఒక వృద్ధనారి, గతవిషయస్మృతితో తనవార్ధకమును సంబోధించి—

నాఁడు నాతలదిండుగాఁ గోఁడెగాండ్రు
పెట్టి తడవిన గణపతివిగ్రహమునె
నేఁడు మ్రొక్కుచుంటిని, బూజ నెఱపుచుంటిఁ;
బాడుముదుకరోగమ! తృప్తిఁ బడయు మింక! ౨౨

సాభిప్రాయముగా నాయకుని నిందించుచు, ఆతనియుపేక్షాభావమును ద్రోసివేయుటకు నాయికయొక్క చెలికత్తె, నిదర్శనవిధానమున—

అనఁగి పెనంగి యొక్క మనసైన లతాంగి గతించి వట్టిపో
యిన తనయింటఁ దా మును రమించి సుఖించిన యెల్లచోటులుం
గనుఁగొని,దాఁగ ద్రవ్వుకొని కైకొనిచన్న నిధానముల్ వలెన్,
ఘనతరశోకవహ్ని నుడుకం దొడఁగెన్ హాలికాత్ముజుం డెదన్.౨౩

ప్రియతమునిపై కోపము నుపదేశించుచున్న సఖురాలితో నాయిక—

ఎడసినయంత సుంత యెవఁ, డేయొకప్రొద్దున రాని నిద్దురన్
వడఁబడి వెల్లఁబాఱి తనువల్లిక తూలుట యుస్సురుస్సులుం
బొడవగు వేఁడియూర్పులును బుట్టి పొసంగునొ, యట్ల వాని కే
ర్పడి సరివచ్చుపాటిదొకొ వన్పడు నెంతటి కోపమేనియున్? ౨౪

వల్లభునితో నొకమానిని, సప్రణయకోపోపాలంభముగా—

ప్రబలిన నీదు విప్రియపరంపరచేఁ గడు నిండిపోయి ని
ర్నిబిడమ యైన డెందమున నేఁ గృశియింతునుగాక, యెన్నఁడే
నబలనుగా మృతింపను త్వదర్పితచిత్తముతోఁ బ్రియుండ! భా
వబలమునం గొనన్ వలసివచ్చునొ వెండియు నిన్నె భర్తగాన్!

ప్రియునిచేతటికములకు తల కంటగించి కోపించిన ఒకమానిని, సవైదగ్ధ్యోపాలంభముగా—

కలఁగ కేవేళ నీ పనిమొగమ్ముల నన్నిఁటి మేము సైపఁగాఁ
గలము లె! నీవు నిర్భయముగా నొనరింపుము పూని చేయఁగాఁ
దలఁచిన చేఁత లెల్ల, నిఁకఁ ద్వద్గుణనిర్భరమైన మన్మనో
బిలమున దోషరేఖ కొక వీసము నేనియుఁ దావు లేదునూ!

ఒకప్రోషితపతికచెలికత్తె, తత్పతికి కబురు పంపుచు—

నిండి పయి కుచికి నెగడి నేస్త్రకానిఁ
దలఁచుకొనుకోర్కెఁ దెలుపుచుఁ దలిరుఁబోఁడి
కంటఁ గ్రమ్మిన కన్నీరు కాలువలయి
పాఱుచున్నది దుఃఖప్రవాహమటులు. ౭౭

దూతిక నాయకునితో నాయికాప్రణయాతిశయము వ్యక్తపఱచుచు—

నీచేఁతలు నీపలుకులు
నీచూపులు ననుకరించి నెఱపుచుఁ గడవం
జూచిన యా చెలువ కొకిం
తే చాలదు దీర్ఘదివస మెల్లను గుఱుచై. ౭౮

నాగరికు డొకడు సహచరునితో—

విసివి లేదు పో పొమ్మని కసరికొట్టి
నిసిఁ బరుండఁ బాంథునకుఁ దా నొసఁగినట్టి
ప్రాఁతచింపిచాపను జెయిఁజేతఁ బట్టు
చున్న దదె ప్రభాతమున నేడ్చుచు వెలంది. ౭౯

ఇంటిలోనివారికి వెఱచి, అభిలషితనాయికను గలియ సంకింపని నాయకుని పురికొలుపుటకు దూతిక—

వ్యసనములయందుఁ గలవరంపడరు, విభవ
పటిమ గర్వింప, రడలున దిటవు విడరు;
సాధుసజ్జను లగువారు సమములందు,
విషమములయందు నొకభంగి వెలయువారు. ౮౦

ఒక ప్రోషితపతిక, ప్రియవయస్యతో—

పాంథుడో యెవ్వఁడో తెల్లవాఱుకట్ల
ననుఁగుఁబ్రియురాలిఁ దలపోసికొనియొ యేమొ,

పాడె నొకపాట సుమబాణ బాణ విద్ధ
మద్హృదయ మహావ్రణ పరంపరలు వగుల. ౮౧

ఒక ప్రౌఢ, ప్రియవయస్యతో—

పాటమరించి పొంగారెడుపాలితి నుబుకు
ముగ్ధవధువు లేచన్నుల పొలువుఁ జూచి
పెద్దనిట్టూర్పు పుచ్చెను పెద్దభార్య,
వడలఁ బాఱిన దౌడలు వడఁకియాడ. ౮౨

శిథిలానురాగుడైన నాయకు ననుకూలపఱుచుకొను తలపున, అతడు వినునట్లు, కరికరేణువుల యనురాగమును వర్ణించునెపమున నాయిక—

కటకటఁ బడుచుండియు నాఁ
కటఁ గరిణీముఖముఁ దలఁచి కలవడు కరిరా
ట్పుటుల కరాగ్రమునన యు
ప్పటి సరసబిసాంకురమ్ము వరుగై వాడెన్. ౮౩

కోపకారణము అతడే యయి, కోపము తప్పనిసరి యయి వచ్చినను, అప్పుడుకూడ ప్రియతమునితో సదాక్షిణ్యముగా మెలగవలెగాని, బిగిసిపోఁ గూడదు. —అని బోధించుచు ఒకతె, ఒకానొక ధీరనాయికకు ప్రియతమునితో జరిగిన సంభాషణమును నిదర్శనముగా దీసికొని—

కొను మనుగ్రహమును బ్రియా!, కినిసె నెవతె?;
వరతనూ! నీవె, కోపమా పరునిపైనిఁ?;
బరుఁ డెవండు?, నీవె ప్రియుండ! పలుక నేల
వేయి? యిది యెల్ల మత్పాప విలసనమ్ము. ౮౪

విప్రలబ్ధానాయికయొక్క విరహవేదనాభరమును, అనురాగాతిశయమును, తెలియజేయుచు దూతిక నాయకునితో—

వత్తు వీ వని మొల్కని పడఁతి గడపె
క్షణదలోఁ దొలిసగ మొక క్షణముగాఁగఁ;

దలకు మిగిలిన నెగులునఁ దత్తరిల్లు
నబల కవలిసా మేండ్లుఁ బూండ్లయ్యె నయ్యో! ౮౫

ఒక ప్రోషితపతికసఖురాలు దీనదీనముగా తద్బంధువులతో—

మగువ దయ్యము పట్టి క్రుమ్మరుట లేదు,
వెఱవఁబోకుఁడు, చెయిఁ గొని వెంటఁ గొనుడు;
క్రొత్తమబ్బులయుఱుములు శ్రుతులఁ బడుచు
భ్రాంతయై మదిఁ గలఁగె నీ పథికకాంత. ౮౬

నాయికాగుణవైభవమును నేర్పుతో ప్రకటించుచు చెలికత్తె, ఫలించుగు తలిరాకుబోడులచవిలో పడి తిరుగుచున్న నాయకునిగూర్చి భ్రమరాపదేశమున—

కంజకింజల్క వర రజఃపుంజమందు
సమరియున్నంత మకరంద మన్యసుమము
లందు నిరవొందు నేని నీ వంద వొందఁ
గలవు భ్రమరమా! భ్రమియించుక డఁకఁ దొడిగి. ౮౭

నిపుణుఁ డొకడు సహచరునితో—

అనిమిషనేత్రముల్ వికసితాంబుజపత్రములై వెలుంగఁ గ
న్గొనఁగఁ గడంగినారు పథికుల్ తృషితమ్మగు నెమ్మనమ్ములోఁ,
గొనకొని పిష్టపాండురితకోమలదేహను హాలికాత్మజం,
బ్రణుతపయఃపయోనిధితరంగసముత్థ రదిందిరంబలెన్. ౮౮

వికలమనోంతగయయి దురపిల్లుచున్న ఆ కలహాంతరితయొక్క మనోవేదనను ఇపుడిపుడే అపనయించి తేర్పవలెనుమా. — అని దూతిక, నాయకునితో—

ఎవరికోస మీ స్మరణ మం చెంతొ తవిలి
యుడుగ, నెవరు నా కిలఁ గల? రనుచు బదులు

పలికి, కలఁగి పగఁ బాగులు కలుపకంటి
చేత నేడ్పింపఁబడితిమి బ్రాఁతి మేము. ౮౯

నాయికతో సఖురాలు సరోషముగా—

ఓసి గడుసరీ! యడుగుల నొఱఁగి ప్రాలి
జాలి బ్రతిమాలుకొనెడు నీసఖుని నింకఁ
జివురుచేతుల లేనెత్తఁ దివుర వేల?
విను మిదే తుది యగుఁ జిరప్రణయలతకు. ౯౦

పురుషాయితప్రక్రియలో తనకు గల పాటవమును ప్రకటించి, సమీపములో ఉండి తనమాటలు వినుచున్న నుపల్లవు ల్లక్షింపజేసి లోగొను నూహతో ఒక నెఱజాణ, చెలికత్తెతో—

గట్టుపై నూఁది నిజకరాగ్రములు, కూరు
చుండి, తరఁగలకు నడుము సారిదిఁ గదలి
యాడ, నాడుబోదురుకప్ప, నీడలోన
మలయుచున్నది పురుషాయమాణయటులు. ౯౧

గులాబితోటలో సురతకేలి దేలి ఒక వాలుగంటి వెలికివచ్చినది. ఆమె శరీరమునిండ నఖదంతక్షతాదిచిహ్నములు స్ఫుటముగా కనిపించుచున్నవి. అపుడపుడె తన్ను సమీపించుచున్న తన సఖురాండ్రు మొదలైనవారికి తన రహస్యము తెలియకుండ తచ్చిహ్నములను మఱుగుపఱిచికొనుచు, ఆ మేఱుగు బోడి యాగులాబిచెట్ల నుద్దేశించి—

ఎలయ సీత్కారములు హూంకృతులును మొగము
మలుపులును జేతియాఁవుల మంజుశింజి
తములుఁ గాంతురు మీప్రసాదమున ముగ్ధ
కులకుమారికలు గులాబికొమ్మలార! ౯౨

తనమాటలు వినుచున్న ఉపపతికి తనయనురాగమును, లాలసను తెలియబఱచి, వానిని మిక్కిలి ఉబలాటపఱచుటకు ఒకపృథునితంబిని, నిజనితంబబింబవ్యపదేశమున—

ఎంత నిడుపులో పురవీధు లంత కొలత
తో వెలయుచుంటి వేలనే నీవు నో ని
తంబబింబమా! గురుజనత్రపకు నోడి
ప్రక్క కొదుగువాఁడును దాఁకఁబడునుగద వె! ౯౩

సంకేతముగా నేర్పఱుచుకొన్న ఆ లతాగృహమునకు నీవు భయపడి రాకుంటివిగాని, అది చాల మఱుఁగైనదిసుమా !— అని సంటుకానికి తెలియ బఱుచుచు దూతిక—

పచ్చఱాతిములికికొనఁ గ్రుచ్చఁబడిన
చినుకుఁబూసవోలెఁ దృణాగ్రమునకు నంటి
యున్న నీటిబొట్టును ద్రావుచున్నది మెడ
సాఁచి నీలకంఠము వర్షసమయమందు. ౯౪

అభిసారికలతో విశేషానుభవము గల కాముకు డొకడు చెలికానితో—

మఱుఁగుపడి కప్పుదుప్పటిమెఱుఁగులోనఁ
బయికిఁ బటువయి యుబికిన పడఁతిమిన్న
చన్నుకట్టు కన్పట్టెను, సజలజలధ
రంబులో దరోద్గతచంద్రబింబమటులు. ౯౫

ప్రవాసోన్ముఖుడైన ప్రియతముని ప్రయాణమును ఆపివేయుటకు ప్రియురాలు వసంతసమయమును సూచించుచు అన్యాపదేశమున—

తీయమావికొమ్మకు నాకు వేయుచోట
నిది యెదో హాలహాలమట్లు పొదలె ననుచు
బాటసారికిఁ జెప్పెను బాటసారి,
నృపవిరుద్ధకథంబోలె నెఱపి వెఱపు. ౯౬

విరహావేదనావిధురలైన విరహిణులకు తలఁచు కలలో తమప్రియుని సందర్శనము లభించినపుడు కొంత ఊరట కలుగుచు నుండును.— అని లోక

సామాన్యముగా విరహవేదనను గుఱించి నలుగురు కూర్చుండి ముచ్చటించుచు ఒకతె, తమలో నున్న ఒకవిరహిణిని, అంతేకదా? అని స్వవచనద్రఢిమకు ప్రశ్నించినది. వెంటనే యావిరహిణి గంపెడు దిగులు తెచ్చుకొని యిట్లు సమాధానము చెప్పినది.—

కలలలోనైనఁ జెలువునిఁ గనఁగ నోచు
కొనిన కాంతలు ధన్య; లాప్రణయి, సరస
లేమి, నాకంట నిదురయే లేదు లేద
టన్నఁ, గల గనువా రెవ్వ రతివ! యింక? ౯౭

సహజలావణ్యశాలిని యయినను ముచ్చటకోసము ఏవేవో చిన్నచిన్న సొమ్ములు పెట్టుకొన్న నాయికపై ఈఱతొఱచూపులు పఱపుచున్న నాయకుని ప్రబోధించుటను దూతిక అన్యాపదేశముగా—

పసిఁడిచెవిపోఁగు లూఁగాడి పసలు చిమ్మ
చెక్కుటద్దాల ముద్దారు చెవులయందుఁ
గూడ నొక్కొక యప్పుడు గూర్పఁబడును
బంధుతాటాకుచుట్టల మండనములు. ౯౮

నాగరికు డొకడు సహచరునితో—

మండువేసవినడిప్రొద్దుటెండలోనఁ
బడి నడచు బాటసారికిఁ బాపెఁ దావ
భరము నంతస్థ్సుందరీ వదన కుముద
బంధు చంద్రికా రసపరివాహ లహరి. ౯౯

దరియ రమ్మని సైగ చేయగా, కాదని త్రోసివేసి ఒక కామిని, చిడిముడిపాటుతో బొమముడి వైచినది. అది చూచి, యాజ్ఞాభంగమునకు వెగటుపడి,యామెనిరాకృతికి లోలో గలగి,కాముకుడు కించపడ సాగినాడు. ఆతనికించను పోగొట్టి, మగల సుముఖుని చేయుటకు పూనుకొని దూతిక, మంచి నేర్పుమాటలతో నాతనిని జోకొట్టుచు—

కానిప్రదేశమందుఁ దఱిగానితఱిం దఱియుంగ రమ్యసం
గా నెద రోస మూని కినుకం బడ దేయెలనాగ? చెప్పు మీ
వే నయగారినెయ్యుఁడ! సుమేషురతిన్ సుఖియించుచుండఁ దా
మానక పోరు వెట్టెడి కుమారునిపై తనుఁ దల్లి రోయు దే? ౧౦౦

రసిక మనో మిళింద నికరమ్ముల ర మ్మని యాగళమ్ముగా
రసములు జాలువాఱు మధురమ్మగు విందులు వెట్టి, పేర్మి హె
చ్చ, సుకవివత్సలప్రముఖ సత్కవి నిర్మితి గాథలం దమో
ఘసమయు మీ చతుర్థశతకమ్ము సమాప్తిని బొందెఁబొందికన్,

పాలితసత్కవిత్వ కవివత్సల పాలిత పాలితాది సం
లాలితమైన గాథలకలారసవాటికలో రసాలముల్
జాలునఁ దేనియల్ గురియఁజాలిన నాల్గవు కోటి యిద్ది, యీ
లీలఁ గొనెన్ నృసింహకవి లేఖినిలోఁ బరిపూర్ణవైఖరిన్. ౧౦౨

సరసతరము గాథాసప్త శతకమందు
నాల్గవు శతక మతిమనఃప్రీతిఁ దనరె;
నద్ది చెవిదారిఁ బడినంత, నెడఁదలోనఁ
జొర దమృతమేని మధురతా గరిమఁ జేసి. ౧౦౩

# ఐ ద వ శ త క ము

ప్రియతమాపరాధ పరంపరలచేత మాటిమాటికి మిక్కిలి ఖేదింపబడి బడలు చున్న ఒక మానిని, హృదయామంత్రణవ్యాజమున ప్రియతముని ఉపాలంభింప నారంభించి—

తగులఁబడుచున్న, నట్టులే యగుము; యుడుకు
చున్న, నుడుకుము; పగులుచున్నఁ, బగిలి
పడుము డెందమా! గలితసద్భావుఁడైన
వానియాసను నే నిదే వదలుకొంటి. ౧

సమీపమున నుండి తనమాటలు వినుచున్న మిండగానికి — పరిచేను సంకేత స్థాన మని తెలియబఱుచుచు, ఇతరులకు మాత్రము, — అది క్రూరమృగములతో చాల భయంకర మైనది. కాబట్టి పొరపాటుననైన నెవ్వరు నక్కడికి పోగూడదు, — అని వెఱపు గొలుపుచు, ఒక జారిణి—

నిజసుత విశాల తుండాగ్ర నిర్గత మగు
వాఁడికోలను గని యేఁదువంది యూరి
చేరువన పరిచేనిలో దూరి కడుపు
నిండ మేయుచున్నది వెఱకుండ సుంత. ౨

నీవు కోరుకొన్న యాతడు గ్రామాధికారిగదా? ఆతడు సర్వసమర్థుడు. నీ వాతనితో నిర్భయముగా నిశ్చింతగా కలిసి సుఖింపవచ్చు. — అని నాయికకు ధైర్యము పురికొలుపుచు దూతిక, వినాయకాపదేశమున—

హేలఁ గరాగ్రకృష్ట మయి యెల్ల జలమ్ములను వట్టిపోవఁగాఁ
దేలిన శూన్యశూన్యజలధిం గలయించినపాట నుజ్జ్వల
జ్వాలల మిన్నుముట్టు బడబాముఖ కీలివెలుంగులోఁ గడుం
గ్రాలెడు శ్రీగణాధిపతి గౌరవ మొందుత మాఃప్వాలమ్ములన్

తనమాటలు వినుచున్న ఒకకంజాక్షి ననురంజింపజేసి లోబఱచుకొను నూహతో కాముకు డొకడు, తల్లోకమలకగలతలను అన్యాపదేశముగా వర్ణింప దొరకొనె.—

ఓ యశోకరాజమ! నీకు నొకర రవంత
లోప మెందును లే దని లోఁ దలంతు;
నీదు లేతలిరాకుతో నెలఁతమిన్న
చేయి యుపమింపఁబడుచుండుఁ జెలువ మలర. ౮

మందస్నేహుడైన నాయకుని ప్రోత్సాహపఱచుటకై నాయికయొక్క సఖురాలు ఆతడు వినునట్లు అశోకామంత్రణవ్యాజమున—

రసికత నీదుసొమ్ము, చతురత్వము నీ యుఱచేతిబంతి, భ
వ్యసుఖవిలాసలీల. సమయజ్ఞత, లెస్సగ నీకతమ్మునం
బొసఁగె, నశోకమూర్తి! పువుబోఁడులు లేతలిరాకుకాళ్ళతో
మసగొను వేడ్కఁ దన్నినను మూలిమితో వికసింతు వెంతయున్

నిన్న లోగొని కొనిపోవుసమయమున సంభవించినసంకటము లన్నియు ఆతడు మాటలనేర్పుతో నిమిషములో గడచి చనినాడుసుమా! —అని నాయికను ఎఱుకపఱచుచు దూతిక, వామనస్తోత్రవ్యపదేశమున—

బలినిఁ బలుకున బంధించువలన నబ్బు
రమ్ము నేరిమి పేరిమి ప్రకటపఱచు
చు సురసార్థకృతానందసుందరుండు
వామనాకృతి హరి జగత్ప్రభుత మెఱయు. ౯

దైవప్రాతికూల్యముచేత ప్రాణదయితుడు గతియించినను కులాంగనలు ఆతనిమీది ప్రణయపరిపాకమును మాత్రము విడిచిపెట్టలేరు.—అని నిదర్శించి, అసలు స్త్రీలు దృఢతరప్రణయలు, —అని నిరూపించుచు ఒకమించుబోడి, తనప్రణయాతిశయమును ప్రియతమునకు తెలియఁజఱచుచు నాతడు వినునట్లు సఖురాలితో—

మంట లెగువఁగ భగభగ మండుచున్న
నగ్గిఁ జల్లార్పఁ దొడఁగె గృహస్థతనయ,
యనుమరణ ఘనాలింగనక్షణ నిజప్రి
యతమ సుఖరసస్వేద శీతాంగి యగుచు. ౮

ఉదాహృతోదంతమునే భంగ్యంతరమున నిరూపించుచు, ఒక యింతి, ఉపపతిమనస్సు ననురంజింపజేయుట కాతడు వినునట్లు చెలికత్తెతో—

జారపతిచితాభస్మ సంస్పర్శసుఖము
వలనఁ జెమ్మరించిన మేన వెలనిబసుమ
మలఁదుకొనుపనిని ముగింప దదె యెవేల
కేని నూత్నకాపాలికి వ్రాని నిరతి. ౯

సంతానవతు లైనపిదప సుదతులకు మగనిమీది ప్రణయానుబంధము బంధురమై అనన్యాదృశ మవును, అని నిరూపించుచు ఒక తె, సఖితో—

మురిపెము మీటగట్టు తన ముద్దులపట్టికిఁ గూర్చుజీవితే
శ్వరునకు మధ్య నున్న నవపల్లవగాత్రికి నొక్కఁచన్నుదు
గ్ధరసములన్ స్రవించు, మఱొకండు రసోల్లసనమ్మ్రుతో మనో
హార నఖరాగ్రపల్లవ సమాలిఖిత మ్మయి నిండుఁ బుల్కలన్.

బాల, ముద్దరాలు నయిన గ్రామాధికారికూతురుమీద అభిలాషదృష్టి సారించిన ఒకడు, చెలికానితో—

పాలబుగ్గల చిన్నారి ప్రాయమందె
క్రాఁచుచున్నది మోహాన గ్రామనేత
కూఁతు! రింక ముందుఁ బెరిగి చేఁజేతఁ గూర్చ
దే విసపుమొక్కవోలె మహావిపత్తు! ౧౦

ఓహో! నీవలకారిచెలికాడు కామకలాకుశలుడు కాబోలు! ఆతనితో రాత్రి నీ కెట్లు గడచినదేమి? ఏమేమి జరిగినది? ఆ అనంగసురత సుఖరస

ప్రసంగము ఎట్లు జాఱవాఱి పొంగిపోయినది? ఏమి, ఎట్టిది చెప్పవా! — అని బుజ్జగించి, ఒకజవరాలిని మెల్లగా ఒక తెరప్రక్కకు గొనిపోయి నిగ్గు తీసికొని వచ్చినది. అంత నా విరిబోడి ఉల్లాసముతో ఉబ్బిపోవుచు నామెను సపరిహాసముగా సమాధానము చెప్పుచు, తాను అనుభవించిన త్రైవిక్రమబంధవిశేషము స్ఫురించులాగున హరినమస్కారాపదేశముతో నిట్లు పలికినది. —

*పుడమి నిముడక, తారకాపుష్పసంచ
యములచేత నంచిత మయి, యాకసమునఁ
జిరము నిలువ నేరిచి, రసశ్రీఁ దలిర్చు
హరితృతీయపదాబ్జము నభినుతింతు. ౧౧

ఒక విరహోత్కంఠిత, సఖురాండ్రతో.—

యామినిం జనె మూఁడవ జాము గూడ,
నిదుర వోమ్మందురా నన్ను నెలఁతలార!
నల్లవానిలి పూవుల ననుచు తావి
నిదుర వోనీదు నను, మీరు నిదురవోండు! ౧౨

వానిహృదయములో దయకు తావు లేదు, అని యిట్లు స్పష్టమవుచున్నను ఆతని నే స్మరించి స్మరించి, ఎందుల కిట్లు ఉట్టిగట్టుకొని కృశించెదవు? చాలు చాలులే ఇక వానియూసు!— అని బోధించుచున్న చెలికత్తెతో విరహోత్కంఠిత—

సురతసుఖానుభూతి యతిసుందరమై కడముట్టిపోయినన్,
సురతరసైకలోలుఁడయి చూచియుఁ జూచియు నాదునంగముల్

* త్రైవిక్రమబంధము అనంగరంగములో నిట్లు వివరింపబడియున్నది.—

"స్త్రీయోంఘ్రి మేకం వినిధాయ భూమౌ,
వన్యం స్వమూలౌ, నిజపాణియుగ్మం
పృష్ఠే సమాధాయ, రమేత భర్తా,
త్రైవిక్రమాఖ్యం కరణం తదా స్యాత్."

సురతవిలాసలగ్నములఁ సొంపున, నుల్లసనమ్ము నించు నా
సురతు స్మరింపఁ బో కలఁతిఁ జొప్పడి విస్మరియించు టెట్టులే?

జారునకు అన్యాపదేశమున సంకేతస్థలమును తెలియబఱుచుచు ఒక జారిణి—

పూర్వము బాగుగా ధనాదికము కలవాడై, ప్రకృతమున అతిదరిద్రావస్థలో పడిపోయిన ఒకనిని గుఱించి, ఒకతె అన్యాపదేశవిధానమున ననుశోచించుచు—

ఊరిబయటి చెఱువుగట్టున దత్తసంకేతయై, నియమిత సమయమునకు తానచటికి పోయి, ప్రియునిచే మోసగింపబడి ఒకతె, ఆతనికి తనవంచన తెలియబఱుచుచు—

చిరరమణముకోసము సురతరసముచే నలసిపోయినకాంతుని ఉత్సాహపఱుచుతలపున, ఆతనిని అన్యమనస్కుని జేయుచు ఒక కాంత—

ముదిరిన మండువేసవికిఁ బొక్కిన కర్దమ మెండువాఱఁగాఁ,
చెదరినగుండెతోఁ గలఁగి చేపలు జెల్లలుఁ గచ్ఛపంబులుం
గొదనడిపోవఁ, బూర్వమొకకొంచెమెఱుంగనిక్రొత్తరూపుతో
డఁ దెలియ సాగె నిత్తఱిఁ దటాకతటంబటఁ గాలవైఖరిన్. ౧౪

అతిరహస్యముగా అభిసారప్రదేశము చేర బోవుచున్న అభిసారికను చూచి, ఒక నెఱజాణ సపరిహాసముగా—

చౌర్యరతమున ముచ్చట సాగఁగాక,
యిటులు కటికిచీకటిలో భ్రమింపఁబోకు,
కూఁతురా! స్పష్టముగ దీపకళికవోలెఁ
గానవత్తువు నీ వంధకారమందు. ౧౫

రహస్య మెఱిఁగిన వెరవరి ఒకడు చెలికానితో —

క్రమ్ము కార్చిచ్చులో నదీకచ్ఛ మెల్లఁ
దగులఁబడుచుండ, దుస్సహతరళదుఃఖ

పలితమై పల్కరించినవారిపైనిఁ
గన్ను మనుచున్న దతివ నిష్కారణముగ. ౧౬

ఒకతెఱవ తనప్రతివేశినిని, — నీవు కులటవు, దుష్టవు! నీసంగతి నాకు బాగుగా తెలియును.— అని అధిక్షేపించినది. ఆ ప్రతివేశిని ఆమెసంగతి బాగుగా నెఱిగి ఉన్నదగుట చేత ఆమెకు తగినసమాధానముగా, స్వభావోక్తి లక్షణప్రకారముగా, పలుక సాగినది. —

నీ వనినట్లు మేము నవినీతలమే చెడుకూటివారమే,
నీ విఁక మాకు దూరముగ నిల్చి మెలంగఁగదే పతివ్రతా!
నీ వడివాసివన్నెలకు నేఁటికి లేదొక మచ్చయేని; మే
మావిలవృత్తిఁ గోర. మొకయల్పుని, వాడకు నెల్ల నాలుగాఁక,

ప్రియునకు తన యనురాగమును దీనాతిదీనముగా తెలియబఱుచుచు, ఒక కలకంఠి —

నిన్నుఁ గన్నులఁ జూడని నీలకచలు
లెస్స నిదురింతు, రోర్మి నాలింతు రొరుల
మాట, మాటఁ దొట్రిలి పొరపాటు పడరు;
సుఖిత లన వారలే గద సుభగసఖుఁడ! ౧౭

ఒకానొక తలిరాకుబోడియొక్క నిష్కారణ ప్రణయాతిశయమును చెప్పగా నాయకునకు తెలియబఱుచుచు దూతిక సోపాలంభముగా —

♦ప్రీతి నీ విచ్చినట్టి నేరేడుపండ్ల
గుత్తిఁ జెవిలోన నిడుకొని కొంకక నడి
వీధివెంటన యింటికి వేగ మేగె
బాలకా! యా వధు వతిలజ్జాలు వయ్యె. ౧౮

---

♦నేరేడుపండ్లగుత్తికి మూలములో 'బదరసంఘాటీమ్' అని ఉన్నది. సంఘాటి అనగా — రెండు పండ్లు మాత్రమే ఉన్న ఒక రెమ్మ అని అర్థము.

ఒక కలహాంతరిత, చెలికత్తెలతో సశోపానుతాపముగా—

వెఱ్ఱినై నేను వేఁడ్కొలు వినక త్రోసి
వేయఁగా విలక్షితుఁ డయి వెడలుప్రియునిఁ,
దాళముం బట్టి యొరులఁ దైతక్కలాడఁ
జేయు మీరు నుపేక్ష సేసితిరి గదరె! ౨౦

ఒక కామిని, సఖురాలితో—

పొసఁగి కనినంతఁ గనువిందు లొసఁగువాఁడు,
మృదుకరస్పర్శమునన నిర్వృతికరుండు,
లలితుఁడు, కలానిధి, ప్రియుండు లభ్యపడఁడు,
చాల కోరుకొన్నను మదిఁ జంద్రుఁడటులు. ౨౧

కాలము సర్వంకషము సుమా.— అని వెలికి ప్రతిపాదించుచు ఒకమించుబోఁడి, — నదియొడ్డున మన సంకేతస్థానమున కీనాడు భంగము వాటిల్లినది సుమా! — అని ఆంతర్యముగా ఉపపతికి తెలివచ్చునట్లుగా—

నలని తేంట్లు వ్రాలఁగ వంగి నలువు గొలుపు
మంజరులతోడి మంజులవంజుళములు
కాలవశమున నీనాఁడు కళలు దప్పి
వట్టి మొద్దులైనవి నదిగట్టునందు. ౨౨

అస్థిరస్నేహుఁడైన జతగానివలన ఉద్విగ్నయై ఒకమృగేంద్రావలగ్న, వాడు వినుచుండగా తన మాతులానితో—

చూపునం బడి యంతలో రూపు మాయు
స్వప్ననిధిలాభమునవలెఁ, జాల పొసఁగి
చిరము నిలువని ప్రేమచేఁ జివికి కుంది
మడఁగి యడఁగుచుంటిమిగదే మాతులాని! ౨౩

ధూర్తుడగుటచేత అచిరకాలముననే క్రమముగా చిక్కబడిన ప్రణయముతో పడమద మవుచున్న నాయికను బోధించుచు, సఖురాలు అన్యాపదేశముగా —

ప్రకృతిసరల మయ్యును దాసి స్వగుణమందుఁ
బడుశరమ్మును దవ్వులఁ బడెడునట్లు
నెట్టివేయును బలువిల్లు; నిలుచునొకొ —
వక్ర ఋజుకమ్ములకుఁ బొత్తు పడి చిరమ్ము? ౨౮

ఒక కులటుజవరాలి కుచకలశప్రదేశములో విశ్రాంతమైన నల్లని నూగారుతీగను చూచి అభిలాష పుట్టి, రసికు డొకడు సహచరునితో —

తొలుత వామనక్రమమున నొలసి, పిదప
బలిసి, పేరిమిఁ బెరిగిన వెలఁదిమిన్న
చన్నుఁగవ, బలిబంధముం జలుపు మెలపుఁ
దెలిపె మధుమథనుఁడువోలెఁ దేజరిల్లి. ౨౯

సుగుణాలబరిణ అయినను కట్టుకొన్న యిల్లాలిని మఱొక సంటుకత్తె మీది తీపివలన ఆర్తిని గూల ద్రోయుచున్న ధూర్తనాయకుని నిందించుచు నాయికాసఖి తనవయస్యతో —

కొనకొని మాలతీకుసుమగుచ్ఛములం దల మూడ్చి యూడ్చినం
తనె పని దీఱె నిర్వృతిఁ గొనం గలిగెం జలికాల మంచు నె
మ్మనమున నెంచగాఁ జనకుమా, గుణహీనములైన మొల్లవా
నలను గూడఁ బెంపవలె నాటి నిరూఢ సమృద్ధ సంపదన్. ౩౦

జవ్వనము ఉడిగి చనులు జాఱిపోయిన ఒకతెఱవను చూచి, చతురుడొకడు సహచరునితో —

బలిసి బటువులై, బిగువులై, కొలదిగాక,
వ్రణకిణమ్ముల నిండి, శోభలను బెరసి,
తమవనిం దీర్చుకొన్నట్టి స్తనముల కిటు
పతనమును రమణీయమే భటులకటులు, ౩౧

తనమాటలు వినుచున్న ఒక కామినిని తనవచనచాతుర్యముచేత లోఁబఱుచుకొన నెంచి ప్రౌఢుఁడొకఁడు, కుచవర్ణనమును ప్రాస్తావికముగా కల్పించుకొని—

పరిమళానసుఖంకరములు, గురుకములు, వి
వరము లీవు, సలక్షణాభరణము, లస
మములు, చనులు కావ్యాలాపకములువోలె,
నెవనియెద కెక్కి సరసత మివులఁ బోవు? ౨౮

ఒకనాయిక వినునట్లుగా రసికుఁడొకఁడు సహచరునితో—

సఖుఁడు కౌఁగిటఁ గొనుతఱి సకియలు తమ
చనులయెడనుండి యెడలింత్రు సరము లెల్ల;
గుణిగణమ్ము సమర్పితగుణమయయ్యు
నొందు నొకొక్కతఱిఁ జులుకందనమ్ము. ౨౯

అభిలషితపురుషుని కోసము పరితపించుచున్న ఒక కామిని, చెలికత్తెతో—

మదవతీ! యీ దరిద్రపు మదనవహ్ని
ప్రకృతి వివరీత మైనది; క్రమము గాదు;
నీరసమ్ములలోఁ జొచ్చి నీల్గి యాఱు,
సరసములలోన నెలకొని సరగ మండు. ౩౦

అన్యాసక్తుఁడైన నాయకుని ప్రణయభంగమును తెలియఁబఱుచుచు ఒక నాయిక, మాతులానితో—

మాతులీ! బహుమానసంవర్ధితము, చి
రప్రణయబద్ధమూలము, ప్రబలతరము
ప్రేమవృక్షము భగ్నమై వృథివిఁ గూలు
నపుడు చప్పుడేనియుఁ జెవి కందరాదు. ౩౧

ఎంత అనునయించినను సుముఖురాలు కాక ఇంకను బిగువు గొనుచున్న సఖురాలితో సఖురాలు సక్షేపముగా—

అడుగుల వ్రాలి వేఁడుకొన నారయవైతి వుపేక్షతోడఁ, బ్రే
ముడిఁ బ్రియు మాడుకో వినక పోసితి వ్రూరక తూరుపోఁతలం,
గడకు హతాశుఁడై యతఁడు క్రమ్మరి పోఁ గని మిన్నకుంటి, వో
పడఁతి! యిఁకెందుకోసరమె పట్టిన యీ బిగిపట్టు? చెప్పవమ్మా! 32

ఒకముగ్ధ రహస్యముగా చేయుచున్న పనిని ఒకమూల దాగి చూచుచున్న వన్నెకాడు చెలికానితో—

తుడుచు నొకపరి, నొకమారు కడిగి చూచు,
రుద్దు నొకమారు గట్టిగా ముద్దరాలు,
బిగువు చనుకట్టుపైఁ గూర్చు ప్రియుఁడు గీలు
కొలిపిన నఖక్షతమ్మును దెలియకునికి. 33

శరదవసర వర్ణనవ్యపదేశమున నదియొడ్డున సంకేతభంగము సూచించుచు ఒకచాన, సఖురాలితో—

ఉరురసమై సమున్నతపయోధరమా నడివానకారు క్రొం
బరువముపోలె దాఁటి గడవం దొలిచూలుగఁ బూచి వెల్లనై
పరగెడు నొంటి జెల్లుపువు భాసిలుచున్నది, భూమిదేవికిన్
నెరసినకొప్పులోని యొక తెల్లనివెంట్రుకవోలె, నల్లదే! 34

ప్రవాసోన్ముఖుడైన ప్రాణసఖుని నిలిపివేయుతలంపున ఒక జవ్వని వర్షాకాలమును వర్ణింప సాగినది.—

ఎచటఁ జిక్కెనో రవిబింబ, మెచట మాటు
పడెనో చంద్రుఁడు, చుక్కలెం దడఁగి రోపు
చన్నవో యని కాలంబు చదల లాఁగు
చున్నది బలాకికాపంక్తి, హారోరసటులు. 35

భయపడుచున్న ఉపపతిని ప్రోత్సాహపఱుచుటకు ఒక కామిని, ప్రబలవర్షార్భుంకారము నిట్లు వర్ణింప గడగినది.—

భోజనం బడు నవిరల వారిధార
లనిన త్రాళ్ళతో గట్టి ప్రయత్న మెసఁగ
నాకసమున కాకర్షింపలేక పుడమి
నఱచుచున్నాఁడు మేఘుఁడు తెఱచి నోరు. 3౬

ప్రియతమునియెడబాటు ఇక నాకు సహింపరానిది. — అని తెలియ జేయుచు విరహిణి ఒకతె, హృదయోపాలంభ వ్యాజముతో చెలికత్తెలు వినునట్లు—

అల్ల నాఁడు వల్లభుఁ డిడినట్టి గడువు
సమ్మతిం గాని, నేఁ డకస్మాత్తుగాఁ జి
కాకునం బడి విశ్వాసఘాతి వవుచు
నీవు పూనిన యీ పని యేమి! మనమ! 3౭

ఒకఅమ్మాయికి తెల్లవాఱుసరికి గాజులు చిట్లిపోయినవి. ఆఅమ్మాయి—చూచారా? నా గాజు లన్నియు ఇంతలోనే అప్పుడే పగిలిపోయినవి! —అని తోడివారల కందఱకు చూపెట్టసాగినది. అది చూచి ఒక నెఱజాణ నవ్వుచు మఱొక ప్రౌఢతో సాకూతముగా —

అతఁడు పగుల నొక్కెను గాజు లనుచు నెలఁత
తెలియనట్టివారికిఁ గూడఁ దెలుపుచున్న,
దీపెయే యమాయికురాలో! పాప మీమె
మగఁడుగా నున్న యతఁడే యమాయికుండో! 3౮

ఒకసుందరాంగియొక్క కపోలలావణ్యాతిశయమును చూచి తనకు పొడమిన చుంబనాభిలాషమును సరసముగా ప్రకటించుచు రసికు డొకడు సహచరునితో—

పొందుజవ్వనంపువసందు చిందు నొందు
వనిత చెక్కుటద్దాల లావణ్యరసముఁ
ద్రావుచున్నది తనివారఁ దా నధోము
ఖముగఁ జెవిలోన నిడుకొన్న కలువపూవు. 3౯

ఒకతె తనసఖురాలితో—

దూతి నంపుచుఁ గాని తేరఁ దోయజాక్షి,
యనుఁగుఁజెలువుని పేరటు గొనినయంతఁ,
బొడమి చెమ్మట నిలువెల్లఁ దడిసిపోవఁ,
దనకుఁ దా వానియింటికిఁ ద్వరగ నరిగె. ౪౦

కుసుమశరనమస్కారాపదేశమున తనభావిమరణమును సూచించి, ప్రియుని గొనిరా దొందరించుచు ఒకవిరహిణి, సఖురాండ్రు వినునట్లు—

నన్నుఁ గొట్టినబాణమే క్రన్ననఁ గాని
వల్లభునిఁ గూడఁ గొట్టెదో ప్రసవశరుఁడ!
ప్రాణములు వోసి జన్మాంతరమునఁగూడ
నీదునడుగుల నర్చింతు నిక్క మింత. ౪౧

అవయవము లింకను స్ఫుటముగా వికాసము పొందని, ఈడుకాని ఈడులో ఉన్న ఒక అతిబాలతో గమింపవలెనని ప్రయత్నించుచున్న ఒకని దుడుకుదనమును ఎట్లోకనిపెట్టి, అతని ఆ గతిక్రియాసంరంభమును కొంతకాలముదాక ఆపివేయింపవలెనని, లేదా మిక్కిలి ఉత్కంఠ పొడముసెడల, చాలజాగ్రత్తగా భద్రముగా సావధానముగా ఆమెతో *ఉత్ఫుల్లకరణవిశేషమున రమింపవలసినదిగా సూచించుటకు ఒకనెఱజాణ, గుమ్మడపై పెట్టి—

*"శిరో నిపాతో ఽర్ధ్వం జఘన ముత్ఫుల్లకమ్" అని వాత్స్యాయనుడు.

"జఘనశిరోభాగ మధస్తా చ్ఛయ్యాయాం వినిపాత్యోత్తాన మూర్ధ్వం జఘనం కుర్యాత్. అతివిస్తగణార్థ ముపర్యుపరిస్థిత హస్తపృష్ఠే త్రికభాగం వినివేశయత్. ఏవం జఘన స్యోర్ధ్వం విస్తృతత్వా దుత్ఫుల్లకము." అని తట్టీక.

ఏతావతా, తనచిఱుతెక్కలతో పైపైన మెల్లమెల్లగా ఎగురుచు దిగుచు లెస్సగా వికసింపజేసి, మధుకరము మాలతీకలికలోని రసమును చాల సున్నితముగా నేర్పుగా ఆస్వాదించునట్లు, అసమర్పితభారముగా, అతిదాక్షిణ్యముగా, అతిమృదువుగా నీవును ఆ చిన్నారిముద్దరాలిజఘనమును ఉత్ఫుల్లవిధానమున వికసింపజేసి, మృదుతరముగా రమింపవలెజుమా!—అని ధ్వని.

నీవేమియు భయపడకుము. చాల నేర్పుతో రమించి యీ నిపుణుడు నిన్ను చాల వినోదపెట్టగలడు. — అని ఒక నవవధువునకు ధైర్యముచెప్పుచు దూతిక, నాయకుని నవవధూసంభోగకౌశలమును అన్యాపదేశమున—

ఊది నిజపక్షములయందె యొడలిబరువు,
నెమ్మి రసము నాస్వాదించు నేర్పుఁ దొడిగి,
యెలమిఁ గ్రోలుచున్నది విరియించి లెస్స
మాలతీ కలికను యువమధుకరమ్ము. ౭౨

కాంతుని ప్రవాసమునకు అంతరాయము కలిగింపవలె నను తలంపున ఒక పతిపరాయణ—

మాధవునితోడఁ దమిఁ గూడిమాడి భీమ
దక్షిణానిలసూనుఁడు దక్షుఁ డగుచుఁ
దాఁకఁ దలపనితలఁపుగాఁ దల్లడిల్లి
బడలె దుర్యోధనుడువోలె బాటసారి. ౭౩

ఇంకను సరిగా యౌవనము రాని పరువులో ఉన్న భార్యతో రమించు చున్న నాయకు నుద్దేశించి చతుర యయిన ప్రణయిని ఒకతె సస్నేహాపరిహాసముగా మధుకరవ్యపదేశమున—

మాలతీకలిక రవంత మాత్రమేని
కోశదేశవికాసమ్ముఁ గొనకమున్న
రసనమాస్వాదలాలస పొసఁగి యెసఁగ
మలిసి మర్దించుంటివా? మధుపరాజ! ౭౪

మొట్టమొదట అమితమైన అనురాగమును చూపి, ప్రకృతమున మంద స్నేహముతో మెలగుచున్న నాయకుని తిరిగి అనుకూలపఱచుతలంపుతో నేరుపుగా వాని నుపాలంభించుచు ఒక గోలంబాలక—

తడవవుగాని నీవ యకృతజ్ఞుఁడవై, నినుఁ గూర్చి వచ్చుచో
గడుఁగడుఁ గ్రమ్ముచుం గురియు కాఱు మొయిళ్ళ కరుళ్ళ గోరముల్,

నడిజడివానకారునిశలందున నేమును గ్రొక్కినట్టి యా
యడుసులు కంటికద్దియిడినట్లు గనంబడుచున్న విప్లవుల్. ౪౫

తనరసికత్వమును వెల్లడించుచు నాగరకు డొకడు సహచరునితో.—

చెదర నలకలు, చెవిపోగు లదరి యూఁగ,
సరులు చిక్కులు పడఁ, బుగుపాయితెమ్మ
నెఱపుచున్న యూఁజవరాలు మెఱయుచున్న
దర్ధమాత్ర ముత్పతిత విద్యాధరివలె. ౪౬

నిజసౌభాగ్యదర్పమున కన్ను మిన్ను గానక సంచరించునొక కోడెకానిని చూచి, గుణగర్విత యయిన ఒక చాన్వంగి, సనాసూయ్యముగా, కృష్ణాపదేశమున—

యోషిదవతంసముల గుణదోషముల ప
సందుఁ దెలియదు నేసుతువేని నందతనయ!
తలకు మిగిలిన సౌభాగ్యదర్ప మెగువ
నిట్లు తిరుగుము గోష్ఠమం దెదురు లేక. ౪౭

అనునయమున బడని నాయకునకు శివనమస్కారాపదేశమున సమయోచితకార్యమును బోధించుచు ఒక మానినిసఖురాలు—

వామకరైకపల్లవము వక్షమునన్ ఘటియించి యుంచి, సం
ధ్యామనుమూర్తినిం గొలువ నాచమనాంజలిఁ గూర్చియుంట నా
ర్యామహిళామతల్లిమది రంజిలఁ జేయుఁగఁ ♦ గోశపాన ము
ద్దామతఁ బూనిన ట్లలరు దర్పకదర్పహరున్ నుతించెదన్. ౪౮

♦ నీరు పట్టుకొని ప్రమాణము చేయుట కోశపాన మనబడును. అది రెండు విధములు. మొదటిది—దేవతలనుగాని, ఉగ్రశక్తులనుగాని అర్చించి, తదుదకమును చేతిలో గొని శపథము చేయుట. రెండవది— పరగడుపుతో, పూర్వాహ్నమున, స్నాన మాచరించి, ఆర్ద్రవస్త్రములతో నిలిచి, నీరు చేతిలోనికి దీసికొని ప్రమాణము చేయుట.

సౌభాగ్యవతి యయిన దయితమీద దయితుని ప్రణయము ప్రాణావసానసమయములోఁగూడ తఱిగి పోనేరదని నిదర్శించుచు ఒక మించుబోఁడితో చెలికత్తె—

భార్య లెల్లరుఁ దనతోడ బ్రాణములను
విడువఁబూని తద్వేషముల్ దొడిగి దీన
దీనలై చుట్టు నిలువఁగాఁ, దీఱుఁగామ
పతికనుఁగవ వ్రాలెను పెద్దభార్యపైని. ౪౯

అంత జాలిగా అంత ప్రేమగా పలుకుచున్న ప్రియుని ననుగ్రహముతో గ్రహింపక, నీ వట్లు ఎందుకు అంత కోపముతో బిగువు గొందువు? అని ప్రశ్నించుచున్న మాతులానికి ఒకచాన—

అక్షరము లెల్ల నొకటియే యవునుగాక,
కలదు భేదము మాతులీ! పలుకుపలుకు
బడులలో! స్నేహమయముల ఫణితి వేఱు,
పట్టి పట్టున ననువాని ఫక్కి వేఱు. ౫౦.

వెంటబడి ఊరకే క్షమాపణ వేడుకొనుచున్న నాయకుని గని నాయిక సరోషముగా—

ఓయి మాయావి! యెదలోననుండి వచ్చు
పలుకుల తెఱంగు లవి వేఱు; తొలఁగు మవలి;
కేల యీ ప్రయాసము వితా? నాలుకకొన
నుండి వచ్చువాకుల కేమి నిండు నిచట? ౫౧

---

మొదటిది యాజ్ఞవల్క్యస్మృతిలో—

"దేవా నుగ్రాన్ సమభ్యర్చ్య తత్స్నానోదక మాహరేత్,
సంస్రావ్య పాయయే త్తస్మా జ్జలం తు ప్రసృతిత్రయమ్."

రెండవది నారద సంహితలో—

"పూర్వాహ్ణే సోపవాసస్య స్నాత స్యార్ద్రపటస్యచ,
సమూక స్యావ్యసనినః కోశపానం విధీయతే."

గోత్రోచ్చారణమున పొరపడిననాయకునితో ధీరానాయిక సవ్యంగ్యముగా—

అక్కటికమ్ము లేని కఠినాత్ముఁడవే, యిఁక నీదుపొత్తునం
దక్కలకంతి యేమి సుఖ మందఁగఁ గోరినదయ్య! నావలెం?
ద్రిక్కక యామెపే రపహరించి గ్రహించుటె గాక, దానినిం
గ్రక్కున నాకుఁ బెట్టితివిగా వలుమాఱులు ముద్దుపిల్పుతోఁ!

దీనాతిదీనదశలో నున్న ఒక ప్రోషితపతిక తనచేతులనుండి జాఱిపోవు చున్న గాజులు సవరించుకొనుచు చెలికత్తెతో నమాయికముగా—

చనవున నడుగుచుంటి ని ట్లనుఁగుఁ జెలియ!
కోపగింపక తెలుపుమా, కూర్మిప్రియుని
విరహమున నెల్లసతులకుఁ బెరుగునటవె
చేతిగాజు, లుండియొ తమచేతులందు? ౫౩

కాలవశముచేత విషమదశను పొందిన తనస్వామిని గాలదన్ని పర పురుషునిచవిలో దవిలి పిఱుతివియని యివురుబోటిని మందలించి నిరోధించి, మరల చక్కబఱచునూహతో ప్రియవయస్య, అన్యాపదేశమున ఆమెతో—

పడి మెడబంటిఱొంపి దిగఁబాఱిన వారణరాజుచుట్టు నే
డ్పుడుగక యొద్దనం దిరుగుచున్నది, లావున లేవనెత్తఁగా
దొడిఁబడ కూఁత సేసి తనతొండము సాఁచుచునున్న దాత్రినిం
బడి కడు గ్రుగ్గుచుఁ ద్విరదవల్లభ, వల్లభతానిబద్ధయై. ౫౪

ప్రియతమునిప్రణయమును నానాటికి అతిశయితస్థితికి తీసికొనివచ్చి, అమోఘమైన యానందరసమును ఆస్వాదించి అనుభవించుటకు చతురలైన గరితలంతాము సిగ్గుపడవలసిన సమయములలోగూడ తమస్నేహప్రకటనమును విస్మరింపరుసుమా!—అని సఖురాలికి బోధించుచు ఒకచతుర, పార్వతీరహో వృత్తాంతమును నిదర్శనముగా తీసికొని—

వలపురతికేళిలో వల్వఁ దొలఁచివైవ
రెండు చివురుచేతుల మూసి రెండు కనులుఁ,

గొసరి యత్రిజ ముద్దిడుకొన్న బేసి
కంటిదార బేసికంటికిఁ గలదె సవతు? ॥౫౫॥

నాగరిక డొకఁడు పాలికకుమారునితో సచతురముగా—

నవలత చేతఁ బూని చిఱునవ్వునఁ గొట్టుచు వెంట నంటు నీ క
దవులఁ దొలంగిపోక దరిదాఁపులనే వరుగెత్తి చేతికిం
దవిలెడునట్లుగా నెడుటఁ దారుచుఁ బ్రక్కల కొత్తగిల్లి మ
ఱ్ఱవ నవుచున్న,దా చెలినిఁ గొట్టుము కొంకక కాఁపుబిడ్డఁడా!

రహస్య మెఱిఁగిన రసికుఁ డొకఁడు సహచరునితో—

గుంపుగఁ గుమారిసఖురాండ్రు గూడి సారె
వెనుకముందులఁ ద్రిప్పి కు ల్కొనయుఁ జూపు
♦కృత్రిమానందపటము నీక్షింప సాగెఁ
గూర్చువిటకాఁడు చిఱునవ్వు గురియు కనుల. ॥౫౬॥

చలికాలములో కెమ్మోవి వేడిమిచేత మధూచ్ఛిష్టమును కరగించుచున్న ఒకజవ్వనిని జూపి రసికు డొకడు చమత్కారముగా చెలికానితో—

మదనపటలాపనవ్యాజ ముదటు నూవ
ద్రవణిత మధురాధరపుటమ్ముపైని నదిగొ

---

♦ప్రప్రథమముగా వరునితో సంగమముచేసిన వధువు ధరించినవస్త్రము 'ఆనందపటము' అని వ్యవహరింపబడును. తద్ద్వారా, ఆ వస్త్రమున గనబడు చిహ్నములనుబట్టి మఱునాడు మహిళామణులు వారిసంగతుల నుగుఱుతించి, పరస్పరము ఆ వస్త్రమును చూచిచూచి సంతసింతురు. అది ఆచారము. అట్లే ప్రకృత నాయికావస్త్రముకూడ ప్రదర్శింపబడినది. కాని, ఆమె అంతకు పూర్వమే సంగమసుఖము ననుభవించి యున్నది కాబట్టి,ఆనాటి ఆ ఆనందపటము యథార్థమైనది గాక కృత్రిమ మైనది. అది వా రెఱుగరు. కాని దవ్వుల నుండి చూచుచున్న విటకాడుమాత్రము అది చూచి, వాఁడమాద్ర్యమునకు నవ్వ సాగినాడు, అని భావము.

లలన యుల్లనఁ బెల్లమలాముపట్టి
వేయుచున్నది యిపురాకు వ్రేలితోడ. ౫౯

మదనకదనములో — మధ్యదేశాక్రమణము, ఊరుస్థలవసననిర్వాసనము మొదలైన పనులకు సహింపక కలగి, చికాకుపడుచున్న నాయికకును, నాయక ప్రేరితయై చెలికత్తె ప్రాసంగికముగా రత్యనుభవవిశేషములను సవిమర్శముగా బోధింప మొదలిడె —

విరివిలుకానిపోరు పిఱువీఁకు నెఱుంగని చిత్రచిత్రవై
ఖరుల సమాప్తిఁ గన్న వెనుకం జెయి కందక వల్వ, సిగ్గుదోం
తరల మునింగిపోయి ధృతిఁ దారకమున్న ప్రియుం గవుంగిటం
ద్వరఁ గొని కప్పికొంద్రు జఘనస్థలముం గులభామినీమణుల్.

అత్యుగ్రస్వభావుడును, బహుమహిళాసక్తుడు నయినప్పటికి దయితుని దనచేతిలోని కీలుబొమ్మను చేసి, అంగుళినిర్దేశముమీద ఆడించుచున్న సవతి యొక్క సౌభాగ్యమును గూర్చి అసూయపడుచు ఒకపడతి అన్యాపదేశమున—

కంటిరా కొట్టమందు వెన్నంటి నిలుచు
పోట్లయాఁబోఁతుకొమ్ములవట్లఁ గంటి
తెప్పలకు గోకుచుకు మొద వొప్పు మిగులఁ
బ్రకటపఱుచుచున్నది స్వసౌభాగ్యగరిమ. ౬౦

జారనాయకు డొకడు చెలికానితో—

పొంపిరిం బోవ రతిరసలంపటత్వ
మా మిటారి యీ పొదరింట నవినయమున
కొసఁగిన ధ్వజమ్ములట్లు రభస మొసంగ
విసరి పఱిచెను కౌసుంభవసన మిచట. ౬౧

ఒకానొక యెలనాగయొక్క అనురాగాతిశయమును వివరించి తదభియోగముకొఱకు నాయకుని తొందరించుచు దూతిక సాపదేశముగా—

ననుచు నమోఘదోహకగుణమ్మునఁ జేయుడినంతఁ జేఁపి రొ
య్యాన ముదియావునుం గడవలాడిగ దుగ్ధరసమ్ము నించుఁ; జా
వునఁ బడినంతమాత్ర మది పొంగి రసమ్ము స్నవించు మించుబోఁ
డి నిగిడిపూర్వపుణ్యము ఫలించి లభించునుజావె పుత్త్రకా! ౬౨

ఒకకులుకులాడిని చూచి నాగరికు లిరువురు ప్రశ్నోత్తరరూపముగా దమ యభిలాషమును ప్రకటపఱుచుచు—

మెల్ల మెల్లగఁ జనుచు నీ మీనసయన
పదిఁబది వెను జూచుకొనుచున్నది యి దేల?
కొమరుపిఱుఁదులపైఁ గొనగోటిగంట్లు
నొఱయుచున్నది యొడ్డాణ మురక కంటె? ౬౩

ఖండితానాయిక, నాయకునితో—

♦అలరి సంవాహనసుఖరసానుభూతి
కతన నీ కరయుగళి లాక్షాప్రపూరి
తమ్ముఁ జేయు నా శ్యామపదమ్ము విక్ర
మార్కవిభునిచరిత్రమ్ము ననువదించె. ౬౪

---

♦ ఈ గాథ మూలములో—

“ సంబాహణ సుహరస తోసిఏణ దేన్తేణ తుహ కరే లక్ఖమ్,
చలణేణ విక్కమాఇత్త చరిఅం అణుసిక్ఖిఅం తిస్సా. ”

అని గ్రథింపబడి ఉన్నది. ‘సంబాహణ’ శబ్దమునకు ‘సంవాహన’ అని; ‘సంబాధన’ అని; ‘లక్ఖమ్’ అనగా ‘లాక్షామ్’ అని, ‘లక్షమ్’ అని సంస్కృతార్థములు సిద్ధించుచున్నవి. వానిని బట్టి ఈగాథలో ఈఅభిప్రాయమును తెలిసికొనవలెను.—

“భయంకరములైన సంగ్రామ రంగములలో నెనుదీయక విజృంభించి, విక్రమించి, శత్రువులను సంబాధించి జయించిన భృత్యులకు విక్రమార్క నరేంద్రుడు ఒక్కొక్కభృత్యుని చేతులం లక్షలకొలఁది నాణెములం బహుమానముగా ఇచ్చి నింపివేసి, సంతోషము గూర్చువాడు. అట్లే నీవుకూడ

క్షిప్రప్రసాదసుముఖి యగుచున్న నాయికను సంభావింప గలది తత్సఖి ఆమెతో —

చరణములంటి మ్రొక్కి, సహసా పరిరంభసుఖం గదించి, వా
తెరతలిరాకు ముద్దుగొని, దీనత వేఁడి, కరంచు టాదిగాఁ
బ్రారయు మహాసుఖమ్ములకు బాత్రుగ నవ్వయిపోతివే కదా,
తరుణిరొ! చూపుమాత్రన ముదంపడి పూని ప్రసన్న భావముల్!

కినిసిన ప్రియురాలి ననునయించుచు నాయకుడు —

కలికి! ననుం బ్రసాదసుముఖత్వముతో నివు డేలుకొమ్ము; కా
వలసినయవ్వి యెల్ల సులభంబులు నూవె యమర్షరోషముల్;
కలువలచెల్మికాని కను గందని వెన్నెలపాల వెల్లితోఁ
దలకొని యుజ్జ్వలమ్ము క్షణదాక్షణ మేగుచు నున్న దూరకే.

గాథాకోశకారప్రశంస —

---

చక్కగా మెత్తగా తీపులు పోవునట్లుగా తీరికగా సావధానముగా ఒత్తుట చేత చాల హాయి పొంది, ఆమెపాదము నీకు బహుమానముగా నీచేతులలో లాక్షారసము నింపివైచినది. అవిగో, ఆ గుర్తులు కనబడుచునే ఉన్నవి గదా!'' అని.

“ఏతావతా, నిన్ను నమ్మి అనువర్తించుచున్న నన్ను వదలి, మోసగించి, ఆమెదగ్గఱకు పోయి, రాజసేవకుడువలె సభయముగా మెలగి, ఆమెపాదములు పిసికి, చెమటలు పోసి, ఆమె చెంత అవు ననిపించుకొని వచ్చుట; అంత మాత్రముననే పొంగిపోయి, నీవు నిన్ను అధికునిగా తలపోసికొని తిరుగుట; అంతయు నేను తెలిసికొనుచునే ఉన్నాను. అడుగులు ఒత్తినందుకు నీకు దక్కుచు ఉన్నకూలి ఆమె కాళ్ళ పారాణియే గడ!'' అని నాయిక, నాయకుని సాకూతముగా ఎత్తిపొడిచి, తెగడనాడుట గాథలో ధ్వనితము.

♦తిప్పలీనిన కులముల నొప్పు పెరిమ
నుద్ధరింప నేర్చినవార లొక యిరువురె;
గిరిజకూరుచుమగఁ డొండెఁ, గీర్తిశాలి
శాలివాహన జనపాల మౌలి యుండె. ౬౭

క్రూరులవశమున నున్న ఒకజవరాలి నభిలషించి, ప్రయత్నించుచున్న నాయకుని వల దని వారించుచు దూతిక, అన్యాపదేశముగా—

కాండమే లేమి నారోహ కార్యమునకు
వలనుపడని పాటలి నెక్కఁ దలఁపుఁ గొనఁగ
నుడుగుమా పుత్త్రి! యెవ్వారిఁ బుడమిఁ గూలఁ
ద్రోయ దెక్కినయంత నీ దుష్టజాతి ? ౬౮

నీకుమారుడు గ్రామాధికారిభార్యపైన నురులుగొని మగలకున్నాడు. కొంచెము మందలింపు,— మని దీనముగా సవినయముగా సూచించుచు కోడలు అత్తగారితో—

ఊరిలో నెల్ల మునసబుగారిదొడ్డి
యందుమాత్రమే పాటలి యమరియుండ,
నత్తయా! మీ కుమారునియుత్తమాంగ
మిటులు బహులపాటల మయి యెట్టు లొప్పె? ౬౯

---

♦ఈ పద్యము మూల ప్రాకృత గాథలోని— "ఆవణ్ణాఇం, కులాఇం" పదములకు, "ఆపణ్ణాని కులాని" (ఆపణ్ణాని = అపర్ణాసంబంధీని) అని, "ఆపన్నాని కులాని" (ఆపన్నాని = విపద్గ్రస్తాని) అని సంస్కృతార్థములు లభించుచున్నవి. తదనుగుణముగా తెలుగుపద్యములో— "తిప్పలు = కొండలు, విపత్తులు" అని ఉభయార్థద్యోతకమైన పదము కూర్పబడినది.

అతిదరిద్రావస్థలో నున్న పాలితునివంటి ఒకానొకకవి యీగాథను సంగ్రహించి, కవివత్సలుని ఆశ్రయమునకు పాత్రుడై, తదంకితము చేసి ఖండ వచ్చునని, కవివత్సలుడే తనకవివత్సలత్వమును లోకములో ప్రతిజ్ఞాపూర్వకముగా చాటఁబంచెనని; ఈగాథను బట్టి కొందఱు విమర్శకుల అభిప్రాయము.

ఒకవామాక్షియొక్క కటాక్షదాక్షిణ్యమును, సహజానురాగగుణమును ప్రకటించి నాయకుని లోభపెట్టుచు, దూతిక—

మెలపునఁ బక్ష్మలించి, మగమీలబెడంగులఁ దోఁగి సాగి, వీ
నులకొన లంటి మోహన మనోహర లోల వినీల తారకాం
చలముల నేలు వాల్గనులు చానలమిన్నల కెల్ల నింతగాఁ
గల, వెఱుఁగంగ నేర వవి కమ్రవిలోకనవిభ్రమమ్ములన్. ౨౦

గాథాకోశ గ్రథకుని ప్రశంసించుచు ఒక కవి—

చటుల రణమేఘసమయ భీ చలిత విహ్వ
ల స్వపక్షుల్ విపక్షు లెల్లఁ బరిశేషి
తేనపద్మాశలఁ బడి నీ మానసమ్ము
ననుసరించుచు నున్నవా రంచలట్టుల. ౨౧

ఒకపతిపరాయణయొక్క సచ్చరిత్రమును వివరించి, నీ ప్రయత్నము మాను మని హెచ్చరించుచు, దూతిక, నాయకునితో—

ఏయదియేనిఁ గావలయునే? జతనింతయు చెప్పు మింత సి
గ్గా! యని గ్రుచ్చి గ్రుచ్చి యడుగన్, హృదయేశునికష్టజీవనం
బాయము నెంచి, చిన్ననగ వల్లన నవ్వుచు సారె మంచినీ
రే యని పల్కె దుర్గతగృహేందిర, దోహదమోహనాంగియై.

అట్టి దృశ్య మొకప్పుడు కన్నారఁ జూచి యున్న వన్నెకాఁ డొకడు తన నేస్తకానితో—

విరికెందామరరేకులై తెలిగనుల్ వెగ్గొంద, నార్ద్రాంశుకాం
తరభాస్వజ్జఘనంబు స్పష్టరుచు లీనన్, గ్రీష్మమధ్యాహ్నవే
ళ తసోత్సిక్తత స్నానమాడుజవరాండ్రం గూర్చి క్రొవ్వాఁడి పూ
విరివి లెక్కిడఁబోఁడు చేతఁ గొని పూవిల్కాఁడు నుద్యోగియై.

గట్టి అనుభవము గల విటు డొకడు, సఖునితో—

ఎంద అవశిష్టులో, యెంద ఱింక ఖండి
తవ్రతులు గారొ, యెందఱిధనము దోయ
పలయునో, లెక్క వెట్టు గీతలనుబోలె,
నొడలఁ దాల్తురు గోటిగంట్లాడమె చెలులు. ౨౪

చాలకాలమునకు ప్రవాసమునుండి మరలివచ్చిన ప్రియునకు ప్రియురాలు, విరహసమయములలో తా ననుభవించిన తీవ్రవేదనాతిశయమును చతురతతో తెలియఁజఱచుచు—

నిండువిరహాభ్రతోఁ దటిగొండతోడఁ
బోలెఁ, దఱచి నెమ్మనమును బాలవెల్లి
నట్టు, లున్మూలితము లయ్యె నకట! మాదు
సౌఖ్యములు రత్నములువోలె జవము మివుల. ౨౫

సఖురాలితో ఒక తలోదరి—

సరలరతమునఁ గొనఁబోఁడు సంతసమ్ము,
విరలరతమున సంశయవిధురుఁ డగును,
సకియ! ప్రియునకుఁ బ్రియమును జాల కూర్చి
పొసఁగు టెట్టులో యిసుమంత బోధపడదు. ౨౬

నాయికయొక్క సురతచతురతను ప్రకటించి చెలికత్తె, అన్యథా శంకించు నాయకునితో—

సరసకలావిలాసరససంతతమై బహుళప్రబంధసుం
దర మగు సారతాగమమునన్ జవరాండ్రకు నొక్కరొజ్జయుం
బరగునె? లెస్స నేరిచినవారల చెల్మి రవంత యబ్బినన్
సరసత మున్ను నేర్వనివి సైతమునుం బ్రతివాఁడు నేరుచున్. ౨౭

ఒకానొకని అసాధారణ సౌందర్యాతిశయమును వినిపించి, వానితోడి కూటమికి ఒక మించుబోడిని ప్రోత్సహించుచు దూతిక—

మధురగుణాదివర్ణనముమాత్ర వశీకృతమైన యంగముల్
విధురములై మరుగ్గోని తపించుచు నుంటివిగాని చూడ నా
మధురమనోజ్ఞమూర్తి, యిది మాటికిమిక్కుటము; చూపుఁగొన్న నే
విధమున నిల్వ నేర్చుఁ దమ వెంట నె స్వస్థములై యదంగముల్?

నిజమునకు నీకు నేను చెప్పలేనంతగా వశుడనై పోయినాను: నీవు నా ఆరాధ్య ప్రణయలక్ష్మీ మూర్తివి. నీవు వినా నాకు మఱొక ప్రపంచము లేదు. అందువలన నిన్ను ఎన్నడు నేవిధముగా కనీసము మనస్సుతోనైన పరాభవించుట నాకు చేతగానిది.—అని యేమేమో చాటువాక్యములు పలుకుచున్న నాయకునితో నాయిక— చాలులే! ఇక నాకు చెప్పకు. ఈ చిలుకచదువు లన్నియు పంజరములోనున్నప్పుడే. యథార్థముగా మగవారికి ఎదుటిహృదయ ముతోఁ బని లేదు. ముమ్మాటికి వారు స్వార్థపరాధీనులు.— అని నిరూపించుచు, నిదర్శనరూపముగా—

> పెండ్లిరోజు డాయఁగఁ గ్రొత్త పెండ్లికూఁతుఁ
> గూడిచూడు వేడుక నుబ్బియాడు పెండ్లి
> కొడుకు నెదలోన నిలువదు కొంచెమేని
> మొదటియిల్లాలిరతిలోని ముద్దు మురువు. ౭౯

అనురాగావిష్టుడైన ఒకడు ప్రియవయస్యునితో—

మూఁకలు గట్టి మూఁడు నొక మూకుడు లేక జగమ్ము తిట్టునుం
గాక, యమంగళం బగునుగాక, నెఱిఁ మరియాద మీఱునుం
గాక, మఱేమియైన నగుఁగాక, రజస్వలఁ గాంచుకర్జ మ
స్తోకసుఖానుభూతి మనసుఁ వికసింపఁగఁజేయు నెంతయుఁ.౮౦

తప్పు. అట్లు దగ్గఱకు రాగూడదు.—అని ఎంత చెప్పినను వినక, రాగాతిశయముతో ఉపసరించుచున్న మనోహరుని జూచి ఒక పుష్పవతి, సోపాలంభముగా—

తలఁపున నీకుఁ బుష్పవతిఁ దాఁకఁగఁ గోరిక లేకయున్న చో
వల దని చెప్పినఁ వినక పట్టున నట్టులె ప్రేమాల మోడితో

నిలిచెద వేల? కా దటులు, నిల్వఁగ నేరక మా కరమ్ము లే
పులుకునఁ బాఱిపచ్చి నిసు ముట్టుకొనం బయిపైని దూఁకెలే!

ఒక ప్రోషితపతికయొక్క చెలికత్తె, ఒకబాటసారిద్వారా తత్పతికి కబురు పంపుచు సోపాలంభముగా—

కనుకను పొసంగమిఁక నయనకోకనదమ్ములు కెంపువాఱి క్ర
మ్మినను వెచ్చబాష్పముల మిక్కిలి పొక్కఁగఁ బావమా విశా
లనయన, మోఘమండనవిలక్షణమిత్తుల ప్రాఁగ్గి సిగ్గునొం
దును దన చెల్మికత్తెలఁగనుంగొనసైన ననుంగు నెయ్యుఁడా! ౧౨

చూలుబరువున అస్సురుస్సురు పడుచున్న సఖిని జూచి, సఖురాలు మఱొకసఖురాలితో పరియాచకముగా—

నిండుచూలుబర్వును మోయుచుండి సైత
మంతగా బాధపడ దింతి స్వాంతమందు,
మరల నొకమాఱు విపరీతసురతసుఖముఁ
బడయ నేరమి దయితునివయినిఁబోలె. ౧౩

నాయికానురాగమును వెల్లడించి, నాయకు నుల్లాసపఱుప, దూతి, స్వాభావికముగా—

మంజులమైన నీదు సుకుమారమనోహరరూపరేఖ దృ
క్కంజదలాల కంది సరిగాఁ గనరామి, జనాపవాదభీ
తిం జలియింపఁ బోక, ధృతిఁ దేఱుచుఁ, బెద్దలలెక్క లేక, యా
కంజదళాక్షి వెన్దిరిగి కన్నుల నీ రుదలించె నెంతయుం. ౧౪

ప్రోషితపతికయో, తత్సఖియో, లేఖముఖమున నాయకునిగూర్చి—

నెమ్మనమందు నెమ్మనము, నీముఖచంద్రునిపైనిఁ జూపు, చి
త్రమ్మున వ్రాసినట్లు నిశాంత మ్మయి లెస్సగ నిల్చిపోయె; దూ

ర మ్మయిపోయి గాఢపరిరంభసుఖమ్ముల కెల్లఁ గోమలాం
గమ్ములు వాడి వత్తులయి గాడ్పడఁజొచ్చినవోయి నెయ్యుఁడా!

చెలువుని దీసికొనిరా తొందరపెట్టుచు ప్రోషితపతిక,—

విరహమున వాడి వరుగైతి, విరహవహ్ని
సైచుకోలేది గాఁబోదు, చంచలము బ్రదుకు,
ఏమి చెప్పఁగావలె సకి! యింకమీఁద?
నీవ యెఱుఁగుదు కర్జముత్రోవ లెస్స. ౮౬

దూతిక నాయకునితో—

సైపఁగ రాని నీ విరహజాగరదోషము దుర్నివారమై
పాపము! నీదుచూపు నొక స్వప్నమునందును నేనిఁ గూర్పఁబో
దాపుపుజోడికిఁ; వెలలునశ్రుజలమ్ముల వేఁడివెల్లువల్
పోవయి యుత్తటిం ద్విపవిలోకవినోదముఁ గూడఁ బాపెరా!

ఒక నాయిక, దూతికతో—

కొలదియెుగొప్పయో యెదియెుకొండొకదోసముకారణమ్ముగా
నలిగినవాఁడు కొంతవడి కాయుతిఁ బూనుఁ బ్రసన్నభావముం,
దొలఁగని ద్వేష రోషమయ దోషముతో బిగఁదీసికొన్న చం
చలుని తెఱం గెఱింగియుఁ బ్రసన్నతకుం గొనితెచ్చుటెట్టులో!

బాహ్యోపచారచాతుర్యముతో అన్యనాయికాసక్తిని కప్పిపుచ్చుకొనుచున్న నాయకునితో నాయిక, సోపాలంభముగా—

కపటివి గాక యిచ్చటనె కన్నులలోన మెలంగుచుంటి, వ
చ్చవువిరి తేనియల్ గురియుబాలునఁ బల్కుచు నుంటి వీవు, నె
య్యపుకళయింతమాత్రమకదా! హృదయమ్మనువిప్పిపుచ్చి యో
యిపోటుపు నెయ్యపుంబ్రియుఁడ యెవ్వని కెవ్వఁడుచూపుఁ జెప్పుమా

స్వల్పలాభమునకే గర్వించి, ఒడలు మఱచు దుర్జనులవలన చేర్చుకొన వలసిననీతిని అపదేశముగా తీసికొని ఉపదేశించుచు ఒకనాయిక, దూతికతో-

నిండ జీవనమును బొంది, సిగిడి మొగము
లూర్ధ్వముగ నుంత్రు; జీవన ముడిగి రిత్త
పోవ, వినమింతు రలుపులు; పుడమిలోన
గుంటయేతాముదూలవుఁ గుండలట్లు. ౯౦

కలానిధికలాకలాపవైభవముచేత దిగ్దిగంతములు ధవలితపర్యంతములు కాగా, ప్రియతమసమాగమవంచితయయి ఒకకృష్ణాభిసారికసవిచారముగా—

చెలిమికాంద్రసంగాతముల్ చెఱుచు సాంద్ర
చంద్రికారస మాకాశసరసి నెంత
ప్రబలి యున్నదో, చంద్రకిరణమహాంబు
పాతములనుండి వడుచును తట్టిపోదు. ౯౧

నాయకునితో దూతిక—

నవయువసుసంకులంబైన నగరిలోన
నిన్నె వెదకుచు, నీయూవు నియతిఁ గోరి,
పావ మాపిల్లమెత్తనిచూపు కలఁగి,
యుగ్రవనినట్లు భ్రమియించుచున్నదోయి! ౯౨

ప్రోషితపతికయొక్క విరహవ్యథావిధురత్వమును తత్ప్రియతమునకు ఒకానొకనిద్వారా కబురు పంపుచు దూతిక—

కూర్చువతితోడి విరహానఁ గుమిలి యుడుకు
కోడ లడుగులకుఁ బ్రొక్కఁ గోరి వంగ,
రెండుచేతుల గాజులు రెండు జాఱి
పడుడు, నధికకోపన యయ్యె వగచె నత్త. ౯౩

ప్రవాసమున కుద్యుక్తుడైన పతిని నిలిపివేయు నుద్దేశముతో తత్ప్రియురాలు, దుర్భరముగా ఉన్న వేసవియెండను వర్ణింప దొడగి—

తపనుని వేయిచేతులును దాఁకఁగ మంటలు నుండిపోయి గో
రపు నడిప్రొద్దు వేసవి నరణ్యములోఁ బరితప్తమైన పా
దపనివహమ్ము తూలి బహుధా విలపింపఁ దొడంగినట్టు లా
తపమునఁ దోఁచె ఝిల్లికల తారరవమ్ములతోడఁ బెద్దగాన్.

కమలవనములో దత్తసంకేతమై అచటికి పోయి నేను నీచే వంచింపబడితి నని నాయకుడు వినునట్లు నాయిక యొకతె—

మధురమధులోభమునఁ జేరి ప్రథమవదని
లీన మధుపఝంకార విలీన జనము
కమలవనము వికాసముఁ గనఁ దొడఁగె
బాలరవికరంబు లోఁగిఁ జుంబనముఁ గొనఁగ. ౯౫

మానినీమానాపనోదనమునకు నాయకుని తొందరించుచు దూతిక వాని చెలికానితో—

ప్రియతముని నోటిమీఁదుగ వినుటఁ జేసి
మాఱుపేరును, గలఁగినమనసుతోడి
మెఱుఁగుబోఁడియలంకృతి మెఱయ సాగె,
వధ్యమహిషమ్ముకై సేఁతవగిదిఁ; గంటె? ౯౬

ప్రియతముని త్వరగా గొనిరా చెలికత్తెను తొందరించు తలంపున ఒక విరహిణి తన దుర్భగవిషమవిగహవేదనాభరమును నేర్పున వివరింప సాగి —

మలయపవనమ్ము చలమేలి మలయఁ దొడఁగె,
నింటిముంగిట నడు గిడ నీయ దత్త!
పుష్పితాంకోట పరిమళమ్మునకు నేని
బడలి మడిసినాతఁడుఁ గూడ మడిసినతఁడె. ౯౭

ఈ జవరాలు పతిపరాయణ. ఆ అలంపుగల ప్రణయాతిశయ మసాధారణము. — అని నిరూపించుచు దూతిక, ఒక కాముకునితో—

అనుఁగుఁబ్రియుండు కూర్చుప్రియురాలిముఖామృతరోచిపై నిని
ల్పును దనకన్నుఁగల్వలను, బూవిరిబోడియు వానిదర్శన
మ్మున నిజదేహమే మఱచుఁ; బొందికృతార్థత నంతమాత్ర న
ల్లన మహి నెంచువా రమహిలాపురుషన్వలె వార లిర్వురున్.

కుశలమా? అని ఒక సుమకోమలాంగి ప్రశ్నింపగా ప్రోషితపతిక—

సేమ మెట్లుగఁ బొసఁగును? సేమమె సుమి
యింటిముంగిట నున్నయా కుంటిమావి
చెట్టు; పుట్టె నద్దానికిఁ జిట్టచివరి
కొనకు నొక యనర్థపు నిప్పుకణిక గూడ. ౯౯

ప్రవాసోన్ముఖుడైన నాయకుని ప్రయాణమును ఆపివేయు తలంపున నాయికాసఖి నాయకునితో, మాటలవరుసలో ఒక ప్రవాసోన్ముఖుని చరిత్రమును వర్ణించునెపమున—

పోయివత్తు నన్నంత విచ్ఛాయమైన
యనుఁగునిల్లాలి మొగమును గనులఁ జూచి,
దుఃఖభరనిగడితుఁడు పాంథుఁడు తలంపఁ
డయ్యె నింటివెల్పల నొక్క యడుగు నిడఁగ. ౧౦౦

రసిక మనో మిళింద నికరమ్ముల ర మ్మని యాగళమ్ముగా
రసములు జాలువాఱ మధురమ్మగు విందులు వెట్టి, పేర్మి హె
చ్చ, సుకవివత్సలప్రముఖ సత్కవి నిర్మిత గాథలం గృతా
ర్థసమయు మైన పంచమశతమ్ము సమాప్తిని బొందెఁబొందికన్.

పాలితసత్కవిత్వ కవివత్సల పాలిత పాలితాది సం
లాలితమైన గాథలకలారసవాటికలో రసాలముల్

జాలునఁ డేనియల్ గురియఁజాలిన యైదవు కోటి యద్ది, యా
లీలఁ గొనెన్ నృసింహకవిలేఖినిలోఁ గమనీయవైఖరిన్. ౧౦౨

సరసతరము గాథాసప్తశతకమందు
నైదవు శతక మతిమనోహరము ముగిసె;
నద్ది చెవిదారిఁ బడినంత, నెడఁదలోనఁ
జొర దమృతమేని మధురతా గరిమఁ జేసి.. ౧౦౩

# అ మ రు శ త క ము

ఒక కామిని తనచెలికత్తెతో సనిర్వేదముగా—

సూదిలో రోఁకలిఁ దూర్చి సురియ నాడి
యాడు పాదులోకవుపీడ కడలి చూచు
కొనఁగ నోచనైతి నొకయూరన వసించు
ననుఁగుఁజెలువుని విప్పినకనులనిండ. ౧

పగ పుడుగు మని బోధించు వయస్యతో ప్రవత్స్యత్పతిక—

నెచ్చెలీ! నీకు మ్రొక్కెద, నేఁడుమాత్ర
నన్ను నడ్డగింపకుమా; మనఃప్రియుండు
నెల్లి ప్రొద్దుపొడ్పున దూర మేగినంత
నేగకుందునొ నేనును నేడ్వకుందు. ౨

నేర్పుకత్తె లయిన యువతులు గోప్యవిషయమునుఁగూడ తగిననేర్పుతో సరసముగా సూచింతురు. — అని చెలికి బోధించుచు చతుర యయిన ఒక చెలికత్తె—

కూర్చుచెలువుఁడు చేర రాఁ గోరినంతఁ
బైటచెఱఁగున జఘన మిబ్బడిగఁ గప్పి
కొనుచు సిగ్గునఁ దల వంచి కొమ్మమిన్న
నవ్వెఁ గెమ్మోవి మొలుచు చిన్నారినవ్వు. 3

కాముకు డొకడు ఒక కామినిని కామించి, కటాక్షచ్ఛటావర్ణనవ్యాజమున ఆమెకు తనయభిలాషమును వెల్లడించుచు—

బెరసి పర్యంతరక్తమై విషమమైన
భ్రూలతాచాప నిర్గతామోఘ వేగ

లసిత నిశితార్ధనయనభల్లమ్ము చేతఁ
బట్టి పల్లార్చ వెవ్వాని బలిమి? ముగ్ధ! ౪

నాయికానురాగమును ప్రకటించి, తద్విభోగముకోసము ఉపపతిని ప్రోత్సాహపఱచుచు దూతిక —

నిన్నుఁ గనుగొనుకుతుకమ్ము నిగుడ నీ యె
లుంగు విని వీనువిందుగ లోలనయన
వెలికి నిడినన్ని యడుగులు వెండి యొరులు
నెఱవవలసిన వయ్యెను నీవు చనుడు. ౫

నీతనూలత అంత కంత కిట్లు కృశించి పోవుచున్న దేల? అని మాతులాని యడుగగా, తన్వి ఒకరిత —

నెఱవ కీసు మచ్చరమేని, నిర్వికార
మైన కన్నులతో మాతులాని! కూర్చు
జనము నన్ను సాధారణజనమునట్లు
చూచుచున్నది, చిక్కి కేసారిది నుందు? ౬

కన్నకూతునకు ఏపాటి సౌభాగ్యచిహ్నము కనిపించినను కన్నతల్లి యుల్లాసమునకు మితి ఉండదు.— అని బోధించుచు ఒకతె ఒక సహృదయునితో—

తొలఁగిపో గాలికిం జీర, దుహితతొడల
పయినిఁ గనబడు పంటిగం ట్లోయిదిఁ జూచి,
తల్లి యుల్లాసపడె, భూమిఁ ద్రవ్వనతఁడు
ధనపుబిందెలయుంచులు గనుగొనివలె. ౭

తనప్రణయాతిశయమును వెల్లడించి పల్లవాధరి ఒకరిత, సార్వకాలిక స్నేహమున నెడగలుగకుండ మెలగ ప్రియతముని ప్రార్థించె.—

నిలిచి మెలంగుచుంటి విటు నెమ్మదిలో, నెవు డెట్టి మన్యువుం
దలఁపవు నీవు; కాని మహితప్రణయాతిశయమ్ముతోఁ బ్రవ

_త్రిలఁ గల మేము నీయెడ నధీరలమై యబలాస్వభావభీ
రుల మయి సందియమ్ముల నిరూపణసేయుచునుందు మెప్పుడున్

నిజప్రణయాతిశయమును బ్రకటించి, భార్యాపరతంత్రుడైన తననంటు కానిని సాక్షాత్తుగా నిందించుచు కామిని యొకతె, నిజహృదయామంత్రణ వ్యాజమున—

హృదయమా! దుఃఖమాత్రానఁ బ్రిదులఁబోకు,
ముందు నున్నది నీ వింకఁ బొందఁగలది;
పరులకిల్లాకుఁబంటును బట్టి తివిలి
యుడుగ కారయు నీ కిది యొక్క లెక్క? ౯

వృథానుగాగపతిస్సైన నాప్రణయము నభినందింపక త్రోసివేసి, విరక్తురాలైన మఱొక జవరాలిపై మక్కువం గొని, తిరుగుచున్నావులె; —మ్మని నాయకుని నిందించుచు సుందరి ఒకతె, సవైదగ్ధ్యముగా—

నిన్ను నెంతయు ద్వేషించు నెలఁతమిన్న
నీకుఁ బ్రాణాధికప్రియ యిక్క మనుచు
లెస్స తెలిసియుఁ గొన నీను లేశమేని
మాయదారిప్రేమముపయిం బ్రాణములుండ! ౧౦

మఱొకజవరాలిగుణాదులను ఊరక పొడిగించి పొగడుచున్న మగనిని గనుగొని మగువ ఈసున—

మేలిసుగుణాలపేటి యందాలబరిణ
యామె నిక్కము; నిర్గుణ నాదు నేను;
నామెతోఁ బోలనట్టివా రంద ఱింక
నడఁగి పోవలెనా యేమి? నాదువుమయ్య! ౧౧

లజ్జావ్యతిక్రమమును నివారించునిమిత్తము క్రొత్తకోడలికి నీతి గఱపుచు అత్త తన కొడుకు నుద్దేశించి—

ఇంటిలో మంచిచెడ్డలు, సంటుకొనెడు
కష్టసుఖములు గుర్తెఱుఁగంగలారె
మహిల లన్నఁ; దక్కినవారు మగలమెడల
నులిమి యిడు దుర్గాఢాకినులు కుమార! ౧౨

కులాంగనలు మానమువలంబించినసమయమున మెలఁగు మెలఁపును తెలియ బలుకుచు వయసు ముదిరిన సఖి తనసఖితో—

మొలకనవ్వులచే నొవ్వఁ బలుకుటలును,
బూసికొనునూఁడిగములచే రోసములును,
గంటినీటిచుక్కలచేతఁ గలహములును,
బొసఁగు మహిలామణుల కల్క పొడమినపుడు. ౧౩

లోకాపవాదమునకు వెఱచి అతడు నీతో మాటాడ మానినాడు గాని మఱొండు గాదు. నీ విం కేమియు శంకింపకు, మని సాంత్వనవచనములు పలుకుచున్న దూతికతో నాతి యొక్కతె సప్రణయరోషముగా—

కూడదు లోకధర్మమునకుఁ సువిరుద్ధము సు మ్మటంచు మా
టాడక నోరు కట్టుకొని యుక్తి తొలంగునుగాక, చెప్పు మె
వ్వాఁడు విరోధివర్గమునవాఁ డగుఁ బో యెదురైనవానిపైఁ
జూడికి నేనియుం బఱపుసుద్ది యెఱుంగక యుండ నేరుచుఁ? ౧౪

కట్టుకొనిన భార్యవలన ప్రేమ బడయనేరని ధనికునొకనిని గని, స్వాధీన మానసయన గలవా డొకడు సాభిమానముగా—

చెలఁగి చేపట్టుకుంచము చెలువ గలఁడు
దుర్గతుం డయ్యుఁ గడుఁ గృతార్థుండు సూవె;
కలియక కలసపంబెండి కలికి గలఁడు
రాజరా జయ్యు మిగుల దుర్గతుఁడు నిజము. ౧౫

ఒకకోడెగానిని కోరి, వానిని బడయనేరక, అత్యంతనిష్ఫలప్రణయమున చిక్కసగ మవుచున్న కామినితో రహస్యాభిజ్ఞ యయిన తత్సఖి—

మగువ! ప్రత్యేకజనునిపై మనసు దవిలి,
యింతగాఁ జికాకునఁ బలవింతు వేల?
విషముపోలిక విషమము ప్రేమ మన్న,
దాని నడ్డగింపఁగలాఁడు ధరణిఁ గలఁడె? ౧౬

ఒకక్రొత్తజవరాలిని అభిసారార్థము పురికొలుపుచు వృద్ధ దూతిక — తరుణము పోగొట్టుకొనకు, — మని బోధించుచు, ఉదాహరణకు తన కథనే తీసికొని—

ఆ యువకులు, నా గ్రామమ్మునందలి సిరి
సంపదలు, నాఁటి యా మాదు జవ్వనమ్ము,
చెప్పుకొనుచున్నది జగమ్ము చేరి కట్టు
కథలుగా, వినుచుంటి మీవిధిని మేము. ౧౭

శపథముద్వారా నిజ ప్రేమ ప్రకటనమును చేయించి, అనునీయమాన యయిన నాయికయొక్క— సవిషాదక్రోధవాదమును గూర్చి సఖి, సఖురాలితో—

అశ్రుపూరము నిండ గండాధరములఁ
గొమ్మ పలికె విలక్షహాసమ్ముతోడ,
నింకఁ గోపమ్ము సూపింప నేల? యొట్టు
పెట్టుకొనుగతి కయ్యెగాఁ ప్రేమ మనుచు.

ఒకతె, చెలికత్తెతో సనిర్వేదముగా—

చెఱఁగు మాసి ఘృతమ్ముచే విలిప్త
మైన మొగముతో నున్నవ్వ డరితి మిపుల
ముద్దుగొనినాఁడు, భూషణభూషితాంగి
నైన న న్నివ్వ డతఁడు డాయుంగఁ దడయు. ౧౮

ఒక పేదజవరాలిని తార్ప ప్రయత్నించుచు దూతిక ఒకకోడెగానితో—

నీలికోకఁ గట్టిన దని నీలిచికురఁ
ద్రోసిరా జనఁ జూడకు మో సరసుఁడ!
పసిఁడిజలతారుచీరయుఁ గుసుమశయని
కేళిఁ దొలఁగింపఁబడుఁగదా బాల సొగసు! ౨౦

నాయికకు కోపోపశమనమును బోధించుచు చెలికత్తె సాభిప్రాయముగా—

కలహకలహమ్మునందుఁ బూవిలుతుసురత
గుణసమారంభములు క్రొత్తక్రొత్త లగును;
పెరిగి నానాఁటఁ గోపము, విచ్చిపోక,
కుదురు గట్టి ప్రేమద్రుమకులికి మగును. ౨౧

కలహాంతరిత ఒకరిత మిక్కిలి పశ్చాత్తాపపడుచు సఖితో—

సారె బిగిసి పీఁటఁడిన్నై, యకారణమ్ముఁ
గారణమ్ముగఁ బన్నుచుఁ, గన్ను లెత్తి
కనక, ప్రౌఢవాదమ్మునఁ గాలు ద్రవ్వి,
యతని ప్రేమమ్ము మొదలంట నార్పుకొంటి. ౨౨

• కృతాపరాధు డయ్యు చాటూక్తులతో వేడుకొనుచున్న ప్రియునితో ప్రియురాలు సవైదగ్ధ్యోపాలంభముగా—

అహితుఁ డగుఁగాక, నిజహితుఁ డగునుగాక,
పలుకు టనుకూలముగ, బహువల్లభుండ!
కుపితు సుప్రసాదమునకుఁ గూర్చి పేర్చు,
టీవు జగతికి నేర్పుచున్నావు గదర ! ౨౩

మందస్నేహుఁడైననాయకునికృతఘ్నతను వెల్లడించుచు ఒకనిందించుబోడి, సఖురాలితో—

ఎవనికొఱకయి సిగ్గు త్యజింపఁబడెనో,
కునికెనో శీల, మపయశోఘోషణమ్ము

ప్రాసఁగెనో, యా ప్రియజనుండు కని మసంగి
నేఁ డుదాసీనజనుఁ డయ్యెనే లతాంగి! ౨౮

సఖురాలికి గుఱుప నొకతె, కులవధువుల తెఱగును వివరింప దొరకొనె—

మోముదామర నెత్తని ముద్దుచూపు,
వెలికిఁ బల్లగవడని లేమొలకనవ్వు,
మండిగము దాటి చనని మైమలుపునొలపు,
కులవధూరత్నములచొప్పు వెలయు నిటులు. ౨౯

నిష్కరిశ్చదుఁడైన కారణముచేత ఎవరిచేతను అనాదరింప బడని నాయకుని గౌరవమును సూచించుచు దూతిక, వినుచున్న ఒకానొక నాయిక ననుకూలపఱుప నన్యాపదేశమున—

దుమ్ముధూళుల మలినతఁ దొడుగుఁగాక,
కర్దమాంకిత మగుఁగాకఁ, గడ్డిగాద
ముఁ దిని తనపొట్ట నింపుకో మెనయుఁగాక,
మోయు నేనుఁగు స్వగుణతాస్ఫూర్తి ధరకు. ౩౦

సహజముగ " మహత్త్వము పనుపడి యున్న వారలకు హృదయము ఎట్టి కష్టసమయములోనైనను ఉన్నతస్థానము నధివసించియే యుండునుగాని, అల్పత్వమునకు దారి దీయదు.— అని సఖురాలికి బోధించుచు ఒకమించుబోడి, బల్లిదుడైన ఒక భటుని వనితను తన్ను చెఱబట్టి తెచ్చిన ఒక తస్కరునితో జరిగిన ధీరసంభాషణమును వినిపించె.—

నా చెఱలోని పిట్ట వయినావుగదా, యిఁక నాదునాజ్ఞఁ బో
వా? చెవు లేమి చూచికొని యంతటి నిక్కను నీల్గుచున్నన, సం
కోచము లేక, ముందెటెఁగికొందువు లే మునిముచ్చుదొంగ! యం
చా చెలి యు స్థదృష్టదశనాంకురహాసముతో జవాబిడెన్. ౩౧

ప్రేమప్రభావము సామాన్యము గాదు. వలపు తలకు మిగిలి యున్నపుడు ప్రేమారాధకులు క్షణమైన నెడబాసి యుండబోరు. ఆసమయములో

ఋతుకాలము వారిపాలిట మగ్న్యాత్మమైన యుగతనిఘాతమే యగునట. లోకవిరుద్ధమే అయినను లెక్కచేయక, నాయికా యుక్తబాలుకను తలయొగ్గరు. —అని నిరూపించి, సఖురాలిని ప్రియతమప్రణయాగ్రమునకు పంపిన నీచి యుగిక తొందరపెట్టుచు ఒకతె, ఒకానొక కలికిమిన్నకథను నిదర్శనముగా నిటు లుపవర్ణించి చెప్పె.—

పై మొనలం దవులొక్కనిన వర్ణఘృతమ్మున లిప్తమైన స్వ
స్వామిభుజోన్నతస్థలులపై గుఱుతుల్ దిలకించి, పెద్దక
న్నామరపూలు బాష్పజలధారల నింపిరి తెంపు లేక, యు
ద్దామవిషాదభారమునఁ, దక్కిన పుష్పవతీ సపత్నికల్. ౨౮

చెఱగు మాసి వెలికి జేరిన చెలువతో చెలువుడు—

ఖేదపడనిమ్ము లోకమ్ము ఖేదపడినఁ;
బైఁ బడుంగాక నింద పైఁ బడఁగనిమ్ము;
రమ్ము ప్రియురాల! పొమ్ము నాప్రక్క మునిఁగి;
కుసుమవతివైన నేమాయెఁ? గుసుకు రాదు. ౨౯

పూర్వానురాగవిధురులై లేఖముఖమున నాయిక, నాయకునిగూర్చి—

నేరిమి నెయ్యొడం గనిన నీ రమణీయ మనోజ్ఞ మంజులా
కారము కన్నువిందులుగఁ గట్టెదుటం గనిపించుచున్నదో
యీ రమణుండ! దిగ్వలయ మెల్ల భవత్ప్రతిమాపరంపరా
పూరితనిర్విశేష మయి మోహానమై వెలుఁగొందుచున్నదో!

మున్నొకానొకప్పు డేదేని యొకదానివలన కష్టము ననుభవించి యున్నచో, దానినే కాదు, తత్సదృశమైన మఱి యితర పదార్థమునుకూడ అది తమకు చాల ఇష్టతనుమే యయినను తిర్యగ్జాతులు పైతము కైకొన సంకోచపడుచు నుండును. కాబట్టి నీవుకూడ నా హితమును విని, నిన్ను కాదని నిగ్రహాదృష్టితో త్రోసివేయుచున్న ఆ తరుణిని పట్టుకొని దేవురులాడక, ఇక తదుపసరణసరణినుండి విరమింపు, — మని నాయకునకు బోధించుచు దూతిక ప్రాపదేశముగా—

ఊఁపుఁ, బరుగెత్తుఁ, గో యని రొయిడిసి కొమ్మ
గోళ్ళతో గీఱు, నెగురును గ్రోఁతిగండు;
దష్టమై యుంటఁ దొలుత సద్దానిచేత,
భ్రమర మనునూహ నేరేడుపండు గొనదు. 3౧

పైయర్థమే మఱొకదృష్టాంతమున —

బహులపత్త్రమా పొదరింట వానరుండు
చేతఁ దాఁక నూల్కొనఁడు, కించిద్విలంబి
గుచ్ఛకపికచ్ఛసదృశమ్ముఁ గూర్చువాన
రిచెయి, దురదబెఱి పెద రెచ్చిపోవ. 3౨

అభిసరింప నాయకుని బురికొలుపుచు దూతిక, నాయికా విరహవైకల్యమును వర్ణింప బూనె.—

సరసురా లతన్వి శుష్కించి పరువు దప్పె,
ముగ్ధహృదయ యయ్యెను దుఃఖముల నెఱింగె,
రక్త యయ్యెఁ బాండురతాప్రసక్త యయ్యెఁ,
బాప హా చాను నీయెడబాటుకలిమి. 33

మధుపానమదమున మైమఱచిన కారణమున మూఁగాళ్ళముదుసలి యయినప్పటికి ఒకమగవానిని దరిసి ఱొమ్మున గదించుకొనుచున్న ఒకజవరాలిని జూచి, శరదృతువర్ణన ప్రసంగమున నవ్వుచు సహృదయు డొకడు సహచరునితో—

ప్రాఁకు నెండి ప్రామా డయి వంగి వంకఁ బడిన
ద్రుమము నేని వేష్టనశీల దోసతీఁగ
యునిన, విరినల్ల తామర వనలతావిఁ
దోఁగు శారదసమయమ్ము దోస మద్ది. 3౪

కాంతునితో గలిసి, తొలుత వసంతోత్సవవిలాసవిశేషము ననుభవించి యున్న విలాసవతి ఒకరిత, ప్రియునితో నెడబాటు దాపురింపగా అపుడు

తనమనస్సునకు తోచు తనమనస్సంతాపమును గూర్చి యొకతె ప్రియవయస్యకు వివరించుచు—

పరుగు లెత్తించి జనుల నుత్సవములందుఁ,
కలకలారవములు నింగి నలముకొనఁగఁ,
బ్రహతతూర్య మా మహోత్సవమునఁ గ్రామ
దాహామటు దుఃఖకర మయ్యె దయితుఁ డెపుడు. ౩౫

దుర్మార్గులతో చెలిమి వల దని లోకమున కుపదేశించుచు, ఒక గాథ—

పలుకుబడుల వంచించి, స్వతంత్ర లాగించి,
పక్ష మెలఁగుదుర్జనుపై నెవండు నింక
నలుపఁడు? శ్మశానపాదపశాఖయందుఁ
బాశమున వ్రేలు చోరుపై నెనఁగ్లు. ౩౬

వానకారు వచ్చిపడినది. ఇక అతడు తిరిగి రాగలడు.—అని ప్రోషిత పతిక యయిన తనప్రియవయస్యకు తెలియఁబలుకుచు ఒక నెఱజాణ వలె తన మేనత్తతో—

వినుము మేనత్త! తన పెద్ద పని మొగమ్ము
నింత తీర్పక తెరువరి యింటి మొగము
పెట్టి మరలి రా, వానకా రట్టె యుట్టి
హాస మొనరించెఁ గుటజాట్టహాసములన. ౩౭

ఇంటికి మరలి పో నొకపాంథుని తొందరపెట్టుచు ఒకరితె, ఒకానొక ప్రోషితభర్తృకయొక్క వృత్తాంతమును గానము సేయ సాగె.—

అల్లనల్లన రేగు మొయిళ్ళ నరసి,
బ్రదుకుపై నాస బొత్తుగ వదలివేసి,
పథికునిల్లాలు తనకన్నపట్టి మొగముఁ
జూచె నేడుపు మొగముతోఁ, జూడలేక. ౩౮

ఒకానొక చిరప్రోషితపతిక యొక్క సఖురాలు, తత్కాంతునకు సందేశ మంపె.—

మలసి మగనాలిమాంగల్యకలలఁ దెలుపు
వలయుమును, సారె దిగజాఱి పడెడుదానిఁ,
దోడిగి యెప్పటిచోటికిఁ, దోడిచెలుల
పిండు వలయకారక మయ్యె వెంటఁ జెలికి. ౩౯

నానకారణముల విరహిణు లనుభవించు దుర్భరవిరహవేదనాభరమును సూచించి చతురుఁ డగు నొకఁడు వెంటనే ఇంటికిమరలిపో నొకపథికుని తొందర పెట్టుచు తలపున, ఒకానొక పథికాంగనసంగతి తీసికొని ఇటు లుపవర్ణించె.—

పూరికప్పుసందులనుండి దారవడిన
నీటఁ దడిసిన గుడిసెలో నిలిచి యుండి
తనువు మున్నది తడియనితలముఁ గూడఁ
దెలిపి లేని కన్నీటితోఁ దెరువరిచెలి. ౪౦

కలహాంతరితానాయిక యొక్క సఖురాలు తత్కాంతు ననునయార్థము ప్రోత్సాహపఱచుచు, కులీనప్రశంసాప్రసంగమున—

హితము నాల్కల నెలయించు, హృదయములకుఁ
బరమనిర్వృతి నొసఁగించుసరణి మించుఁ,
బీడితము లయ్యు రసమును వెలయఁ జేయు,
ముదురుచెఱుకుగడలు, కులీనదలములును. ౪౧

ఆయా గుఱుతులు కనబడక పోయినను వసంతాగమమును తెలిసికొన వచ్చు నని అత్తగారితో విరహిణి యయిన కోడలు—

అగపడదు తీయలేమావియిగురుపిసరు,
మలయపవనమ్ము మలయదు మలక లోలయు,
వచ్చె మాధవమాసమ్ము వచ్చెననుచుఁ
జెప్పుచున్న దుత్కంఠితచిత్త మత్త! ౪౨

[24]

ఇంకను వసంత కాలము కాలేదు గదా. ఓ యువతీ,— యని ఊరడించుచున్న కూర్మినెచ్చెలితో— రాదేమి? ఆగదా! — అని వసంతాగమనమును సాధించి నిరూపించుచు నాయిక—

ఏమియుఁ గార్యరూపము నయింపనిచో నెలమావితోఁటలో
నేమని మూఁగునే గళము లెత్తుచు మత్తసుగంధయామళుల్?
వ్యోమము నంటివచ్చుతలలున్ బలిసుబ్బిన గ్రమ్మఁగా మహా
ధూమము లెట్టు లుప్పతిలుఁ దొయ్యలి! నిప్పు పొసంగకుండినన్?

హోళీపండుగ మహోత్సవమునందు సుందరులగు నెవత్తున విరిపాను కొనియాడుచు చతురుడొకడు, వసనభూషణాద్యలంకారము అనిన చాల పక్షపాతము చూపించి వాదించు చెలికానితో—

అనుఁగుమగండు కైకొనినయంతఁ దనంతన నీడి యుల్లస
ద్ఘనకబరీభరమ్ము, మధుగంధసుగంధితవక్త్ర, మట్టిలో
చనలకు నింతమాత్రపు ప్రసాధనమే రమణీయమై ఖరిం
బనుపడి చిత్తహారి యగు, మన్మథరాజమహోత్సవమ్ములన్.

మదనోత్సవము అనగా సామాన్యము కాదు. అది విశేషసమ్మోదక మని యనక తప్పదు. ఆ ఉత్సవసందర్భములో, పల్లెటూరి పడుచులుకూడ చూడ వేడుకగా ఉందురు. — అని నిరూపించుచు ఒకడు చెలికానితో—

గుత్తపుఁబైఁటలోని చనుగుత్తుల చిక్కని మిట్టిపాటు లు
వ్వెత్తుగ గుత్తకుం గొనిన యెఱ్ఱని కెంపులరైకపొంగుతోఁ
బొత్తుగఁ బల్లెటూరిపువుబోఁడులు సైతముఁ గొంద్రు లోనుగాఁ
జిత్తజుతూఁపులై రసికచిత్తములన్ మదనోత్సవంబులన్.

ఒక నవప్రవాసితో ననుభవశాలి యొకడు—

ఉలుకున దిక్కులం గనుచు, నూర్పులు వుచ్చుచు, నావులించుచుం
దెలియనికూనరాగమును దీయుచుఁ, గూలుచు, నిస్పృహుండవై

కలఁగుచుఁ, దొట్రుపాటున వికావికలై వగ మ్రగ్గుచుంటి వీ
బలితపువిప్రవాస మిటు పాంథుఁడ! నీ కెటనుండి వచ్చెరా! ౭౬

సఖుగారి గృహాంతేకేలీకలాపము ననుసంధానము సేయ బోయితివే! అక్కడ ఏమిజరిగిన దేమి? ఇంత యాలస్యముగా వచ్చితి వేమి? అని మఱొకసఖి యడుగగా, పోయి వచ్చిన సఖురాలు, —ఆఁ. జరుగుట కే మున్నది? ఇదుగో విను మని—

వలిత బహువిలాస వికాస భాసురమ్ముఁ
గరణభూషితముం జిరతరుణరతము
నరసి దీపపుగులికయు నందుఁ దవులు
కొన్న మనమునఁ దెలియదు చన్నఁ జమురు. ౭౭

ఉద్భట సురతి గనికి యయిన ఒక కామినికి మిక్కిలి ఉత్కంఠ పొడ మించుటకు ఒకమించు చేష్టి, ఒక కానొక కాముకుని కామకలాకౌశలము నన్యాపదేశమున వివరింపబూని—

ఇంత అల్పస్వల్పమైన సుగవాడు సహింతురా? త్వరగా పోవమ్మా! అని సఖురాలు పలుకగా అతని యుద్భటసురతికళాపటుత్వము అసామాన్యము దుర్భగము, నని బహుళం పలుకుచు నాయిక—

నీ కోరిన కోడెగాడు ఉద్భటసురతకళాకోవిదుడు. అందుకు నీవు తగిన జత వగుదువో! కావో! — అని యన్యాపదేశమున సూచించుచు దూతిక, సోద్వేగముగా—

పునరుక్త కరాస్ఫాలన
ఘనతటరాజ ద్వయోన్మిఖన బహుధాపీ
డన శతముల నోరిచి వెల
యొనె నర్మద, యూధనాథుఁ డుఱుపడిఁ గడఁగన్? ౭౮

ఈనాడు అల్ల దూడిచేనిదగ్గఱకు పోవలసిన పని లేదు. నిర్భయముగా ఇంటికే రావచ్చు! — నని జారపూరుషునకు దెలియబఱుచుచు దూతిక సోద్వే గముగా—

జబ్బుపడి మే నెఱుంగను జాగిలమ్ము,
మతి చెడిన దత్తకుఁడు, నీటు సగుఁడు లేఁడు,
దున్న పడి యూడి చే నెల్లఁ బ్రోక్క పైఁచె,
వానికిం జెప్పి రప్పించువార లేరు! ౪౯

మంచి ఉపాయము కని పెట్టి, మానినీమానాపనోదనము చేయుచున్న ఒక చతురనాయకుని రహస్యమును ప్రకటించుచు నాగరికుఁ డొకఁడు తన చెలికానితో—

పూని సకచగ్రహ రభసోత్తానితాన
న యయి మానిని త్రావుచున్నది ప్రియుండు
స్వముఖమున నోటికందిచ్చు స్వాదు మధుర
సమ్ము నిఁతింత రోషౌషధమ్మనట్లు. ౫౦

మండు వేసవి మధ్యాహ్న మగుటచేత ఎండ కడలి, బజార్లలో ఒక్క పిట్ట యయిన నడుటలేదు. అతనిదగ్గఱకు నీవు హాయిగా పోయి రావచ్చు, నని అభిసారికకు సూచించుచు దూతిక, —నిదాఘతాపము దుర్భరముగా ఉన్నదనుమా! — అని పలికి ప్రకటింప సాగె.—

చాల దగ గొని సెలయేటి జాలటంచు
నాకెఁ దెల్ల త్రాఁచును దున్న, నాల్కతోడ;
దానిచోంగను ద్రాఁగె నా త్రాఁచు, నల్ల
జాతిచెట్టులో నీ రని యాతురమున. ౫౧

గ్గిలి ఒక కులవధువు తనమాతులానితో—

పడకటింటిపంజరమున దుడుకుఁబోతు
రాచిలుక నీవలకుఁ దేవో రాత్రులందుఁ?
బలుకుచున్నది మాతులీ! పదుగురందుఁ,
బలికికొన్న మా రాస్వపుఁ బలుకు లెల్ల. ౫౨

దంతధావనవ్యాపారముకోసము తనసంకేతస్థానమైన కరంజనికుంజములో పుల్లలు మొదలైనవానిని కోసికొనుచున్న నక్కడే సురతము పెట్టి దూరంలో మాధుకరము చేసికొని యుండుచున్న యొక ధార్మికుని, మగల ఆ తావంట కాలు పెట్టకుండ వెంటనే అక్కడినుండి తక్కడనుండియే వెళ్ళిపోవునట్లుగా భయపెట్టుచు ఒక కుటిల.—

నీ వొక ధార్మికాగ్రగణ్యుఁడవు నిక్కముగా నవుదేమొ కాని, నేఁ
డీవరుసన్ లభింప దొక యింతయు బిచ్చము నింతయూరిలో,
నా, వెఱ యొత్తి వచ్చెదవె? న్యాయముగా నిల నూక లుంటచే
జీవముఁ గొంటి నీవమక, జేతులఁ ద్రుంచి కరంజశాఖలన్. ౨౧౩

స్త్రీపరాధీనుఁడైన శివనుతో తన యనురాగమును ప్రకటపఱచుచు మెఱుగుబోఁడి యొకతె, తాటిక్రింద బెల్లము తీసికొని పని చేయుచున్న తమ చెలికి బెల్లపు గానుగ కాపలివానితో —

పెదవికోనుపని నున్నావు బెల్ల మీవు,
నే నొడిపినట్లు యంత్రముఁ బూనఁ బోవు,
రసము పోడము జాల్వారక పొసఁగఁబోదు
బెల్ల మనుమాట దెలియవో వెఱ్ఱివాఁడ! ౨౧౪

అప్పుడే స్నానము చేసి లేచిన ఒకజవరాలిని చూచి, కామించి, కాముకుఁ డొక డామెను తనచెలికానికి చూపుచు సోల్లాసముగా —

నునుగోరెంచ్చనినీటఁ జిందఁగఁ బసందుల్ మజ్జనం బాడి ని
ల్చిన శ్యామాంగివినీలకుంతలము లోలిం దేలి శ్రోణీతటం
బున సంస్పర్శసుఖానుభూతి, సలిలంబుల్ వాఱి జాల్వాఱ, బం
ధనభీతిన్ విలపించుచున్నటులు గానన్ వచ్చె దీర్ఘంబులై. ౨౧౫

ఊరివెలుపలి ఆ పెద్దమఱ్ఱిచెట్టు మనము సంకేతముగా నేర్పఱచుకొనుటకు చాల వీలుగా ఉన్నది.— అని నంటుకానికి తెలియపఱచుచు, రతిరసలంపట యయిన ఒక కులట, ఆ వృక్షము నుద్దేశించి —

ఓ వటరాజమా! బలిసి యూరికి ముంగలఁ గృష్ణపక్షముగ
నీవు బిగించి యుంచితివి, నీగ గడు నంటియు యుండి, ద్వారపా
లావిరళప్రతీక్షుల నిరంతరభోగికులమ్ము గ్రామ, మే
త్రోవలనేని నీవలనఁ దొట్రిగభీతి మునుంగఁ బోదు సూ. ౫౬

సవతియొక్క లోపమును పతికి సాపదేశముగా తెలియజేయుచు సవతి, సోపాలంభముగా—

తగులఁబడిపోయెఁ జేఁట, సెనగలు వేఁగ,
విలుగడప దాఁటి యువకుఁడు మలుపు దిరిగె,
నత్త కోపించె నింట, నొయ్యన బిగాది
యెదుటనట్టులు, కజ్జ ప్రయోగింపఁబడియె. ౫౭

జలవిహారమున దేలిన యువతీయువకులను గమనించి నాగరికు డొకడు చెలికానితో—

పులకలు గొన్న చెక్కిళులు, ఫుల్లములై చలనమ్ము లేని క
న్గలువల కెంపు రేఁకులును, గ్రమభుజాలతికల్ సెలంగ, నీ
యలరులబోండ్ల నెమ్మొగము లర్మిలిఁ జెప్పెడు, నంబులీన కాం
తుల సుదృఢోపగూహన వినోద నిరూఢ సుఖానుభావముల్.

వానకాఁపులో దూరప్రయాణమునకు సన్నాహము చేయుచున్న నాయకుని ప్రయత్నమును కట్టిపెట్టించుతలంపున, నాయికాసఖి—

ఊఱుములు మెఱపులును నిండ, నిఱులు వాఱు
క్రొత్త వానకారు మొయిళ్ళ రోజులందు,
నంద మొందు, నాకసమున కజ్జు లెత్తి
నెమ్మిగుంపులు విరచించు నృత్య మెంతొ. ౫౮

కొట్టములో సురతాసక్తయయిన ఒకకామిని, కాముకుని మనోవినోదముకోసము —

స్కంధముల వ్రాలి కొఱుకుచోఁ గాఱుదున్న
కొమ్ముదెబ్బలు దిని దోమగుంపు లవిగొ,
మీఁటి విడిచిన వీణెను మించు మ్రోఁత
లెగుసఁ జిమజిమ మని మింటి కెగురఁ గడఁగె. ౬౦

ఉద్యానవనదీర్ఘికాప్రదేశములలో కలువతీగసొగసును వర్ణించి, ప్రియతముఁడు ప్రియతమా మనఃప్రమోదముకొఱకు —

కలువతీవయాకులపైనిఁ గాళ్లు లూఁది
కదలి మెదలవు గండుతుమ్మెదలపిండు
లలరుచున్నవి, కలువల చెలిమికాఁడు
మడఁచి కూర్చిన చీకటిముద్దలువోలె. ౬౧

శాలిక్షేత్రములో గమించుచు ఒక శాలిగోపిక, పొలములో కంకులపై వ్రాలి చిలుకలు తినివేయునేమో యను భయమును సూచించుచుగూడ, జారుని చిరసంగతముకొఱకన్యమనస్కుని జేయు తలంపున —

తోఁటలోనుండి వెలికి రాఁ దొడరు పుంశు
కముల గుంపును ద్రుమము తాఁ గ్రక్కుచున్న
దదె, శరత్సమయమున జ్వరార్తుఁడౌ న
తఁడు సలోహితమైన పిత్తమ్ము నటులు. ౬౨

గమించుచున్న జారుని తొందరగను, వెఱపును వారించుచు ఒక దుర్దినాభిసారిక, వానికి ధైర్యము పురికొలుపుచు—

కడుగఁగ వర్షధార లతిగా వడిగాఁ బడి నెమ్మొగమ్ములన్,
నిడుపున విప్పి ఱెక్కలను, నీల్గున ముచ్చుముడింగిపోవఁగా
మెడ, లడఁగాఁటి యున్నయవి, మేకొని కాకులు జంటజంటలై
యడుకున శూలభిన్నములయట్టులుగా వృతివేష్టనమ్ములన్. ౬౩

మానవతి యయిన నాయికను స్వసంభాషణాభిముఖిని గావించుకొన నాయకుఁడు అనుగుచెలికానితో —

పలుక మానియు, మానిని కలఁకఁ ద్రోయు
దంతగా మూమనమ్ము, నసంత ఘోర
దూరదూర విజృంభితాస్త్రిక ఘోష
మధ్యజన భాషితమ్ములమాడ్కి, వింటె! ౬౪

ప్రియురాలిని దలచి తల్లడిల్లుచున్న పాంథుని నొకనిని ఊరడించుచు ఒక దయామయుడు —

ఫుల్లకదంబమంజరుల పొంపెసలారుపటీముళమ్ములం
గొల్లగఁ జూచి, బిట్టడలి గుండియ తల్లడ మంద, నింక నా
ఫుల్లసరోజనేత్ర మొగముం దిలకింపఁ గలట్టి భాగ్యమే
కల్ల యటంచు గొల్లు మనఁగాఁ జన, దూరడుమా యువాధ్వగా!

పాంథు డొకడు క్రమ్మ కొను మెయిళ్ళను చూచి —

జలధరరాజ! నీబలము చాలినయంతగ దాడి సేసి, గ
ర్జిలఁ గదవయ్య నావయినిఁ; జిక్కి మహోర్తి, విలంబినీలకుం
తలములు చిక్కువోవఁగ వెతంబడుచున్నది యింట నొంటిగా,
బలువున నేలపాలు సలువం దలపెట్టకుమయ్య! మత్సఖిన్. ౬౬

శాలిక్షేత్రము సంకేతముగా నేర్పఱుచుకొనుటకు చాల వీలుగా ఉన్నది. — అని సూచించుచు ఒకతె, అన్యాపదేశమున హేమంతసమయ సమాగమము నీక్రమమున వర్ణించె. —

త్రావి క్షీరముమాత్రము, దత్తజాను
పతన కమనీయరూపము, పంకమలిన
మైన శాలికేదారము హాలికున కొ
సంగెఁ బుత్త్రిఁడట్టులు కడు సమ్మదమ్ము. ౬౭

మఱొకపురుషునిపై మరులు గొన్న ఒక మగువను తాను లోగొను తలపున చతురుడొకడు, పూర్వనాయకునిపై ననూయ కలిగించుచు, ఖలనిందా వ్యాజమున వాని నిటులు నిందించె. —

పరిణతివేళ నా కడఁగుఁబాటొందవన్, ఖలసంగ మెట్లుగా
బెరయునొకో యేమొ! యటంచు దురపిల్లుచుఁ బెల్లు, మొగమ్ము వంచి వం
దురుచు, సరోజాక్షమై వగలఁ దోఁగుచు నున్నది శాలి జాలిగాఁ,
బెరిగి, తుషారబాష్పజలబిందువు లూరక జాలువాఱఁగాన్.

ఒకయింటి క్రొత్తకోడలికి వినబడునట్లు, ఆమెను లోఁగొనునూహతో నాగరికుఁ డొకఁడు సహచరునితో సచతురముగా, ప్రదోషసమయ వర్ణనమునకు మునుకొని —

సంజకెంజాయపాయచే స్థగిత మైన
విదియచందురుచిఱురేక చదల మెఱయు
చున్న దదె, రక్తచేలసంఛన్న మైన
నవవధూస్తన నఖరేఖ నలువు దోఁప. ౭౯

అర్ధచంద్రుని జూచు సుల్లాసమున మోర యెత్తి ఆకసమువంక ఊరకే చూచుచున్న దేవరునితో ఒక యొమ్మెలాఁడి, పరియాచకముగా —

మఱఁది! నీ వెన్నఁడును జూచి యెఱుఁగవేమొ?
వలపుప్రియురాలి చంకల మలుపులందు
నర్ధచంద్రపరంపర; నాకసమును
గన్నులార్పక చూడఁగాఁ గడఁగినావు! ౮౦

ఒక ప్రోషితభర్తృక, తనభర్తకు జాబు వ్రాసి పంపె. —

పలుక దొరకొన్న నెంతని పలుకఁ గలను?
వ్రాయఁ బూనిన నేమాత్ర వ్రాయ నేర్తు?
నెయ్యుఁడా! నీదు నెడమున్కి నేను గుడుచు
దుఃఖమున కీవె ప్రవిదితార్థుఁడవు లెస్స! ౮౧

సాభిలాషముగా ఒక మత్తకాశినియొక్క కేశపాశమును వర్ణించుచు ఒకఁడు నెయ్యునితో ప్రకాశముగా—

పూవువిలుతుఁ గోరపు చిమ్ముపొగ మబ్బొకొ,
జనుల కనులఁ గట్టెడు పిచ్చికసటొ, తిమురు
జవ్వనంపుపసందుధ్వజంబులీల,
ముద్దరాల్ దాల్చుచున్నది పెద్దజుట్టు. ౭౨

నీయనురాగమునకు పాత్రుఁడైన ఆ సుభగునిరూపసంపదనొకింత వర్ణించి చెప్పు,— మని ఒక జవరాలి నడుగ చెలికత్తెగ మఱొకటితె బదులు పలికె.—

పురుషవగుల నెల్లరఁ ద్రోసిపుచ్చి, తవిలి,
మరలు నెఱి లేని కనుదమ్మివిరుల మురిసి
పడుచు, బాష్పపూరార్ద్రమౌ వడఁతిమోము
చెప్పకే చెప్పె నాతనియొప్పుసూపు. ౭౩

అదిగో, తుమ్మెదలు పద్మములపై నిలఁకడగా నిలువక కలఁగి రేఁగి ఆకసమున గుంపులు గుంపులుగా చేరి కిలకిలనాదములు వెలయించుచు మగల మగల పూలపై ముసరుచున్నవి. చూడఁ జూడఁ ఈ తామరకొలను ఎవరికో సంకేతస్థలముగా నేర్పడి యున్నటు లున్నది.— అని తన అభిజ్ఞాపాటవమును ప్రకటించుచు సహృదయుఁ డొకఁడు సహచరునితో —

సరస వికచారవింద మందిర మరంద
రస సమానందిత మిళింద రాజమాల
నెఱపుచున్నది మధు రమా నీలరత్న
కాంచియట్టులు ఝుణఝుణత్కారములను. ౭౪

కామోత్కలికాకులుఁడై కాముకుఁ డొకఁడు ఒకానొక కామినిని గూర్చి—

బహులపుణ్యఫలైక భూరుహావర ప్ర
రోహమట్లు లెవ్వాసిచేయు మోహనాంగి!
మలసి విశ్రమించునొకో? మన్మథనిధాన
నవకలశము నీ స్తనపరిణాహమందు. ౭౫

ఒకజవరాలిని గోరి, దుర్గుఁడున్ గైన ఆమెమగనికి వెఱచి, ఉపసరింప సాహసింపక వ్యథపడుచున్న ఒకనికి బుద్ధి గఱపుచు, సహృదయుఁ డొకడు సహచరునితో —

సర్వరక్షిత నిధికలశమ్ముపైనిఁ
జోరులట్టులు, జారులు సారెఁ బఱపు
వారు చూపులు, వలఁగొన భయము, తృష్ణ,
ప్రౌఢపతి కావృథు స్తనపదముపైని. ౭౬

ప్రియునిప్రయాణము నాపివేయునూహతో ఒక కలకంఠి వానకారు నభివర్ణించె. —

నవతృణాంకుర రోమాంచ నందిత ప్ర
సాధితాంగంబులను వింధ్యభూధరంబు
దాల్చుచున్నది, సంప్రేరితం బయి కడుఁ
బ్రావృడిందిరోరు పయోధరములచేత. ౭౭

ఒకడు ప్రియస్నేహితునిముంగల నిజప్రియతమాప్రశంసాప్రసంగము నన్యాపదేశమున సాగించె.—

నాయకప్రరోచనార్థము దూతిక నాయికాప్రశంస నన్యాపదేశమున గావించె. —

ప్రాంతకాంతారములు బంధురములు, నీటి
పులుఁగు లఱచుచుండును శ్రావ్యముగను, నీరు
చల్లఁజల్లన, నదులకు నెల్లఁ; గాని,
నర్మదకుఁ గల కొన్నిగుణాలు వేఱు. ౭౮

ఒకకామినియొక్క చనువిరిగుత్తులు సాకాంక్షముగా చూచి, చూపుచు, కాముకు డొకడు సహచరునితో —

మహిత మాలూర ఫలములమాడ్కి నమరి,
సాధుపురుషులకోర్కెలసరణి నున్న

తమ్ముల్రై, యెవ నిముష మీ తనుఁ జేయున్న
చన్ను; లయదేరి చూచుచూ కన్నులారఁ ! ౭౯

తన పతిని త్వరగా తోడితెమ్మని తనను చెలితో నొక ప్రోషితపతిక —

నేను నే నని చేకొని, వానకారు
కాఱుమబ్బులచే లెస్స కప్పఁబడియు,
దొంగవలె జాఱి, నను మ్రింగ, నింగి, వయినిఁ
బడుచు నున్నది కటకటా! విడనినీట. ౮౦

ఊరకే ఉపేక్షించి, ఇట్టమ్మ్యపోసి చనని పెట్టినచో నాతడు ఇక నీధోరణిలో నుండునా?— యని శిక్షించుచున్న చెలికత్తెను నాయిక, సమాధానముగా —

వెలిచవులతోడ భ్రమియించు ప్రియున కెట్టు
లలికచా మదనక్షుధాకుల కటాక్షు
కీలితాక్షేవ విక్షేవ గృహ్యమాణ
మైన సౌభాగ్య మేమాత్ర మదికిఁగొనును ? ౮౧

పరనారీవిలాసలంపటు డైన మగనితో కలకంఠి ఒకతె —

కోఁడికూఁతతో మేల్కని కూయుచుంటె,
వింతఁ బ్రొద్దున్న యదిలే! గృహిణిని నొకఁ
వరిఁ గవుంగిటఁ జేర్చుచూ వల్లభుండ!
పరగృహ మ్మిది కాదులే, భయము పడకు. ౮౨

దయితుని ప్రయాణము నాపి వేయు నూహతో దయిత, దుశ్శకునమును, వానకారు విరహిజనదుస్సహ మగుటను, సూచించుచు, తన యనుగుచెలితో —

పెద్ద సుడిగాలి మొడఁ బట్టి వేగ నెంటఁ,
గొండతలనుండి యులఁ బడి పిండి యైన

మేను గఱ్ఱ కాలమేఘము ప్రాణమటులు,
గుటగుట మనుచున్నది కొఱవిమెఱుపు. ౬౩

ఉదాహృతార్థమే గాథాంతరమున—

పాకరిపుధనుష్కోటిచేఁ బాటితమ్ము
గాఁగ, వేదనం బడి యేడ్చు కాఱుమొయిలు
పేరి కఱిదున్న కడుపులో పెద్దప్రేవు
తెఱఁగునఁ గ్రేలుచున్నది మెఱపుఁదీవ. ౬౪

ప్రవాసోద్యుక్తుఁడైన దయితునకు వసంతసమయము విరహిజనదురంతమవుటను సూచించుచు మించుబోఁడి ఒకతె, తదాగమమును దెలియబఱచె.—

క్రొత్త లేమావియిగురును గొందలపడి
బడలుచుం జూచుచున్నారు బాటసార్లు,
రాజితమ్మయి లోహితరాజిచే, ల
తాంతశరుచేతి దుర్దాంతకుంతమునుగ. ౬౫

ప్రియతముని విదేశగమనమున కడ్డు తగులుచు ఒక నిపుణనితంబిని తన యనుగుచెలికత్తెతో—

ఇరువురో మూవురో మరణించుదనుక
విరహములకు విరామమ్ము నొరయనీరు
గరువమున మే నెఱుంగని పురుషు లనిన
వద్ది మహిలాజనమ్ముల పెద్ద దోసఁగు. ౬౬

నాయకునితో దూతిక—

అలసింపకు మింకఁ బొమ్ము, బాలకుండ!
వేగిరమ్ముగ నటు కాలు సాగనిమ్ము;
పాప! మా వరాకిక మేనుఁ బాయునేమొ!
బ్రదుకఁ గలదు నీకనుకలిఁ వాస్తవమ్ము. ౬౭

కనులతోడన త్రావఁగాఁ గాంతుఁ బెనిచి,
వచ్చి మూసరుచున్నవి తేంట్లు పెన్పుపెరిగి. ౯౧

నాయకున కుత్కంఠ పొడమించుచు దూతిక—

కలిగి యున్నది గ్రామాధికారికన్న
కూఁతు లోక మనోహరరూపగుణముమాత్ర;
దాసికతమునఁ గనులమూఁతలు దొలంగి,
గ్రామ మెల్ల దేవీకృతసేన మయ్యె. ౯౨

చాటూక్తులతో బ్రియురాలిని బ్రతిమాలుకొనుచు చతురు డొకడు, అధరపానలాలసను నేర్పున నిట్టుల బ్రకటించె.—

పూని ప్రియురాలికెమ్మోవిపానకమ్ము
చవియె యెఱుఁగరు గాఁబోలు, శ్రమముఁ గుడిచి,
చచ్చి చెడి తెచ్చి రతినాలజాలువంటఁ,
బోదివి యమృతమ్ముఁ దెచ్చిరి త్రిదశు లెల్ల. ౯౩

తొలుదొలుత కృతప్రణయాతిశయమున ననుదినము కంటికి కనబడుచు నుండి, ఆవెనుక నన్యాసక్తుడైన కారణమున కలలోగూడ కనబడక తిరుగు చున్న నాయకుని గూఢముగా నిందింప స్వప్రణయాతిశయమును సూచించుచు నాయిక అన్యాపదేశమున—

లాఁగి చెవులంట నిశితభల్లమ్ముచేతఁ
గొట్టఁబడి పడి యాయువుపట్టునందు,
నాడు లేఁడి, మెడం ద్రిప్పి చూడఁ దొడఁగెఁ
జిరము, కనఁబడఁ బోఁ డింకఁ జెలువుఁ డనుచు. ౯౪

గాథాకోశరత్ననిర్మాత యయిన శాలివాహనజనపాలమౌళియొక్క— యనివార్యశౌర్యవైభవమును కీర్తించుచు ఆశ్రితకవి యొకడు—

♦చెట్టుకొనకొమ్మయాకులఁ జిక్కి యున్న
చిన్నమామిడిపండును గ్రన్నఁ జూచి,
చంటిబిడ్డఁ డాఁకటఁ దూలి చాల యేడ్వ,
వేఁడుకొన దేవథికుని నీ విమతగృహిణి? ౯౫

---

♦ఈపద్యములో గృహిణీపదముద్వారా— "చేతకానపుడు ఏమి చేసి యయినను, ఎంత బాధపడి యయినను, ఆత్మగౌరవమునకొక్కొకపుడు హాని వచ్చు నతిస్వల్పకార్యములు చేయవలసివచ్చినను వెఱచి సంకోచమును పొందక, సామాన్యదీనదీనజనులైన భర్తచేగూడ విడువక పోషింపబడవలసినదిగా స్మృత్యాదులలో వచింపబడి యున్న తమయిల్లాలంకూడ, నీ కోపవశముచేత వెఱచి వెన్నిచ్చిపాఱిన విమతభూపతులచేత మహారణ్యములలో నింతటిదురవస్థకు తేబడినది సుమా!"— అని శాలివాహనుని యనివార్యశౌర్యగాంభీర్యము నమోఘముగా నసామాన్యముగానూచించి, వర్ణ్యునిమహాప్రభావమహిమత్వము నిరూపిత మైనది.

గంగాధరభట్టు, లలితలలితాక్షరవిన్యాసముతో ఈ గాథయొక్క ఆశయము నిట్లని వివరించినాడు.— "రాజా! త్వదాగమనభయముచేత వడవడ పుట్టి, స్ఖలితచరణసంచారముగా, అశేషపరివారమును విడిచిపెట్టి, చంటిబిడ్డనెత్తుకొని నీ శత్రువిలాసిని ఒంటిగా పాఱిపోయి, మహారణ్యములలో ప్రవేశించినది. అక్కడకూడ ఘనఘనాయమాన ఘనచ్ఛదచ్ఛాయ తరునికర నిరాకృత దినకరకరోత్కర శ్యామాయితమైన మార్గమున ప్రయాణించి పోవుచునుండగా చంటిపిల్లవాడు క్షుత్పీడితుడై గొల్లున గోలపెట్టి ఏడువ సాగినాడు. అప్పుడామె ఆహారముకొఱకెల్లెడ నతిజాగరూకతతో వెదకి చూచి, ఒకచో ఒకమామిడిచెట్టున విషమశాఖాంతర్గతమైన ఒకే ఒక పండును చూచి, దాని నెటులైన క్రిందపడగొట్టవలసినదిగా పాంథులను యాచింపసాగినది."— అని.

ఇందలి సార్థక్యమును, ప్రకృతానువాద పద్యమునందలి సాగస్యమును బుద్ధిమంతులు గ్రహింతురుగాక.

మూల ప్రాకృత గాథ:—

"విసమట్టిఅ పిక్కెక్కమ్బదంసణే తుజ్ఝ సత్తుఘరిణీఏ,
కో కో ణ పత్థిఓ పహిఅణాం డిమ్భ రుఅన్తమ్మి."

ఒక పువులమ్ముపడుచును చూచి రసికు డొకడు సహచరునితో సాభిలాషముగా—

> కోసి యపుడె తెచ్చిన పూలు దోసిటఁ గాని
> యెత్తి చూపుచు, యువకులయెదలఁ గూడఁ
> గోయుచున్నది పువు లమ్ము కొమ్మమిన్న
> లీల లలితోల్లలిత బాహుమూలముల. ౯౬

ఒక నవయువతిపై మనసు దవిలి, రసికు డొకడు చెలికానితో సాభిలాషముగా—

> కుదురు గట్టె వ్యాధాంగనకుఁ గుచములు
> పెరిగినకొలందిఁ, దఱిఁగిపోఁ దిరముపడియెఁ,
> ♦ కౌను, పతి, కుటుంబమ్ము, పల్లెలోని కోఁడె
> గాండ్రు, సవతులు, నను పంచకమ్ము మిగుల. ౯౭

---

దీనికి గంగాధరభట్టుఛాయ—

"విషమస్థిత పఞ్చకాత్ప్రమదగ్ఘనే తవ శత్రుగృహిణ్యాః,
కః కో న ప్రార్థితః పథికానాం డిమ్భో రుదతి?"

మథురానాథకృతచ్ఛాయ—

"విషమస్థిత పఞ్చకాత్ప్రమదగ్ఘనే తే తు శత్రుగేహిన్యాః,
పథికానాం కః కో నవాఽర్థితో రుదతి డిమ్భో హి?"

♦ 1. కౌను. (నడుము) — యౌవనవికాసమున.

2. పతి — యౌవనోన్మత్త కామత్వముచేత; సతతసురతదౌర్బల్యము పైని బడి.

3. కుటుంబము — నవయౌవనవికాసముతోడి నిజవిలాసిని మీఁద నత్యంతాసక్తితో ఎడబాయక అనవరతము క్రీడించుచు నామెభర్త తాను గృహస్వామి యయ్యు గృహకార్యములయందు జాగ్రత్త తీసికొనక వదలివేసినందున.

4. పల్లెయువకులు — ఆ జవరాలిమీఁది గాఢోత్కంఠచేత.

నాగరికు డొకడు పరనిందతో స్వాభిలాషమును ప్రకటపఱచుచు తోడివానితో—

మాలినీలోల మృదు బాహుమూల రుచులఁ
జూచు లాలసఁ బొంసులుఁ డీ చపలుఁడు
తిరుగుచున్నాఁ, డూరక విరుల వెలను
మాటిమాటికి నడుగుచు మరలి చనుచు. ౯౮

అన్యాసక్తితో తన్ను మఱచిపోయిన పూర్వస్నేహితునితో నొకతె, సోపాలంభముగా—

ఓ కృతఘ్నుఁడా! దట్టపు టాకుజొంప
ముల రవికిరణమ్ము లాగి డాఁగ, మొయిలువోలె
నలని వానీరకుంజముఁ దలఁపకున్న
నేమి, నర్మదాజలముల నెడఁదఁ గొనవొ? ౯౯

ఆ గ్రామాధిపతికూఁతురు మదనోద్దీపిత యయి బాధ పడుచు నున్నది. వైద్యుని పేరు పెట్టుకొని నీవు పోయి రావచ్చును. ఇది మంచి యవకాశము పొమ్మని కాముకునకు దెలియఁబఱచుచు దూతిక—

వెజ్జుపొడ లేని యీ పాడువీట వ్యాధి
బాధ నడలుచున్నది గేహపతితనూజ;
మగఁడు పోలికఁ దెలుఁగఁడు మందు మాకు;
నేరికోఁ జెప్పకొనఁ బోఁ గలార మింక? ౧౦౦

రసిక మనో మిళింద నికరమ్ముల రమ్మని యాగళమ్ముగా
రసములు జాలువాఱ మధురమ్మగు విందులు వెట్టి, పేర్మి హె
చ్చ, సుకవివత్సలప్రముఖ సత్కవి నిర్మిత గాథలం దమో
ఘసమయమైన సప్తశతికమ్ము సమాప్తిని బొందెఁ బొందికన్.

---

౯. సవతులు — ఈర్ష్యచేత, రేగా, నవయావనవైభవ యయిన ఆమె యం దాసక్తుడై, తమ్ము అంతగా గారవింపక, కొంచెపఱచుచున్న తమ పతి ప్రవర్తనను గమనించి కృశింపసాగి రని భావము.

పాలితసత్కవిత్వ కవివత్సల పాలిత పాలితాది సం
లాలితమైన గాథలకలారసవాటికలో రసాలముల్
జాలునఁ దేనియల్ గురియఁజాలిన యాఱవు కోటి యిద్ది, యీ
లీలఁ గొనెన్ నృసింహకవిలేఖినిలో రసలోల్లవైఖరిన్. ౧౦౨

సరసతరము గాథాసప్తశతకమందు
నాఱవు శతక మతిమనోహరము ముగిసె;
నెద్ది చెవిదారిఁ బడినంత, నెడఁదలోనఁ
జొర దమృతమేని మధురతా గరిమఁ జేసి. ౧౦౩

# ఏడవ శతకము

జ్ఞానశూన్యములైన పశుమృగాదులజంటలలో గూడ నెడబాయని యన్యోన్య ప్రణయాభినివేశము అమోఘమై యుండును. నీ కిక్కని లెక్కయేమిటి?—అని మందప్రణయుడైన నాయకుని నిందించుచు నాయికా సఖి, సాభిప్రాయముగా నన్యాపదేశమున—

అన్యోన్యప్రణయాతిశయమున మెలగు నాలుమగలు కూడి మరణింపనైన ఉంకింతురుగాని, ఒండొరు లెడబాటున క్రోగ్గుచు భూమిమీద బ్రదికి ఉండరు. అదివారల కలవి గాని పని.—అని మృగనిసర్గనమున నిరూపించుచు దూతిక, నాయికాను రాగమును ప్రదర్శించి, మందానురాగుడైన నాయకునితో నాతనిని మందలించు తలంపున—

ఒండొరులఁ గాచుకొనుకోర్కె నిండ, దెబ్బ
కెదురు నిలుచుసారంగమ్ములదుగ నరసి,
బెండువడి కిరాతుఁడు మన్ము విగల ద్రవను
పూర ధౌతమౌ తనధనువును త్యజించె. ♦ ౧

---

♦ మృగమిథునమును కొట్టుటకు వ్యాధుఁడు వింట బాణము ననుసంధింపగానే అది గమనించి, లేళ్ళజంట పరస్పరసంరక్షణార్థము వానిబాణమున కెదురుగా ఒకదానివెంబడి ఒకటి ముందుకు వచ్చి నిలబడ సాగినవి. అనగా — దుప్పిని గురిచూచి కిరాతుడు బాణమును వింట తొడుగగానే, తనభర్తను కాపాడుకొనుటకు లేడి గబగబ తనభర్త ముందుగావచ్చి కిరాతుని బాణమున కెదురుగా నిలబడినది. కిరాతుడు దానిని చూచి, బాణమును గురి చూపగానే, దుప్పి తనయిల్లాలిని కాపాడుకొనుటకు దానిముందుగా బాణమున కెదురుగా వచ్చి నిలబడినది. వెంటనే లేడి ముందుకు వచ్చినది. తిరిగి దుప్పి ముందుకు వచ్చినది. ఇట్లు అన్యోన్యసంరక్షణముకొరకు ముందుముందులయి, తనబాణమునకు దగ్గఱగా మూర్తీభవించిన ప్రేమమూర్తులవలె, పంతాలాడి వచ్చుచున్న ఆ మృగదంపతులను చూచి కిరాతుడు పరమకారుణ్యముతో నిండిపోయి, తన తలపెట్టిన మహాపరాధమునకు గుండె పగిలి, జలజల కరుణారసము స్వేదరూపమున పైకి ప్రవహించి, ఆ స్వేదములో నిట్టనిలువు

నాయికా విరహవైకల్యమును సాకల్యముగా ప్రకటించి, మందస్నేహుఁడైన నాయకుని తదుపగమనమునకు త్వరపెట్టుచు దూతిక —

ఓయి సుభగుఁడా! నిలు నిలు మొక్క యింత
చెప్పఁగొనవలె నొకరితముప్పఁ జొప్పఁ;
గాదు పో మ్మందో, విరమింతు; గంతుఁగొనును
గాక, యవిచారకారిణి కలికి యామె. ౨

తన చెలికాఁడైన హాలికసుతుని యన్యాసక్తిని సూచించుచు ఒకపడుచు, సఖురాలితో —

క్రొత్త బెల్లపు బూరెల కోమటీని
చాన యొఱఁగిన లడ్డులచవులఁ దవిలి,
కాఁపుకోడు, కోరులమిఠాయిగారె లిపుడు
ఛీ యటం చేవగింపులఁ ద్రోఁచుఁ దోడఁగొ. ౩

ప్రియుఁ గాలిని ప్రాతరంభోజశోభావర్ణనమున వినోదపెట్టుచు రసికుఁ డొకఁడు —

బాలభాస్కర మృదుకర పరిమలనము
వలన విరియు నెత్తమ్మి రేకుల సుశోభ,
పరిమలముతోడఁ బ్రబలనై, ప్రాతరవస
రమున మివులుచున్నది భువనముల నెల్ల. ౪

శ్లాఘ్యులైన సవతులమధ్య నాయికాసౌభాగ్యమును కైతవమున సూచించుచు ఒక నెఱజాణసఖి, పరిహాసకముగా —

గాలివాలునఁ దొలఁగి దుకూల, మదిగో,
ఘనజఘనమున క్షతపంక్తి గానవచ్చెఁ,

---

తడిసిపోయిన తనవింటినే -ఇక జన్మజన్మమున దీనిని చేతఁగొనను.— అని సశపథముగా సప్రమాణముగా విసరి యావల బాఱవేసినాఁడు.— అని భావము.

గప్పమా చెలి! చాటూక్తిగలితు దయితు
నలువురందు నవ్వులపాలు సలుపఁ బోకు. ౫

ఇప్పు డీ పడతికి ఇన్నాళ్ళనలె విలాసములమీద నంతగా లాలస లేదు.— అని కాముకజనముల కెఱుకపఱుచుచు, దూతిక—

ప్రేమ సవిలాస హాస పరిక్రమ క్రి
యలకుఁ దొలుత నీ చెలి జలాంజలు లొసంగె,
నవల వినయమ్ము తన కైన యూభరణము
గాఁ గుటుంబక భార మీ కాంత గొనియె. ౬

పరిహాసవ్యాజమున నాయికాసౌందర్యమును తెలియఁబఱచుచు చెలికత్తె—

సుందరి! పోవవచ్చు నతిసుందరుఁ డా చెలికానిపాలికిం;
దొందర యేఁటి? చందురుపతోరపుపగ్గులు ముగ్గనిమ్ము బ్రాఁ
తిం; దరుణీ! యెవారు గుఱుతింపఁగ లేరులె నీముఖమ్ము, డాల్
చిందిన పండువెన్నెలల, క్షీరములోపల క్షీరముంబలెన్. ౭

ఒకకామిని తన మాతులానితో—

మాతులీ! పరలోకసంప్రాప్తికొఱకు
వ్యసనపడెదు లోకము ఖేదపడినఁ బడును
గాక, నాచూపు బలిమి నా గ్రామణీత
నయుని మొగముపైఁ బడుచు నున్నది బిరాన. ౮

నాయికానురాగాతిశయము ప్రతిపాదించుచు దూతిక నాయకునితో—

కలిమి లేనట్టి నెలవట్లు, జలము లేని
కొండయేటిపాయవిధాన, గోధనమ్ము
లేని కొట్టమట్టులు నయ్యెఁ, బ్రాణసఖుఁడ!
నీదు నెడమన్కి నా కొమ్మ నెమ్మొగమ్ము. ౯

సిగ్గుతో ఆ జవరాలు నిజమనోభిప్రాయమును వెల్లడింప సాహసింపకున్నది గాని, అనురాగము లేక కాదు.— అని కాముకు నుల్లసిల్లజేయుచు దూతిక —

> పొడమె వ్రీడావతికి నీమె కెడఁదలోన
> నిన్నుఁ గన్నంతఁ బ్రణయమ్ము నిర్మలముగ;
> నది దరిద్రునికోరిక యట్టు లందె
> పొందుచున్నది పరిణతి నందగాఁడ! ౧౦

ఇట్లు చిక్కి సగమై పోయినా వెందుచేత?— అని ప్రవాసమునుండి మరలివచ్చిన నాయకుడు తనభార్యను పరియాచకముగా నడిగినాడు. అది గమనించి, అన్యాసక్తుఁడైన యాతనికి, విరహవేదనావిధుర యయిన ఆమె సవ్యపదేశముగా, నిగూఢముగా, చక్కని సమాధానము చెప్పనది. ఆ సమాధానవాక్యములలోని చాతుర్యమును వెల్లడించి చెప్పుచు నొక కలకంఠి తన అనుగుచెలితో —

> వాడి కృశియించు చిన్నరాకబోఁడి యెల్ల
> నీకొఱకె యిటులొక్కొ! యట్లు ప్రశ్నింతు వేల?
> చాలు నిఁక నవ్వు; వేసవికాలమందు
> నాస్వభావ మిదే యని నాతి వనరె. ౧౧

ప్రియతముని నిగళితగ పరిరంభ సుఖము నభిలషించుచు నాయిక యొకతె, మిక్కిలి ప్రణయముతో వక్తిలు ప్రియతమునితో —

> ఒనరి వర్ణక్రమమ్ము లేకుండఁగాక,
> చిత్రకర్మమున కిదే విశేషగుణము:
> మూర్చకొంగిటఁ గదియించుకొన్న ప్రియుజ
> నమ్మును క్షణమేని ప్రియుజనమ్ము విడమి. ౧౨

---

◆ కేవలము మషీరేఖానిర్మితమైన చిత్తరువులో ప్రియురాలిచే ఉపగూఢుఁడైన ప్రియుడు ప్రియురాలిని, ప్రియునిచే ఉపగూఢయైన ప్రియురాలు ప్రియుని, క్షణమైన విడువక, శాశ్వతికముగా అట్లే యుండిపోదురు. అదే

సుతిమెత్తనగా అనుభవింప దగిన నవకుసుమాంగిని, 'మోటుదున్నను బోలిన వాడొకడు అట్లే భోగించుచున్నాడు.— అని అసూయాగర్భితముగా ఒక నెఱజాణ తనతోడి చెలితో—

ప్రథమ రస సముద్భేదానుపాన లోభ
మడర, గండుతుమ్మెద యోఱుపడని సంధి
బంధములతోడి పసిమొగ్గపైమున విరి
యించు టెఱుఁగదు, కలఁచి మాయించుఁ దోడఁగె. ౧౩

చిత్రకర్మమునకు విశేషగుణము. అట్లే నేను మనసారా నిన్ను విడువను. నీవు నన్ను విడువవద్దు. అట్లు సార్వదిక 'గాఢోగాఢ' ప్రణయాశ్లేషవశముతో మెలగవలె నని, ప్రార్థనాపూర్వకమైన నా అభిలషితము. —అని భావము.

లేదా, వర్ణక్రమము అనగా గుణవిశుద్ధిపరిణపక. తద్రహితమైన చిత్రవిచిత్రముగా ఉండు కర్మ అనగా ధర్మార్థకామరూపమైన కర్మము, ప్రియజనోపగూఢమై అనగా ఆత్మోపసంశ్లిష్టమై, ప్రియజనునిచేత అనగా ఆత్మ చేత, క్షణమైన విడువబడక యుండదు. అనగా ఆత్మ, ధర్మార్థాదికమైన కర్మమును నియతమైన దాయికి అంటి యుండునట్లే, నిరంతర ప్రణయోపగూఢమున బోదివి, మన మిరువురము పాయక, అఖండసుఖరస లీలాతరంగములలో ఓలలాడవలె నని నాయికయొక్క గాఢాకూత మభివ్యక్త మవుచున్న దనియు చెప్పఁగానవచ్చును.

మూలప్రాకృతగాథ పూర్వార్ధములో —

"వణ్ణక్కమరహిఅస్స వి ఏస గుణో ణవర చిత్తకమ్మస్స"

అని శ్రూయమాణ మవుచున్న 'చిత్తకమ్మస్స' అను పదమునకు, 'చిత్త అమ్మణో' అని పాఠాంతరము గలదనియు, తద్వారా కొందఱు 'చిత్తఅమ్మణో' అనగా— 'చిత్తజన్మనః=మన్మథస్య'— అను సర్థబలమున ఈ అభిప్రాయమును ప్రకటించుచున్నారు. ఏమనగా— వర్ణక్రమరహితుడు అనగా బ్రాహ్మణాది వర్ణక్రమవిచారము లేకుండ, సర్వత్ర ప్రవర్తించు మన్మథునిలోని గొప్ప గుణమే ఇది. ఏమనగా— ప్రియోపగూఢుఁడైన ప్రియుఁడు, ప్రియోపగూఢయైన ప్రియురాలు, ప్రియజనమును క్షణమైన విడువకుండుటయే.— అని గంగాధరభట్టు టీక వ్రాసి వ్యాఖ్యానించినాడు.

కాని, ఆ పాఠాంతరముగాని, ఆ అభిప్రాయముగాని, ఎచ్చటను లభించుటలేదు. కేవల గాథాశబ్దబలముకూడ దానిని ప్రోత్సహించుటలేదు. పోనీ, ఆభావములో యత్కించిత్తు సారస్యమైనను తోచుటలేదు.

పురుషాయితగతసుఖ మనుభవింప గోరి పూరుషుఁడొకఁడు, అనుఁగుఁబ్రియురాలి నుత్సాహపఱుచుచు—

సరసములైన పెన్నొడలు సంచలియింప దరాలసస్థితిన్
మురిపెపు సోఁగకన్గలువపూవులరేకులు మూసి, ముంగురుల్
పరిలులితమ్ములై విలసిలం, బురుషాయిత మాచరించు క్రొ
వ్విరిపువ్వుఁబోండ్లయందు విరివిల్తుఁడు నిల్చు నధిజ్యధన్వుఁడై.

ఏమో, నామాట వినవు; నాకనుకూలముగా నడువవు; నాసుఖమును అసలే ఆలోచింపవు.— అని అన్యనాయికాసక్తుఁ డగుటవలన ఏమేమో పలికి, చికాకు పడుచున్న ప్రియునితో ప్రియురాలు సాభిప్రాయముగా—

నాకు లోఁబడి, సుఖమును నీకుఁ గూర్పఁ
జాలనిది యెల్లఁ జాలింతుఁ; బ్రాలుమాల;
నేనె సుఖ మీయ నోపనో, నేస్తకాఁడ!
యిద్ది నా చేతిలోనిదా? యరసి చెపుమ! ౧౫

నాయకు నుత్సాహపఱుచుచు దూతిక —

సిగ్గుతో క్రుగ్గుచుంటచేఁ జిత్తమందు,
నవయువప్రవర్తన మెల్ల నాఁగిపోయెఁ;
గాని, పెద్దలముంగల నేని నీ క
థాశ్రవణ మన్న మరల వా తరుణి చెవులు. ౧౬

చిరవిరహావేదనాభర వ్యథిత హృదంతర యయిన ప్రోషితపతిక ఒకతె, చెలికత్తెలతో —

తెలుపుఁడే మనుచుంటిరే? చెలువలార!
వలదు మరణింప, నాతని బ్రదికి యుండి
చూడఁ గల వనియా? మీర లాడుమాట
మాటమాత్రమె; నిక్కువుబాట గాదు! ౧౭

ప్రేమలో న్యూనత చూపుచున్న నాయకుని నిందించుచు నాయికా సఖి, సాభిప్రాయముగా అన్యాపదేశమున—

♦ చావు ముంగల నున్న మృగీవధూటి
చూచెఁ బ్రేమతో, నొంటిగఁ దోఁచు మగని;
నంతఁ, బ్రియకాంతుఁ డా కిరాతాంతకునిస్వ
కరమునందుండి విలు జాఱి ధరణిఁ బడియె. ౧౮

తనసఖురాలి చక్కదనమును తెలియబఱుచుచు, చపలస్వభావుడైన నాయకుని నిందించుచు, దూతిక సాభిప్రాయముగా—

తిరుగుచుంటివి తవిలి పద్మినులఁ, గలఁచి
మడఁచుచుంటివి జాజుల, మాలతులను;
భ్రమరమా! నీదుతరలతఁ బాయ వింకఁ,
బాటల హరించు నేని నీపస స్ఫురించు. ౧౯

జలతారురైకఅంచులోనుండి అగికనబడుచున్న ఒకజవరాలి బిగిచనుకట్టు చూచి, చూపుచు ఒకరసికుడు సహచరునితో సాభిలాషముగా, సపరహాసముగా—

*ద్వ్యంగులక కపాటక పినద్ధ సవిశేష
నీలకంచులికాంచిత, నీలచికుర,
చన్నువసిఁడికుండలమేలివన్నెఁ జూపు
చున్నయటు లొప్పుచున్నది యువకుల, కదె. ౨౦

---

♦ "మందస్నేహుఁడు నిష్కరుణుడు నయిన నాయకుని నిందింప, ఒకతె అన్యాపదేశమున"— అని ఈ గాథకు గంగాధరావతరణము.

"మృగీచక్షుర్నిభాలనముచేత కిరాతునకు తనప్రియురాలికన్నులు జ్ఞప్తికి వచ్చినవి. వెంటనే కరుణ పుట్టి, వానిచేతిలో నుండి విల్లు జాఱి పడిపోయినది."— అని తట్టీక.

*తిరుముచన్నుల కొమరుప్రాయపు కులుకుమిటారి ఒకతె, నల్లరవిక తొడిగికొని ఉన్నది. ఆ రవిక నేటి రవికలవంటిది గాదు. స్తనద్వయమును

ఒకానొక ప్రోషితపతికయొక్క దుస్థితిని, తత్పతికి ఒకబాటసారి వివరించి వినిపించుచు—

పూరికప్పుసందులనుండి కారు నీరు
తా భరించి తలఁ, బుత్త్రుఁ దడియకుండఁ
గాచుకొనుచుఁ బాంథునికాంత, కాంచ దుఱికి
సాగు కన్నీటిధారలోఁ దోఁగు వాని. — ౨౧

సంకేతితమైన ఆ తామరకొలనునొద్దన ఎక్కడనుండియో బాటసారులు వచ్చి మకాము చేసినారు. కాబట్టి మఱొక సంకేతమును సరిగ్గునదానిని వెదకికొని, ఏర్పఱుచుకొనవలెను.— అని విటకానికి తెలియజేయుచు ఒక విటకర్తె, శరద్వర్ణనవ్యాజమున—

త్రావుచున్నారు పథికుల్ శరత్తునందు
నల్లదామరపూలక్రొందావితోడ

---

కప్పుచు పార్శ్వద్వయమున రెండు వస్త్రభాగము లుండును. వానిని రెంటిని ఒకటిగా బంధించుచు మధ్య నొక సన్నని పీలిక యుండును. ఈ రవిక ఒంటి కదుకకొని యుండునట్లు పట్టీతో వీపున ముడివేసికొందురు. స్తనముల సంధి మధ్యస్థలమున రిక్తముగా నుండు ప్రదేశము "కపాటము" అనబడును. ఆ జవరాలికి ఆ రిక్తస్థలము ద్వ్యంగులపరిమితమై, లలితలలితమై మనోహరమై కనబడుచున్నది. ఏతావతా, కంచులికాభాగద్వయము ననుసంధించు మధ్యభాగమందలి ఆ సన్నని చిన్ని వస్త్రవిశేషమే కపాటము లేక కవాటముగా నిశ్చిత మగుచున్నది. ఆ జవరాలి కుచకలశములు బంగారుకుంభంబులవలె నున్నవి. ఈ కపాటము ఆ బంగారుకుండల మేలిమివన్నె జూపు ఒరపిడిరాయిగా ఏర్పడి, యువకులకు నిజముగా ఆ బంగారుముద్దల మెఱుగును చూపుచున్నటు లున్నది. — అని ఉత్ప్రేక్ష.

ఈ ఉత్ప్రేక్షద్వారా.— వర్తకుడు ఒరపిడిరాతిమీద వన్నె పెట్టి, చూపి, గ్రాహకుల ననుకూలపఱుచునట్లు, నీవుకూడ స్తనకనకకలశ వర్ణికా ప్రదర్శనముద్వారా యువకులకు ఉత్కంఠ పాదమించుచున్నావు. అనగా, యువకాన్వేషిణివై తిరుగుచున్నావు.— అని ఆమెను గుఱించి పరిహాసము.

అట్టియెడ, నీయెడ కుతూహలపడుచున్న నన్నే అనుగ్రహించి గ్రహింపు మని అభిలాషము చగమవ్యంగ్యముగా వ్యక్తమవుచున్నది.

నిండి ధవలాచ్ఛముల సరోనీరములను,
మొనయుత్కృష్ణ, బ్రియాముఖమ్ములను బోలె. ౨౨

బురదకు భయపడి, నాయికి నభిసారింప మానిన నాయకునిగని— దారి చాల సులభముగా హాయిగా ఉన్న,— దని సూచించుచు దూతిక, శరత్ప్రశంసనముకోసము నాయికా ప్రణయాతిశయమును వ్యంగ్యవిధానమున వివరించె.—

అంతరమ్మున సరసమ్ము లయ్యు, వెలిని
గాలికిం గట్టిపడిన పంకములతోడి
త్రోవ, లటు నిటు నడుపుడు జీవలోక,
మూర్ప్వప్రుచ్చుచు మన్నటు లున్న విపుడు. ౨౩

కాముకు డొకడు ఒక కామినిని చూపుచు సహచరునితో —

పండుగనాడు కొట్టునెడం బైపయి రేగిన పిండిదువ్వలతో
నిండిన పాండుర ప్రభల నిబ్బరముల్ జన గాలిగుబ్బ లా
రెండును బేత్ప్యపై ఖరి వెలింగె, ముఖాబ్జవు పెల్లనీడలో
నుండిన రాజహంసములయొప్పిదముం గొని, చూడు మల్లడే!

చూపులద్వారా ఒకానొక నాయికానాయకుల పరస్పరగ్రహణ వ్యాపారమును గుఱుతించి, ఎఱిగించుచు నాగరకు డొకడు సహచరునితో—

చూచె సుందరాంగినిం గంట సుందరుండు,
వానిపై నాతి వాల్చూపుం బఱపె; నంత
నొక్కతటి నొకవటి నిర్వు రొలపు గొలువం
బూరితరతిసుఖమ్మునం బేరుపడిరి. ౨౪

జారపూరుషుడు వినునట్లు తన అభిసారగసికత్వమును వెల్లడించుచు జారిణి, గ్రీష్మర్తుప్రశంసా ప్రసంగమున—

పిల్లదిగుడుబావులం నెండంబెట్టివైతు,
వాకు దోడిగింతు పాదరిండ్ల, నధికముల భ

ఘననికేతమా! సౌభాగ్యకనకనికష
పట్టమా! గ్రీష్మమా! నీదువాసి యసదె? ౨౬

కాయక్లేశపరీక్షా వ్యాజముతో వంచకులచేత కష్టపెట్టబడుచున్న ఒక గుణవంతుని తనగుణజ్ఞతచేత ప్రోత్సహించుచు ఒకమించుబోడి అన్యాపదేశమున—

కుటిలరత్నపరీక్షకకుల మొరపిడి
సాణిపైని నలుగఁదీసి సాపు వెట్ట
నిమ్మ, నూవుగింజంత శేషించి యుందొ,
మరకతంబ! నీ వెల కొక మాట యున్నె? ౨౭

ఒక నాయిక ననుకూలపఱుచుచు, దూతిక –

పరిజనమ్ములు చింతలఁ, బగతు రెదలఁ
దోఁచునాశంకల, మునింగి, చూచుచుండ,
బాలకుం డయ్యె గ్రామాధిపతిసుతుండు
వరలుసేపునఁ గాపాడెఁ బల్లె నెల్ల. ౨౮

ఒక తరుణవ్యాధతరుణి, జింకతోలు నడుగుచున్న బాటసారితో—

పలువు రున్నారు పల్లెలో వ్యాధయువకు
లింక; వారల నడుగుమా జింకతోలు;
పథికుఁడా! వింటె? మా యువవ్యాధసుతుఁడు
విల్లు మోపిడఁ డేనాఁడు లేళ్ళపైని. ౨౯

తనకొడుకును రేయింబగళ్ళు విలాసాదులలో మునిగించి యుంచుచున్న కోడలిపై నీసు జేసి, వ్యాధమాత తక్కిన బంధుజనులతో —

ఒక్క ములికిమాత్రమె యేసి యుక్కు మివుల
నిభవధువుల విధవలఁ గావింపఁ గలఁడు

పోఁతుతేనెటీఁగ రొంటందు పొడిచి కుట్టు,
వాచిన పెదవితోఁ బ్రియునిపై మొగమ్ముఁ
జూచి చనియెఁ బుళింది, యీసున మహో
భూరుహమునీడకుం జట్టు బట్టు మనుచు. ౩౪

పథికునకు తనసఖురాలి అభిలాష తెలియఁబఱిచి, ఇచట మకాము వేయు మని సూచించుచు, చెలికత్తె, నాయికతో —

చిమట చొరలేని దట్టపుచెట్లకంచె
లెదుగ, గాలికి వంగిన వెదురుగడల
నడర కేళులు, నిశ్శంక మోహ మగు కొంప
పల్లెయందు వసింతురు భాగ్యయుతులు. ౩౫

వర్షాకాలపుదినములు ప్రయాణసాధనసంపత్తి ప్రతికూలములు కాఁగా, గిరిగ్రామముల రమణీయతను రమణీయముగా వర్ణించుచు రమణీమణి యొకతె, తమ కాభిలాషిణి యయి, రమణునకు తన యింగితమును తెలియఁబఱిచెను.—

పరిమళోత్ఫుల్ల ఘన కదంబములు, గడుగఁ
బడిన ఱాలబండలు, మదంపదు నెమిళ్ళు,
పాఱు సెలయేటినీళ్ళ యింపారుమ్రోఁత,
లమరి, కొండయూళ్ళ రతిసుఖావహముఁ గూర్చు. ౩౬

నీరస యయ్యు, ఆ సాగసాధ్వి కాముకులను బంధించెడి చేయి యయిన ఆ నాయకుని సంతోషపఱచుటకై ఇప్పుడు మిక్కిలి సరసాంతరంగ, సహృదయహృదయాహ్లాదకరి యయినది!— అని నాయకుని దాక్షిణ్యమును ప్రకటించుచు, రసికజనమనోరంజనముకొఱకు ఆనాటి దేశమున నొక చతురయువతి—

పొదుగునం జేయి యిడ వ్రేలిమొనయుఁ దడుపఁ
బోని దయ్యును, స్వామిచే మొదవు లెస్స

పరిమళిత యయ్యెఁ; నేఁడది పట్టుకొనుచు
తడవుగఁ బిదుకుచున్నది కసవలాడి. ౩౭

ఎందును సరిసమానము లేని ఒకసగసురాలి సౌభాగ్యమును సూచించుచు సఖి సపరిహాసముగా అన్యాపదేశమున —

ధవలవృషము నీకొఱకును, దానికొఱకు
నెల్ల వృష్టులుఁ జూచె జీవించియునికి;
గోప! జీవింపుము కాని మాజీవితమును
గూడ, నీచేతిలోని దీ గోష్ఠలక్ష్మి. ౩౮

తెన్నగా లోకానుభవము గలవాఁడొకఁడు సహచరునితో —
నాయికనుపేక్షించి తిరుగు నాయకుని నిందించుచు దూతిక సవ్యపదేశముగా —

ముట్టి మూఁచూచుఁ, గోని చూచు, ముద్దుగొనును,
బులకలం దోడి యెదపైన నిలుపుకొనును,
దళదుప్రియురాలి చెక్కుటద్దాలఁ బోలు
వరమధూకనుమమ్ము నా బోటసారి. ౩౯

అంతఃకుటిల యయిన ఆ కుటిలకుంతలను తెలియక పొరపడి, అనుకూలవతి యను భ్రమతో నిష్ఫలముగా ననుసరించి తిరుగుచున్నావు.— అని నాయకుని ఒకానొకనాయికదరినుండి వేఱుపఱుప దూతిక అన్యాపదేశమున—

అడలి మధ్యాహ్నమున నెండ కడవి యెన్న
కొండచరియను వ్రేలాడు కొండచిలువ
మేలికుబుసంబు సెలయేటిజాలటంచుఁ
దడువుకొనుచు నున్నది వితాతలను రాఁచి. ౪౦

గుణవతి యయిన పూర్వనాయికతో తృప్తి పొందక, గుణాంతరలోభగుణముచేత మఱొకనాయిక ననుగమింప సాగిన నాయకుని సోపాలంభముగా శిక్షించుచు ఒకతె అన్యాపదేశమున—

తొలఁగి విరితమ్మి నల దని. వెలగపండ్ల
పాసనలయూసఁ బరుగిడి, పట్టి చూచి,
తుద కెఱిఁగికొందు, చేతిది తుడిచి పెట్టి,
పామరుఁడు బొమ్మలో లడ్డువలెనె, తేఁటి! ౮౧

పెండ్లికి పూర్వమే ఆ వరునిమీద ఈ వధువునకు ప్రణయము అంకురించి యున్నదయ్యా!— అని ఒక పెండ్లికూతురును గూర్చి, ఆ గుఱుతులు వివరించుచు చతురుఁ డొకఁడు సహచరునితో—

కూడి మంగళగాయినుల్ పాడఁ దొడఁగు
వరుసగోత్రాదికమ్ములపైని వీను
లిడిన కానున్న వధువున కొడలిపైని
వెలువడెఁ బులక, లవ్వాని వినఁగ ననఁగ. ౮౨

ఇదేమిటయ్యా? పెండ్లియనిన చాల ఉల్లాసపడుటకు బదులు ఈ పెండ్లి కూతురు ఇట్లు సంకోచపడుచున్న దేమి ?—అని సహచరుడు అడుగగా ఒక చతురుడు— అన్నను. నీనికి కారణము తెలియలేదు. పెండ్లికి పూర్వమే ఈ వరు లాడే వల్లభకాంతాసుఖమును బాగుగా ననుభవింప నలవాటు పడి ఉన్నదిలే. బహుశః ఇపుడు ఈమె తనమనస్సులో నిట్లు అనుకొని ఉండును. ఏమనగా? వినుము.—

విని సమీపించుచున్న నా పెండ్లి కబురు,
గుబురులై విరిపూలతోఁ గొమరు మీఱు
వేతసనికుంజములు సా[illegible]డిఱుఁగ నవ్వఁ
దొడఁగె నా : నయువకులతోడ సచట. ౮౩

ఇపుడిపుడే పెండ్లి యాగుచున్న యీ నవదంపతులకు ఒండొరులపై నెట్టి ప్రేమాతిశయము మొలకెత్తించినదో గమనించినారా? — అని నాయికాసఖి, తోడి సఖురాండ్రతో సోల్లాసముగా—

నాగవల్లి తీఱకిం మొఱునాఁడు కాఁగ
లదు విరహాగ్ని మంచతిదృఢలగ్నతమము

లా నవవధూవరులచేతెను లలముస్వేద
బాష్పముల వసర్చుచు నున్న పగిదిఁ దోఁచె. ౪౪

నవవధూసంగమము అలౌకిక సుఖరస విశేష సంపత్సంపాదకము సుమా! — అని ప్రతిపాదించుచు రసికుఁ డొకఁడు సహచరునితో —

వాలుచూపులఁ బఱపదు, వదనబింబ
మంటుకొననీదు, పలుక దొకించుకంత,
కాని, కలరహస్య మ దేమొకాని, కూర్చుఁ
జాల సుఖమును నవవధూసంగమమ్ము. ౪౫

సంగమసుఖ నాటక నాందీపూజలో నవవధూస్వభావము నభివర్ణించి చెప్పుచు నాయికాసఖి, నాయకునితో సపరిహాసముగా,— 'తెలియని' మాటలి వలన నేనైన నెఱసులు పొసగినను అవి తప్పుగా తీసికొనవలదుసుమా!— అని సూచించుచు, ఒకానొక నవవధూవరుల సంగమసమయ గాథను తీసికొని—

తవిలి దొంగనిద్దుర వోయి నవవరుండు
కదలి యటు ప్రక్క మార్చుకోఁ గడఁగినంత,
వడఁకుచు వడిఁ జనియె నవవధువుచేయి
నెఱపి మూఁడంకె మూసిన నీవిపయికి. ౪౬

విసంభ్రణ పూర్వకముగా మాత్రమే నవవధువుతో మెలగవలె నని నాయకునకు బోధించుచు ఒకప్రౌఢ, బలాత్కారముచేత కలిగి అలిగిన ఒక నవవధువుయొక్క కథను వినిపించె.—

పలుకరించినఁ బలుకదు, మలసి చేతఁ
గొనిన విదలించుకొను; ముద్దు గొనిన నేడ్చు;
నది గని కృతాపరాధుఁడు హృదయవిభుఁడు
చటుకున నవవధువును గౌఁగిటఁ గదించె. ౪౭

తాను వలచిన యువప్రియునికథలనే ఊబుసుపోకకు తద్గుణమాధుర్యము చేత మాటిమాటికి చెప్పుకొను నితరయువతులను చూచి, ఈసు జేసి, కలుషించిన ఒక జవ్వని తన పినతల్లితో—

వానివలననే పొసఁగును బలుకుఁబడులు,
వానియందే వికాసమ్ముఁ బడయు, వాని
యందె ముగియును; బినతల్లి! యరసి చూడ,
నూరి కంతటి కొక్కఁడే యువకుఁ డేమొ! ౭౮

ఒకకాంత, అంతరంగసఖితో:—

మనము పలికినపలుకులే మొనసి ప్రియుజ
నుఁడును మనయట్లె పలుకఁగా నూలుకొనును,
వాఁడు పల్కిన యా పల్కుఁబడు లెడంద
కొనరి తీపివిందులు వెట్టు వినినకొలఁది. ౭౯

కలహించి, మగనితో పలుకక మాఱుమొగము పెట్టిన నాయికను ఒక గారవపూరుషునితో గలియ ప్రోత్సహించుచు దూతిక, ప్రసంగానుగతముగా—

సుఖముతోఁ బని గల దేని క్షోణి మీఁదఁ,
బ్రియుజనుని సర్వశక్తుల వెదకికొనుఁడు;
హృదయదయితునిదరి నింత పొదలఁబోని
సుఖము, నిక్కన మాడిన, సుఖము గాదు. ౮౦

అలంకరించుకొనకుండ అట్లు ఊఁగకే చేరఁబోయెద వేమి? — అని కూతు సమీఁద కోపపడుచున్న వేశ్యమాతతో కాముకుఁడు—

చూడఁబడి చూడ్కిఁ దోయికి, సొంపుపలుకు
పలికి వీనుదోయికిఁ, బ్రీతిఁ దలఁపునఁ బడి
డెందమునకుఁ దీయని ప్రేమవిందు వెట్టు
ప్రియుజనము నిత్యరమణీయు, మియ్యది వింతె? ౮౧

ధనవంతుడుగా ఉన్నపుడింటికి రప్పించి, అ దంతయు దోచివేసికొని, ఆ చాయలకుగూడ రాకుండ అర్ధచంద్రప్రహారప్రయోగముతో స్వస్తి చెప్పించి, అతడు తిరిగి ధనము సంపాదించి యధికుడు కాగా, మరల తన కూతురువలపును దెలిపి, త మ్మని వృద్ధవేశ్యమాతచే బ్రతిమాలుకొనబడు

చున్న భుజంగు డొకడు, పూర్ణిమా ముహుసఖి నిజాప్తి సూచన కాంతి
లను సాక్షిప్రాయముగా న్యసింపవలెను, ఈ పోలికపూర్వాపర సూచన నిరాకర
ణమును, ఆత్మనిందావ్యపదేశమున వల్లించెను.—

ఉన్నతికి దూరమై, జాతి యున్నదాని
నుండి, సడలిపోఁ బీనత నొందిపోయి,
కడుపునన వ్రేలు మేము మూగాళ్ళమై సలి
దాని చన్నుల ట్లయితిమి తథ్య మిప్పుడు. ౫౨

వార్ధక్యదశ్యమంచిత యయిన ఒకఖండితకు, తెల్లవారగానే పడమ దిక్కునకు
చేరుకొనుచున్న ప్రియుని సూర్యునివలె వ్యపదేశమున నిందింప సాగె.—

ప్రాతరవసరాగత! రాగరక్తమూర్తి!
నవ! ప్రియాలోక! లోచనానందరూప!
సన్నఖసభాజన! యనిహాతపిత గాత్రి!
దివసపతి! నమస్తే నమస్తే నమోస్తు! ౫౩

రతిప్రవృత్తిలో కొంచెము తొట్రుపడుటను గమనించి, — ఓహో!
నెల మసలి, భారపడినావు కాబోలు !— అని ప్రశ్నించు మగనితో నొక
మగువ—

కడుపు నిండెనా యని నన్ను నడుగుచుంటి
వా? సురతవిపర్యయలంపటాతిశయితి!
కడవ తలక్రిందు లొనరించి యిడుదుమేని,
నొక్క నీటిచుక్కయు నిలు నొప్పునొక్కొ! ౫౪

అభిరుచితు డయినప్పటికి దయితునిపై అతిదూర సంబంధానురోధము చే
నంతగా తలపు చూపని నాయికను ప్రోత్సహించుచు దూతిక ప్రసంగాను
షంగమున—

నాఁడును నాఁడునుం బెరిగి నందకుమారుఁడు పెండ్లియాఁడుకుం
గోఁడలనమ్మతో మెఱయుఁ, గుల్కు మిటారపుజవ్వనమ్ము దోఁ

గాఁడెడు గోపకన్యకలు నల్లనఁ బూనిరి నిహ్నవింపఁ, బూ
బోఁడి యశోదకుం దమకుఁ బూర్వము గల్గు సమస్తబంధముల్

దయితుని విషయమై సాగుచాటిన మనోరథము పొలిమేర చేరక పూర్ణానే భగ్నమై కూలిపోగా, నిర్వేదమున బడి, పడతి ఒకతె సఖేదముగా దైవమును దూఱి యాక్షేపించి—

హృదయఫలకమ్ముపై నేది యేది స్వాంత
మూస లనిన కుంచెలతోడ వ్రాసి యిడునో,
యరయ కది యెల్ల మాలదయ్యమ్ము నగుచుఁ
జెఱిపివేయును కనుగప్పి చిటుతఁడెల్లు. ౨౧౭

సపాటవోపాలంభపాండితీమండిత యయిన ఒక ఖండిత, ప్రాతస్సమయమున నింటికి జేరుకొనిన దయితుని చూచి, చంద్రవ్యపదేశమున వ్యంగ్యముగా—

♦ పూర్ణదినమం దఖిలకలాపూర్ణ! రసిక!
నీ కరస్పర్శ మనుభూతమై కలకొనె;
వచ్చిన ద్వితీయ పొత్తున సన్నగిలితి
విభుఁడ, విధుఁడ! నీ యడుగుల కిదిగో జోత. ౨౧౮

♦ ఈ పద్యములో చంద్రపక్షమున నన్వయ మిది:—

అఖిలకలాపూర్ణ = షోడశకలాపరిపూర్ణుఁడవై తెల్లగా వెలుగొందు ఓ చంద్రుఁడా! పూర్ణదినమునందు = పూర్ణిమనాఁడు (సంపూర్ణముగా) నీకరస్పర్శము అనుభూతమై, తెల్లగా కలకొనె = కలువవాఁడి పగ మనుభవించిన సమాపాదకమైనది. ఇప్పుడు, వచ్చిన ద్వితీయ పొత్తున = వచ్చుకొన్న (ఏర్పడుచున్న, ప్రసక్తమైన) ద్వితీయా తిథితోడి సాంగత్యము చేత, సన్నగిలితివి = ఏకద్వికళామాత్రుఁడవై, రేఖామాత్రముగా కనబడుచున్నావు. ఇదిగో నీకు నమస్కారము.— అని.

ప్రియునిపక్షమున:—

అఖిలకలాపూర్ణ, రసిక = చతుష్షష్టికళలలో ముఖ్యమైన మదనకళలో పరిపూర్ణమైన పాండితీప్రతిభ గడించి, రసికత నలవఱచుకొని, అతితేఱిన

ఆతడు వచ్చినప్పుడు నీ వంత శ్రేష్ఠముగా ఉండుమమ్మా! — అని తన చెలికత్తె బోధింపగా విని, దృఢానురక్త యయిన ఒక నాయిక, సమాధానముగా చెలికత్తెతో—

ప్రియతముఁడు దూరదూరాంతరితుఁడు గాఁగఁ,
గనులు మరలించుకొంటిని గట్టిపూన్కిఁ;

---

ఓయి ప్రియుడా! పూర్ణదినమందు — నీసంగసౌఖ్యము పరిపూర్ణముగా అబ్బిన ఒకానొక శుభదినమున, లేదా— (ప్రాకృతములోని "పుణ్ణదిఅహమ్మి" అను పదమునకు "పుణ్యదివసే" అని కూడ సంస్కృతార్థము లభించుచున్నది. దానినిబట్టి,) — నాపుణ్యము పండి నీసంగసౌఖ్యము లభించిన ఒకానొక దినమున, లేదా, శోభనదినమున మాత్రమే నీశరీరస్పర్శము లెస్సగా అనుభూతమైనది. లేదా, పుణ్యమైన వివాహమంగళదినమునమాత్రమే పాణిగ్రహణము ద్వారా నీకరస్పర్శము అనుభవింపబడినది. అది మొదలు నేటివఱకు మరల అట్టి మహాభాగ్యము నాకు లభించినది కాదు. పోనీ, ఈనాటి పొందుదా మన్నను, అది పొసగునట్లు లేదు. ప్రస్తుతమున నీవో, మఱొక యువతితో పొత్తు సంపాదించుకొని, పెనగి పెనగి అట్లు కృశించి పోయినావు. ఏమి చేయగలను? నీదగ్గఱకు వచ్చి నీపొత్తున సుఖమనుభవించుటకు నాకు హక్కు లేదుకదా? పోనీ, నీచరణదాసిగా, నీ అడుగులకు నమస్కరించెదను. — అని.

దీనిలో ఇంకొక విశేషమును గ్రహింపవలెను.— "స్వీయా సహధర్మిణీ"— అని అమరకోశము. ఆ అర్థమునుబట్టి, ఈ భావమునుగూడ ఆమె యొక్క సేర్ష్యా కోపోపాలంభ వాక్యప్రసారములో మనము ఊహింపవలెను. ఏమనగా—

ఓయీ! నీవు ఇతరవనితాప్రసక్తితో ఇంతగా చెడి, ఇంతగా కృశించి పోయినను, లోకము నిన్ను అట్లు తలపదు. భార్యతోడి సతతసాంగత్య వశముచేతనే పాప మీతడిటు లయిపోయినాడు. ఈమాత్ర మామెకైన తెలియగూడదా? తన సుఖమే తనకా? పతిక్షేమమును ఆలోచింపవలదా?— అని అగ్రుడ్డిలోకము తలచి, పలుపోకడలు పోవుచున్నది. అట్టి సుఖము లేక పోగా, లేనిపోని ఈ నిందలన్నియు మోయవలసినపని నాపై బడుచున్నది. చాలు చాలు బాబూ! నీకు, నీసౌఖ్యమునకు పదివేల నమస్కారములు. ఏనాడో, ఎప్పుడో, ఎట్లో జరిగిపోయిన అంతమాత్రపు నీ కరస్పర్శ నాకు చాలులే! ఇంత చెడిన నీతో నిక దూరముగా నుండుటయే మేలు! నీవు మాత్రము అట్లే అటు అటు తవిలి, నూతన నాయికలతోడి పొత్తున ఇట్లే కృశించుచు ఉండుము.— అని.

గాని, యని వారితమ్ముగ వానితోడఁ
గూడి తిరుగుచున్న దిప్పుడుఁ గూడ మనసు. ౬౮

ప్రియతముని బాగాగానే కోప మంతయును సడలిపోయి, తానే ముసు
ముస్నగా వానిని జేరి ప్రయత్నముగా నున్న సఖురాలికి,—అట్లు కాదమ్మా!
ఇట్లు నడవవలెను!— అని కోపము ననుశిక్షించుచు చెలికత్తె, సప్రణయోపా
లంభముగా—

మోసితివి పులకలు వానియొనుమాత్ర,
నెలుఁగు విన్నంత నలుకను దోలఁగు బావ
యంటి, నెదుటఁ గాంచి వడంకు గొంటివి, వింకఁ,
గొఁగిటం గొన్న నది సేయుఁ గలవో కలికి! ౬౯

సాయంసమయము సమీపించుటచేత ప్రియాభిసరణముకూడ అతిసమీ
పముననే యున్నది. తగుప్రయత్నమున యుండు,— మని సూచించుచు చెలికత్తె,
సాయంసమయాభివర్ణన వ్యాజమున—

భరనమిత నీలశాఖాగ్ర భాగ సరణి
స్ఖలిత చరణార్థ వినుత పక్షపుటము లయి
పులుఁగు లెట్టులో చెట్ల పై మొనలయుండు
నొందుచున్నవి నిలుకడ నందలాది. ౭౦

నిరాతంకముగా యథేచ్ఛముగా రమించి ఒక రమణి, రమణుని భావ
మున భావిభావాంతరమును వారించుతలపున, చతురతతో, సమధురముగా—

నిండుకెలసాన వా కెరదొండపండుఁ
బ్రావులాలన రమియించినావు నాథ!
మూఁడు కాకలుఁ దిన్నది, ప్రీడబాడ
కెలయుదు, చెడిపె యని నన్నుఁ దలఁపఁ బోకు. ౭౧

కులటల గుట్టుమట్టు లెట్టివారికిగూడ అంతుపట్టవు సుమా!— అని
తనలోకవ్యవహారవేదిత్వమును వెల్లడించుచు నాగరికుడొకడు సహచరునితో—

కడుపునిండ నన్నము పెట్టి, గంజి పోసి,
యింటికుక్కను లోఁగొన నింటియాలు;
ఇంటిమగఁడు రా, నఱిమిమ గెంటు; వలపు
మగఁడు రా, నడుగులఁ బడు మ్రొక్కె నదియు. ౬౨

అవిరతసురత మొప్పదును బనికిరాదు. అది తప్పక అనారోగ్యమ్ము నకు కారణ మగును.— అని దయితునకు తెలియఁజేయుచు సంగవిద్యను చూఁడుము ఒక మత్తకాశిని, యువవ్యాఘనిదర్శనమున—

దండి గల తన వికటకోదండమునకుఁ
బట్టి చిత్రిత కడు సన్నపటము యువకు
మారుఁ గని తల్లి వగచెను, మగనిచావు
కన్న నిబ్బడిగాఁగఁ బక్కణములోన. ౬౩

ఎందు కట్లు వగచుచున్నావని?— అని సఖులడుగఁగా ఒక జనగాలు—

హావభావము లెఱుకకు రావు మాకు;
దయితునకు వానివలన ముదమ్ము నెందు;
కనఁబడం బోదు వేఱొండు గతి; యిఁ కెట్లు
నేర్తు మరికట్టివైవఁ గన్నీటిధార ? ౬౪

సుదృఢానురాగముతో, నీతోడిదే లోకముగా మెలఁగుచు నున్నను, నీవు నామీద నంతయయిన ననురాగమును జూపకున్నావుగదా?— అని సవైదగ్ధ్యముగా నిందించుచు ఒక ప్రణయిని, ప్రణయితో—

ధవలుఁడవ యయ్యు నీచేత దయితతరుఁడ !
నాహృదయము రంజిత మయ్యె నవనవముగ;
రాగమయు మైన మది సమర్పింగఁబడియు,
నీవు రక్తుఁడ వేమాత్ర కావు కావు ! ౬౫

ప్రప్రథమములో నత్యంతము అనురాగమును చూపి, లోగొని, ఆపైనుక వెడలగొట్టబడిన కాముకునొద్ద మున్ను తా దోచుకొనిన ధనవైభవము కారణ

అచేతనమైన వృక్షముగూడ ఉన్నతస్థితికి ప్రయత్నించుచున్నది. మహో వంశసంజాతుడ వయ్యు నీవు మాత్రము అందుల కుద్యమింపక, ఇట్లు మాంద్య ముతో కూలబడి పోవుచున్నావు. ఇది తగదు.— అని ఒక నిరుద్యోగి కుపదే శించి ప్రోత్సహించుచు సహృదయు డొకడు—

మలసి మఱ్ఱివిత్తనపు లేమొలక యొకటె
యెల్లదట్టపుటడవిలో నేపు సూపి,
పెరిగి, ప్రాఁకి, దిక్కుల కెల్ల విస్తరించెఁ;
దక్కుఁగల ప్రాఁకు లడఁగిపోఁ దనతలమున. ౨౦

గుణవంతులు సాధారణముగా ధనవంతులుగా నుండరు.— అని యుక్తి యుక్తముగా నిరూపించుచు ఒకడు లేమిని సంబోధించి—

చేరి గుణభూషితులఁ, ద్యాగశీలురఁ, బ్రవి
దగ్ధవిజ్ఞానధనుల, సంతతము సాను
రాగవర్తనమున మేల్మిఁ బ్రకటపఱుచు
చుందు; నీ విచక్షణత నేమి లోసి నెవ్వ! ౨౧

నాయకు నుల్లాసపఱుప, నాయికాసఖి, నాయికాముఖచంద్రుని యందచందములనుగూర్చి—

అన్నితిథులలోఁ జందురునందచంద
ములను దిలకింపఁ గెలసమ్ము నెలయు దేనిఁ,
జూడుమా, మెలమెల్లఁ గంచుకము విప్పి
నవ్వె డిందుబింబాస్యమో మందగాఁడ! ౨౨

వేసవి పూర్తిగా గడచిపోయినను ప్రాణవల్లభుడు ఇంటికి మరలి రాక పోవుటచేత,— ఇక భయంకరమైన వానలు ధారాపాతముగా కురిసి నీరు పాఱి, ఏళ్ళు కోళ్ళు ఏకమైపోయి, దారి డొంక తెలియకుండ పోయినతరు వాత, ఎట్లు రాగలడు?— అని భయశోక విహ్వలయై ఒక అబల, తన్ను ఊరార్చుచున్న కూర్చునెచ్చెలితో—

ఎంత వెదకినను తగిన సంకేతస్థలము అది వినా మఱొకటి దొరకక పోవుటచేత, ఒకతలిరాకుఁబోడి ఒకపాదరిల్లు సంకేతముగా ఏర్పఱుచుకొనినది.

ఆ పొదరింటికి సమీపముననే తోటకూడ నున్నది. అది తెలిసి, ఆమె చెలికత్తె— ఆపొదరిల్లు ఎల్లవేళల జనసంబాధజుష్టమై బహిరంగముగా నుండును. కాబట్టి, అది వర్షాకాలములో తప్ప తదితరకాలములలో సంకేతయోగ్యము కాదు— అని సూచించుచు, ఆమెతో—

మిట్టవల్లాల గుఱుతులు పట్టనీక,
మందమందసంచారముల్ పొందుపఱిచి,
మార్గములు, మనోరథపరంపరలకేని
దుర్గమములు గాఁగల వేవు దొడిగి యింక. ౨౩

నాగరికుఁ డొకఁడు సహచరునితో—

తోఁపులోఁ బెద్ద వెదురాకు లిప్పురుసున
గ్రుచ్చుకొన్నవి, దులుపుకో కోడల! యనఁ,
బట్టుకొన్నది మీవీఁపువయిని వెలని
పాటిదు మ్మత్తయా! యని వధువు పలికె. ౨౪

నాయికయొక్క— కోపాతిశయమును, ఎడమొగమును చూచి, క్రమక్రమముగా తానుకూడ విరక్తి పొందుచున్న నాయకునకు అట్టి విరక్తి కలుగకుండ నుండునట్లు బోధించుచు, వృద్ధదూతి—

అంతలోఁ గోప, మంతలో శాంత, మంత
లో నలీకనిర్బంధ, మాలోనఁ బూను
మచ్చరమ్మునఁ దాపసంప్రాప్తి, స్నేహ
మార్గ మిట్టిది; వింటె? కుమారకుండ! ౨౫

అవకాశము లభించినను వలపుచూపులు పఱపక మిన్నకున్న నాయికను చూచి,— ఈమెకు నామీద తలపు లేదుకా— మ్మని సందేహించుచున్న నాయకుని ప్రోత్సాహపఱుచుచు దూతిక—

కేలుదోయిళ్ళతో బెస్స గ్రోలుచున్న
దతివ, జనరవమిలితమ యయిన నీదు

పలుకులే నెనసోనను, నీటఁ గలిసి యున్న
మంచిపాలను నాడురాయుంచవో లె. ౭౬

ప్రియప్రణయవిముఖ యయిన నాయికతో చెలికత్తె సాభిప్రాయముగా సపరిహాసముగా—

సిగ్గిలవో మాటిమాటికిఁ జెలిమిఁ గాని
ముద్దుగొనముల నడుగఁగా? ముగ్ధ గాల!
నిట్టనిలువు పరీమలనిబిడ మైన
మరువమున కేల ప్రసవసంపదలు గలుగ? ౭౭

సహజముగా స్నిగ్ధలోహితము లైన తనచేతులు చూచుకొని, ఏదో ధాతురాగము అంటుకొని అట్లు అంతగా ఎఱ్ఱబడెనని భ్రమించి, మాటి మాటికి తోమి కడిగి తుడిచి చూచి, యింకను ఎఱ్ఱగా, సుగలముగల కడిగి, నానా అవస్థలం పడుచున్న ఒక ముగ్ధగాళిని చూచి, చెలికత్తె—

నాయికయొక్క మౌగ్ధ్యమును, ఆ మె చేతులయందలి సాహజికరాగ వత్త్వమును తెలియజేసి, తటస్థుడైన నాయకుని నుత్కంఠితుని చేయుచున్నదై, నాయికాసంబోధనముతో—

పాలువులై, లేఁతపనడాలమొలకలట్టులు
స్నిగ్ధలోహితతిమములౌ చేతు లుదిక,
ధౌతధాతురాగము లన్న తలఁపు లేక,
రుద్ది కడిగికొందు వి దేల? ముగ్ధగాల! ౭౮

దమ్మిడీ మిగులకుండ గోచుకొని సన్యాసులను చేసి వెళ్ళగొట్టినను, పోక, పడిపంచల బడి, విడువక బూజులు పట్టి వ్రేలాడుచున్న విటులను శరన్మేఘవర్ణనవ్యాజమున తూలనాడుచు వేలయాలిచెలికత్తె ఆ మెతో సాభిప్రాయముగా—

♦ కంటె, సైంధవగిరిసదృశమ్ము లగుచు,
విధుత తూలపింజమ్ముల విధము దోఁప,

♦ ఇందు— గిరిసాదృశ్యముచేత— కఠోరత్వము, జడత్వము; సైంధవము అనగా లవణము. తదుపాదానముచేత—ద్రుత ద్రవస్వభావము కలిగినకతన

సాధ్యముగాని, నావంటి గర్భదరిద్రునకు సాధ్యమా? ఏమి చేయుదును?— అని అతడు తటస్థుడుగా ఊరకొన్నాడుగాని వేగొండు గాదు. నీవుకూడ ముందువెనుకలు బాగుగా ఆలోచించి, నీపట్టుదల వదలుకొమ్మా!— అని సూచించుచు, నాయికతో ఒక వృద్ధపుగంద్రి—

సోఁగకన్నీరు పెట్టని సొమ్ము గాఁగఁ,
దోరములు మీఱు నీ మోముఁ దుడిచికొనుము;
నిరతముఖమండన మ్మదే నిక్క మనుచుఁ,
బుత్రి! యుద్దాని నడరింపఁబోకు వెండి. ౮౧

త్రోవలో తొడలోతు బురద పెనవేసికొని యున్నది. ఎట్లు పోవుట?— అని అభిసరింప సంకోచపడు నాయికానాయకుల మిత్రోత్సాహము కలిగించు తలపున దూతిక—

నడుమ సన్నని సైకతపు టడుసు, రెండు
ప్రక్కలందును నెంజుబురదలు గలిగి,
దారిత్రోవలమొగ మిదే, యూరిపేరి
వడఁతిపాపటవోలెఁ బేర్పడియె నెలమి. ౮౨

చాలకాలము ఎడబాటు ననుభవించినపిమ్మట ప్రియురాలియంతికమును లభింపగా, అంకురించి అతిశయించిన తత్సమాగమోత్కంఠ ఏమాత్రము ఆలస్యమునుకూడ సహింపలేదు.— అని తనసహృదయత్వమును వెల్లడించుచు నాగరికుఁ డొకడు సహచరునితో—

చెలఁగి మధ్యాహ్నమందె వేంచేసినట్టి
యల్లునకు మోహనోత్కంఠ నతిశయింపఁ
జేసె, స్నానాలగదిలోనఁ జేరి స్నాన
మాడు నిల్లాలిగాజుల యమలరవళి. ౮౩

నీ వింత పిఱికిపంద వని నే నీవఱకెన్నడు ననుకొనలేదు. ఆ మొగని వీరతాడంబరమును జూచి భయపడి, ఆ గడప త్రొక్క మానుకొన్నావా? చాలు చాలు. బాగుగా నున్నది అయనభీగము నీభీరుత్వమును!— అని ఒకనిని ఉత్తేజపఱుచుచు దూతిక అన్యాపదేశమున—

వూని గట్టి కుస్తీపట్టుగొన నొక్క
చెంప యప్పుడు సవిసిన చెవులతోడ
మసలివస్త్రాదులంగోటిముడు పుమాత్ర,
తక్కె మొనగాండ్రగుండెల నొక్కఁదొడఁగె. ౮౭

సహజముగా అందగత్తె, సుగుణమణిగణమండిత అగు నొక మల్లపత్ని, పతిచే అవమానింపబడి సిగ్గుపడక పోవుటయే గాక, మిక్కిలి ప్రసన్నభావముతో సుముఖి అయినది. ఆమె మనస్సులో భేదము నుత్పాదింప జేయు ప్రయత్నముతో మంత్రి ఆమెతో—

మగనిమీద ఇష్టము లేకపోయినను ప్రసన్నభావముతో నింట మెలగుచు నున్న యీ సుందరాంగి నేర్పుగా వలలో పడగలదని తలచి; — మ్మని, తట స్థురాలైన కాముకునకు తెలియబఱచి, వానిని లోపలపెట్టి ప్రేరేపించుచు, దూతిక స్వయముగా నామెను సంబోధించి, అతడు వినునట్లుగా—

ప్రవహాతపటవాస్యానమ్మున భర్తచే వి
ధింపఁబడినట్టి దౌర్భాగ్య మెల్లఁ బ్రకట
పఱుపఁబడెఁగదా? యిఁక సిగ్గుపడవా నీవు?
మల్లుసిల్లాల! నర్తింతు మఱచి తేను! ౮౮

మొట్టమొదట మిక్కిలి అప్పగాలంవలె మెలగి, తన్ను వలలో వేసికొని, తనగుట్టునుట్టంతయు తెలిసికొని, ఆవెనుక అపవాదప్రచారములకు గూడ ఒడిగట్టి, తనుదీయని దుష్టదూతికపై తిరస్కారభావమును వెలిబుచ్చుచు ఒకతె, చెలితో—

చెవికిఁ జవు లూరి నేవేవొ చెప్పి చెప్పి,
తివిరి, కొని నేస్త, మక్కఱ దీఱినంత,
మార్గ్మగము పెట్టి, వయిఁబడు మాయదార్లఁ,
గుక్కలంబోలె నమ్మరా దొక్క యింత. ౮౯

ఒకకులట పొరుగూరికి పోవుచున్నది. ఆమె వెనుకనే ఆమెకు సంబంధించిన విటకాండ్రు గూడ చాలమంది బయలుదేఱినారు. ఆ దృశ్యమును చూచి, మఱొక గరిత పరిహాసకముగా—

మలసి పొరుగూరి కేగును, మంచిలములు
పంక్తి వెనువెంటఁ గయికోని, పయనమున నము
నసి, యఖండితసౌభాగ్య, నాదునాను
కుక్కి నూతేంన్లు బ్రదికెఁ బేగ్గనుగాక. ౧౭

మొట్టమొదట తాను ఆసక్తురాలయి హేపోయినను చెల్లరోరాలతో, మఱియితర ప్రలోభనవ్యాపార సంపదగలవారితో, ఎన్నోరాత్రులు గడిపి కొని, అనుభవించి, అనతి కాలముననే పెండ్లాముగా నెట్టి, తన చెలిమికి స్వస్తి చెప్పిన దేవరునితో ఒకతె, సకోపాపాలంభముగా—

మఱఁది! నిజము చెప్పుము, పలు కేళుఁగు లెల్గఁగి
చాటుకారమూ మన శునస్వామి కివ్వఁ
డోరిమిం బట్టి నేర్పెఁ, బ్రయోజనమ్ము
దీఱినంత మార్గమునఁ బాఱుతీరు? ౧౮

ఉన్న ఊరిలో కావలసినంత ధనము రాబట్టి యున్నను, సంపాదించుటకు తగిన అవకాశము కూడ ఉన్నను, కాదని, ధనార్జనముకోసము శని తాపాల ములో పొరుగూరికి ప్రయాణముకట్టిన భర్తతో భాగ్యసాభిప్రాయముగా—

మేల్మి నిప్పన్నసస్యసమృద్ధి గలఁడు
హాలికుఁడు గూడ వరశరదవసరమున
దలిత నవశాలితండుల ధవల రాజ
శర్వరులఁ బాడుచున్నాఁడు స్వైరసరణి. ౧౯

బురదతోడి అడుగులజాడలు పొడకట్టి, ఈ పొలము ఒకానొక శాలి గోపికకు సంకేతస్థానమువలె కనుపట్టుచున్నదిసుమా!— అని ఊహించి, నాగ రికు డొకడు తనసహచరునితో—

మడులలో నీటిజా ళ్ళెడ్డపడుటవలనఁ
బెడదిరిగి యున్న శాలిగోపికమృదుపద,
మడుసులోన నాఁగలికట్టునడక చేత
మన్ని వేయఁగాఁ బడుచున్న దెన్న నిదిగో. ౨౦

పొలము కాపలా కాయుచున్న ఒక నిగనిగప్రౌఢమీద అభిలాష పుట్టి, ఆమెకు వినబడునట్లుగా ఒకడు తన స్నేహితునితో—

మిగుల వెలివాఱి, వంగిన మొగముతోడఁ,
గలమనికరమ్ముతో పాటు కలమగోపి,
నాఁడునాఁ డెండిపోవుచున్నది, మదిం బొ
సంగి వర్ధితసంకేతభంగశంక. ౯౧

రసికుఁ డొకఁడు తన చెలికానితో—

క్రొత్తగా నాఁగలిక్రింద దున్నఁ గుదిరినట్టి
హాలికసుతుఁ డన్నముం బెచ్చు వనుఁగుఁ జెలిని
మడికి నవ్వాలఁ జూచి, వ్రిప్పటకు బదులు
పొదివి యూడఁదీసెను గిర్ద్యముకు క్రొత్తాఁడు. ౯౨

రాత్రి కురిసిన మంచు ఆఱిపోయినతరువాత పచ్చగా, చాల పొడవుగా నూవుచేనిలోనుండి ఒకదారి స్పష్టముగా కనబడుచు పడి ఉన్నది. పొలమును పరిశీలించుచు పొలముకాపుగాడ అక్కడనే ఉన్నాడు. అదే సమయమున నాచేని గట్టుమీద క్రొత్తగ పోవుచున్న నాగరికుఁ డొక డదంతయు చూచినాడు. వెంటనే వాడు తనతో వచ్చుచున్న నేస్తకానికి కూడ ఆదారి వగ్గిరాలను చూపి, — ఈపొలములో నూగతసుఖగనికి యయిన ఒక అభిసారిక, సంకేత మేర్పఱుచుకొన్నది. ఈదారి ఆమె చేసినదే! — అని వివరించుచు—

పడినమంచుచే వెల్లని పంటనూవు
పొలములోఁ బ్రొద్దుపొడుపునఁ బొలముకాఁపు
హారితదీర్ఘముం గులటారహస్యమార్గ
ముం గని విషాద మంతగాఁ బొరయఁ డయ్యె. ౯౩

పరిజృంభిత పంచశర ప్రభావ వైభవ మైన వర్షావసరమున ప్రాణప్రియా ప్రణయరస పరవశులై ప్రవాసిజనులు మార్గాయాసమును చూడక, ఎంత దూరపు దారి యైనను లెక్కలేక, అనాయాసముగా నడచి, నడచి, త్వరితగతితో తమయింటికి జేరుకొందురు. — అని చతురు డొకడు తన సహచరునితో—

భావిగృహసుఖస్మృతిఁ జేసి బాటసారి,
కడఁగి తగ్గించినట్లుగ ఖండఖండ
ములు పొనర్చినట్లుగఁ, బీతముగఁ, బథమ్ము,
సాగి, కడచుచున్నాఁడు వర్షాగమమున. ౯౪

అనవరతము పరనిందలోనే ఆసందపడు దుర్మార్గుల దుర్భాషణవిశిఖ పరంపరలు మర్మభేదకములుగా తగిలి, చాల బాధపడుచున్న ఒక అభిమానవతి, చెలికత్తెతో సనిర్వేదముగా—

పరనిందాపరాయణులైన ఒక దుష్టునియొక్క పనులను జూచి సహింపక, ఒక ఉత్తమాంగన, చెలికత్తెతో—

బధిరు లంధులు ధన్యజీవనులు; మాన
వప్రపంచమ్మునన్ వారె బ్రదుకువారు;
చెట్టమాటలు వినఁబోరు చెవులు పెట్టి;
ఖలసమృద్ధిని జూడరు కనులు విప్పి. ౯౫

ప్రియతమునితో నిర్భరప్రణయాతిశయమున మెలగు తమసఖురాలికి చెలికత్తెలు— అంతగా ప్రేమలో పడి ఒడలు మఱచి మెలగరాదు. రోజు లన్నియు ఒకేరీతిగా నడవవు. తుదకది విషముగా పరిణమింపవచ్చును గూడ.— అని బోధింప సాగినారు. వారి యా మాట లన్నియు విని, ఆ కలకంఠి వారితో సాసూయముగా—

ఇపుడు వారించుచున్న దేమేమొ చెప్పి
యప్పు డెచ్చటి కేగెనో యఖిలజనము?
విసముపోలిక నిలువెల్లఁ బ్రేమ మెక్కు—
తఱిని గుట్టుకొన్నది నోరు దబ్బనమున! ౯౬

ఒకానొక జవరాలి యనురాగాతిశయమును వినిపించి, నాయకు నుత్సాహపఱచుచు దూతిక—

పీటపైఁ బీట లోకపది పేర్చి, పేర్చి
ప్రేముడిన్, నిన్నుఁ గనుఁగొను వేడ్కఁ జేసి,

యొక్క, ఘనజఘనస్తన గ్రక్క జాఱి
పడిన; దడియు నీ వెఱుఁగ వో వన్నకాఁడ! ౯౭

గమించుచున్న ఒక విటునకు వినబడునట్లు ఒక సహృదయుడు సహచరునితో సపరిహాసముగా—

ఎఱుఁగఁ జెప్పుచున్నది యెలుఁ గెత్తి కోఁడి,
చోరులకు, జారులకు, బాటసారులకును;
మోఁచికొని పొండు, పెనఁగుఁడు, లేచి బరువు
లెత్తుఁడు, సడలుచున్నది రాత్రిరి; యని. ౯౮

ప్రణయకలహము నభినయించుచున్న నాయికానాయకుల తగవును చూచి సఖుగాలం సఖుగాలితో—

ఒండొరులచూపుకోఁవుల నొనరి పఱపు
కొన్న దృక్ప్రసారమ్ములు గ్రన్నఁ గలిసి
పోయి, వివదించు నాయికా నాయకు లిరు
వురును నొక్కమాఱుగ నవ్వి రరిది దోఁప. ౯౯

అత్యంతము ననురక్త యయినను నాయికను తాను స్వయముగా ధీర మాని యగుటచేత యథాతథముగా ననువర్తించుచున్న నాయకుని, నాయిక యొక్క యీర్ష్యానుసారము అనువర్తింపజేయు తలంపున నాయికాసఖి, హాసనమస్కారవ్యపదేశమున, సవైదగ్ధ్యోపాలంభముగా—

సంగ్రహిత గాథారత్నకోశమును సర్వాంగసుందరముగా ముగించుచు ఆచరింపబడిన మంగళస్తుతి.—

సంజతటిజ్జలాంజలిని సంక్రమితమ్మయి, సర్వమంగళా
మంజుముఖాంబుజంబు బహుమానముఁ దీఱఁగఁ గన్నదోయికిన్
రంజితలీల మంత్రపఠనమ్మును మాని, యలీకవృత్తి, మా
వింజలియింపఁ జేయుచు జపించు నుమారమణున్ నుతించెదన్.

రసిక మనోమిళింద నికరమ్ముల రస్మని, యాగళమ్ముగా
రసములు జాలువాఱ మధురమ్మగు విందులు పెట్టి, పేర్మి పెం
చ్చ, సుధీకవివత్సల ప్రముఖ సత్కవి కల్పిత గాథలం గృతా
ర్థసమయ మైన సప్తమశతమ్ము సమాప్తిని బొందె బొందికన్.

పాలితసత్కవిత్వ కవివత్సల పాలిత పాలితాది సం
లాలితమైన గాథలకలారసనాటికలో రసాలముల్
జాలునఁ దేనియల్ గురియఁజాలిన గొప్ప కోటి యున్నది. యీ
లీలఁ గొనెన్ నృసింహకవి శేఖరుఁడో రసలోలశేఖరా. ౧౦౨

సరసతరము గాథా సప్తశతకమందు
సప్తమ శతక మతిమనోజ్ఞమ్ము ముగిసె;
నెద్ది చెవిదారిఁ బడినంత, నెడఁదలోనఁ
జొర దమృతమేని మధురతా గరిమఁ జేసి, ౧౦౩

సమాప్తము.

# సవరణ

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 18 | 14 | పడెదు | పడెను |
| 63 | 19 | గ్రామందు | గ్రామమందు |
| 9[illegible] | 12 | మహశ్రీతిం | రసస్ఫూర్తిం |
| 109 | 8 | గోరుమ్ము | గోరమ్ము |
| 119 | 24 | మెల్కని | మేల్కని |
| 121 | 9 | ను పల్లవుల్ల | పల్లవు నుల్ల |
| 123 | 11 | బోధించుటను | బోధించుటకు |
| 124 | 14 | మతిమసశ్రీతిం దనరె | మమ్మృతశందమ్ముమిగిసె |
| 136 | 21 | దుత్ఫుల్లకము | దుత్ఫుల్లకమ్ |
| 141 | 20 | చూచి చూచి | చూచి చూపి |
| 145 | 4 | యుండె | యొండె |
| 159 | 20 | ఘృతమ్ముచే | వర్ణఘృతమ్ముచే |
| 166 | 19 | చెఱుకు | చెఱకు |
| 167 | 13 | యొనె | యునె |
| 170 | 20 | మొయిళ్ళు | మొయిళ్ళ |
| 177 | 5 | మొయిలు | మొయిలు |
| 198 | 9 | సంగము | సంగమ |
| 200 | 7 | ట్లయితిము | ట్లయితిమి |
| 208 | 6 | ముద్దుగాల! | ముద్దశాల! |